పి. గణపతిశాస్త్రి



# ప్రాచీన గాథాలహరి

## 5

చతురంగతురంగం : ఇతర కథలు

యం. శేషాచలం అండ్ కో

మద్రాసు : మచిలీపట్నము : సికిందరాబాదు.

93

ప్రథమ ముద్రణ:
మే, 1967

PRAACHEENA GAATHAA LAHARI

Vol. 5 : Chaturanga Turangam & Other Stories
[Stories from Sanskrit Classics]
by P. Ganapathi Sastri

సాదా ప్రతి రూ. 2-25

మేలు ప్రతి రూ. 3-25

ముఖపత్ర చిత్రం: శ్రీ బాపు

Regd. 212864

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు వారి
'ఇంటింటా స్వంత గ్రంథాలయం' ప్రణాళిక
చందాదారులకు ప్రత్యేక ప్రచురణ.

ప్రాప్తిస్థానం:
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు
రాష్ట్రపతిరోడ్డు :: సికిందరాబాదు.

# పరిచయము

భారతీయసాహిత్యంలో కథానికారచన అత్యంత ప్రాచీనము. పంచతంత్రకథలు ప్రపంచభాష లన్నింటిలోనికి అనువదించుకొన్నారు. కథాసరిత్సాగరము, దశకుమారచరిత్రము, సింహాసనద్వాత్రింశత్సాలభంజిక మొదలయిన ప్రాచీన సంస్కృతగ్రంథాలలో మనోజ్ఞములయిన కథ లెన్నో గోచరిస్తున్నాయి.

ప్రాచీనగాథాలహరి కథ లేవీ పురాతన సంస్కృత వాఙ్మయంలోని కథానికల కనువాదాలు గాని, అనుసరణలు గాని కావు. అయితే మన పురాతన సంస్కృతాదిసారస్వతాలలో అక్కడక్కడ గోచరించిన చిన్న చిన్న సన్నివేశాలు, సంఘటనలు, కథలు కొన్ని వేర్వేరు వినూత్నకల్పనలతో, వివిధ పాత్రచిత్రణలతో విశేషంగా మార్చి ఈ రచనలు కొనసాగించాను. ప్రాచీన గాథాలహరిలోని కొన్ని కథలకు కల్హణకవి రాజతరంగిణిలోని కొన్ని చిన్నకథలు మాతృకామాత్రాలు. ఇలాగే బౌద్ధ వాఙ్మయ గాథలు కొన్ని వేర్వేరు కల్పనలతో చాలావరకు స్వతంత్రంగా రచించాను. ప్రాచీన గాథాలహరిలోని కొన్ని కథలు కేవలం చారిత్రకాలు; మరికొన్ని చారిత్రక పూర్వరంగంతో కల్పించిన స్వతంత్ర కథలు. మరికొన్నిటికి చిన్న చిన్న

ప్రాస్తావిక శ్లోకాలే మాతృకలు. మొత్తంమీద ఈ రచన లన్నింటిలోను కథాశరీరకల్పనం చాలావరకు సరికొత్త పంథాలో నడిచింది. ఒక్క పౌరాణిక కథలలో మాత్రమే కొంతవరకు మాతృకానుసరణం యథాతథంగా జరిగింది.

ఈ కథానిక లీవిధంగా రచించ వలసినదని ప్రోత్సహించినవా రాంధ్రపత్రిక సంపాదకులు శ్రీ శివలెంక శంభుప్రసాద్ గారు. వారివి సుమా రొక ఏడాదిరన్నపాటు ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురింప జేయించారు. ఆంధ్ర పత్రికాధిపతుల కిదే నా కృతజ్ఞత.

ఇక ఈ సంపుటిలోని చిట్టచివరి మూడు కథలు ఇటీవల ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రికలో వెలువడ్డాయి. దీనికి ఆ సంపాదకులకు నా కృతజ్ఞత.

ఈ కథానికల రచన, మొత్తం అనుకొన్న అయిదు ప్రాచీన గాథాలహరి సంపుటాలలోను 54 వరకు కొనసాగింది. వీటిలో వేర్వేరు రీతుల కథానికలు కొన్ని చేర్చి సంపుటాలుగా వెలువరించాలని నా సంకల్పం. మిత్రులు శ్రీ మద్దూరి నరసింహరావుగా రిది విని ప్రాచీన గాథాలహరి క్రమక్రమంగా కొన్ని ప్రత్యేక సంపుటాలుగా, ఒకటికొకటి అనుస్యూతంగా కాక దేని కది స్వతంత్రంగా ప్రకటించాలని నిశ్చయించారు. సహృదయులు, రసజ్ఞులు

అయిన వారి విషయంలో నాకిచ్చిన చేయూత ఎన్నటికీ మరువరానిది.

విఖ్యాత విద్వాంసులు శ్రీ టి. వి. రంగాచార్యులుగారీ సంపుటి సంకలనంలో, ముద్రణంలో నాకెన్నో విధాల తోడ్పడ్డారు. వారికిదే నా వినతి.

చెన్నపురము
24-5-67

పి. గణపతిశాస్త్రి

# స్వర్గీయ గృహేందిర
# శ్రీమతి సీతాదేవికి

మరలి రానే రావు! మాధుర్యమూర్తి, నీ
మాటయే జగతి విస్మరియించె! నయిన నా
మానస గృహప్రాంగణాన నీ స్మృతి, హీర
మణి దీప జాజ్వల్యమానమ్ము సతతమ్ము.

నీ కూర్మిపేరిమి వినిర్మలత భావించి,
నిట్టూర్చి, "నేనెంత నిరుపేద!" ననుకొంటి!
ఏ కానుకయిన నర్పింప నతి హీనమని
ఎద యీసడించె గానీ, సాహసించితిని!

నిత్యతరళమ్ము సాహిత్య మాణిక్యమే
నిలుచు నీస్మరణ రమణీయమై యని తలచి,
నిలిపితి భవచ్చరణనికటాన మెరయగా
నిరుపమానామూల్య నీరాజనమ్ముగా!

# విషయసూచిక

-:o:-

# చతురంగ తురంగం

**అలనాటి** దక్షిణాపథరాజధాని విజయనగరంలో హజారా రామస్వామి దేవాలయాని కెదురుగా ఉన్న పెద్ద రచ్చసావడిలో మొట్టమొదట చేరిన పౌరప్రముఖు లయిదారుగురే. కాని పొద్దు కొంచెం వాలేకొద్దీ క్రమ క్రమంగా వారి సంఖ్య పెరిగింది.

ఒక పండు ముదుసలీ, ఇంకొక తరుణుడూ ఊపిరయినా విడవనీయని ఏకాగ్రదృష్టితో చదరంగం ఆడుతున్నారు. వృద్ధమూర్తి కెవ్వరూ సాయ పడాలని సాహసించలేదు. కాని చిన్నవాడని తిమ్మన్న కేవేవో సలహా లివ్వడం ప్రారంభించారు. అయితే వారి పలుకు లేవీ అతని చెవి కెక్కడం లేదు! ఒక రిద్దరు సాహసించి తామే అతని పక్షాన ఎత్తులు వెయ్యాలని తొందర పడ్డారు కాని తిమ్మన్న కస్సుమని బుసకొట్టి, చేతులలోనించి జంతువు లూడ లాగుకొని వారి నీసడించాడు. ఆపైన ఆట మరికొంత సేపటి వరకు నిమ్మకు నీరెత్తినట్టు నిశ్శబ్దంగా సాగిపోయింది.

రామదేవాలయం ఘంటాధ్వని ఆ పరిసరంలో అంతటా మాటి మాటికీ మారుమోగింది. అపరాహ్ణ సూర్యకాంతిలో, ప్రాకారగోపుర శిఖరాల పైడి కలశాలు పసుపు పచ్చని వేయి రేకుల తామర పూవులవలె తరళించాయి. విశాలవీధిలో సాగిపోయే రౌతుల చేతులలో కళ్ళాలతో బాటు, వారి ఒరలలో కైజారుల పిడులలో రతనాల పొదు లప్పుడప్పుడు తళుక్కుమని మెరిశాయి.

వృద్ధుడు వెంకటపతినాయుడు చదరంగంలో రాజధాని అంతటా బాగా పేరెన్నికగన్న గట్టి దిట్ట. తిమ్మన్న ప్రాయంలో అతనికంటె బాగా చిన్నవాడయినా, గుర్రాల నడకల మెలికలలో మంచి మెళుకువ గడించు కొన్నాడు. శకటాలు, ఏనుగులు, చిట్టచివరికి మంత్రి కూడా చెయ్యిదాటి

పోయినాసరే, అతనికి లక్ష్యంలేదు. గుర్రాలంటే చాలు. కాలికి, మెడకు లంకెవేసి ఎంతెంతటివారి ఆటలయినా ఇట్టే కట్టించివేస్తాడు.

వెంకటపతికీ, అతనికి ఇటీవలే గట్టి పోటీ పడింది. నాయనిది బాగా నిదానమయిన ఆట. మిన్ను విరిగి మీదపడినా ఎక్కడా తొణకడు! బెణకడు! మరి లాభంలేదు, ఆట కట్టిపోయిం దన్నాసరే! ఎలాగో అలాగ బయటపడి గెలుపు తనదే అనిపించుకుంటాడు. కాని తిమ్మన్న ధోరణి వేరు. కళ్ళు మూసుకుని ఎదటివారి బలంలోలోపలికి చొరబడి, చిందర వందర చేసిచేసి ఆ కంగారులో ఒక రెండు జంతువు లెక్కువగా చేజిక్కించు కొంటాడు. గుర్రాలు రెండు మాత్రం ప్రాణప్రదంగా సంరక్షించుకుం టాడు. అతని చేతిలో చిట్టచివరి కొక కుంటి గుఱ్ఱం మిగిలినాసరే! అది తెరపిలోంచి మెరుపులా దూకుతుంది! ప్రత్యర్థి గుండెలో బల్లెంలా పొడుచుకుంటుంది. కన్ను మూసి తెరిచేలోగా ఆట కట్టిపోతుంది. గుర్రాల నడకలలో చిన్ననాటినించి అలవడిన నైపుణివల్లనే కుర్రకారు ఆటగా ళ్ళందరిలోను అతనికి 'చతురంగ తురంగ' అన్న ఘన బిరుదం లభించింది.

ఆట మాంచి పట్టయిన ఘట్టంలో పడింది. ఎలాగో అలాగ గుర్రాల జంట కాజేస్తే తిమ్మన్నకి మరి చేతులాడవని వెంకటపతి గ్రహించకపోలేదు. సందు దొరికినప్పుడల్లా వాటి సంహారంకోసం శాయశక్తులా ప్రయత్నిం చాడు. కాని సాధ్యపడలేదు. అంతలోనే అతని తురంగమాలు రెండు శకటంతో కలిసి చెంగు చెంగున ఎగిరి వెంకటపతి బలంలోలోపలికి చొచ్చుకుపోయాయి. ఆ పైన తిమ్మన్న ఆ శకటానికొక గట్టి బంటుటంకం అతికించాడు. దానితో అది వెంకటపతి చతురంగబలం మధ్య ఒక పెద్ద మరమేకులా బిగుసుకుపోయింది. ఆటంతా అకటావికటంగా తయా రయింది!

ఆ విధంగా పరిస్థితి తారుమారయ్యేసరికి అక్కడికి చేరుకున్న ఆట గాళ్ళందరు వెంకటపతి నాయకుని పక్షం వహించారు. సన్న సన్నని కను సన్నలతో చిన్నచిన్న సలహా లందించారు. ఆటలోపడి సతమత మవుతున్న వారికి కూడా తోచని మంచి మంచి ఎత్తు లొక్కొక్కప్పుడు పైవారి కిట్టే స్ఫురిస్తాయి. ఆ రహస్యం గ్రహించిన వెంకటపతి వారొక్కొక్కరు అతి

రహస్యంగా తన చెవిలో ఊదిన పన్నాగాలతో, తెరపి ఎత్తులతో కొంచెం పుంజుకున్నాడు. ఆవిధంగా వారందరు ఏకమై తనమీదికి విజృంభించగానే తిమ్మన్న అట్టుడికినట్టుడికి పెంపెక్కిన అక్కసుతో అత్యద్భుత నైపుణితో తన గుర్రాలజంట నడిపించాడు.

అంతలో నలుగు రైదుగురు నూతన ప్రేక్షకు లక్కడికి చేరుకొన్నారు. వారందరు నిశ్చల శిలా ప్రతిమలవలె నిలబడి ఏకాగ్ర దృష్టులతో ఆ అపూర్వ చతురంగ ఖేలనం పరిశీలించారు. క్రమక్రమంగా వెంకటపతి బలం బాగా క్షీణించింది. మంత్రి, రెండు ఏనుగులు తప్ప మిగిలినవన్నీ తిమ్మన్న జంట గుర్రాల ధాటి కాగలేక పక్కనేఉన్న లక్క బరిణలో తల దాచుకొన్నాయి. వెంకటపతికి మరి ఊపిరాడలేదు.ముచ్చెమటలు పోశాయి. తిమ్మన్న బలంలో నాలుగైదు బంట్లు తప్ప మిగిలినవన్నీ చెక్కు చెదరకుండా అలాగే నిలబడి ఉన్నాయి. చాలావరకు జంతువులన్నీ పోయిన తరవాత అలాగే పట్టుకుని వేళ్ళాడితే చిట్ట చివరికి తిమ్మన్న ఉయ్యాలతోసి రాజుతో ఆట కట్టించేటట్టు కనబడ్డాడు. మరి గత్యంతరం లేక వెంకటపతి ఉసూరుమని నిట్టూర్చాడు:

"తిమ్మన్నా! ఎందుచేతనోగాని ఈవేళ ఎత్తు ఒక్కటీ హుందాగా పడలేదు. ఇక లాభంలేదు! ఆట ఇచ్చేస్తున్నాను. తీసుకో!"

అంతలోనే "అదేమిటండీ! నాయనింగారూ! అలాగ నిరుత్సాహపడిపోతారు! ఇంకా రెండేనుగులు, మంత్రి మిగిలి ఉన్నాయిగా! ఇంకో రెండెత్తులు వేసిచూడండి!" అన్నాడు ఆయనపక్కన నిలుచున్న ఒక నూతన ప్రేక్షకుడు.

అందరూ ఆ కొత్త సలహాదారు వైపు కళ్ళెత్తి చూశారు. ఆకర్ణాంత విశాల నేత్రాలు! నిత్య వ్యాయామంతో బలిష్ఠమయిన నిండయిన విగ్రహం! రాజసం ఉట్టిపడుతున్న వెడద నెన్నుదురు! ఖంగుమని మారుమ్రోగిన గంభీర కంఠస్వరం!

"మరి లాభంలేదు బాబూ! మంత్రి ఏనుగులు సరి సమానంగా కొట్టిపారేస్తే ఇక మిగిలేవి వట్టి బంట్లే!"

"పోనీ ఈ ఒక్క చిన్న ఎత్తు వేసి చూడండి!"

అయితే అక్కడ నిలబడిన మేటి ఆటగాళ్ళ కెవరికీ వెంకటపతి బలం నిలబడుతుందన్న నమ్మిక కలగలేదు. అయినా ఆ నూతన వ్యక్తి సలహా ప్రకారం ఎత్తువేసి చూడమని అతనిని ప్రోత్సహించారు. ఆపైన ఆ కొత్త ప్రేక్షకుడు మంత్రిని ఏమూలగా నాలుగు గళ్ళు నడిపించవలసిం దని సూచించాడు. వెంకటపతి మరి కాదనలేక ఆ ఎత్తు వేశాడు.

ఆలోగా బాగా ఆలోచించుకొన్న తిమ్మన్న శకటం బల్లెంలా దూసుకుపోయి ఆ మంత్రి కెదురుగా నిలిచింది. వెను వెంటనే వెంకట పతి ఇంకొక గుర్రపు ఎత్తు వేశాడు. అదేక్షణంలో ఆ నూతనవ్యక్తి కలగ జేసుకొని మంత్రి నింకొకచోట వేశాడు. ఆ గందరగోళం భరించలేక తిమ్మన్న రుస రుసలాడుతూ మండి పడ్డాడు:

"ఇదేమి టీ ఆట! ఇద్దరూ చెరొక ఎత్తు వేస్తే ఎలాగ? ఇదేమన్నా చదరంగం ఆటా? లేక వట్టి దొమ్మీ పోట్లాటా?"

వెను వెంటనే వెంకటపతి స్థాలిక కరుచుకుని తన గుర్రాన్ని వెనక్కి మళ్ళించాడు. మరుక్షణంలోనే తిమ్మన్న గుర్రం మెరుపులా చెంగలించింది. అంతలోనే వెంకటపతీ, ఆ నూతన వ్యక్తీ తిరిగి అదేవిధంగా ఒకే క్షణంలో రెండెత్తులు వేశారు. దానితో తిమ్మన్న తోక తొక్కిన కోడెత్రాచులా ఆ కొత్త వ్యక్తి కేసి చూసి కస్సుమన్నాడు:

"ఇదిగో! ఏమిటయ్యా! మధ్య నీ గొడవ! బొత్తిగా ఆట మర్యాద తెలియని వట్టి మోటు మనిషిలా ఉన్నావే! అంత ఉమ్మాస్సు ఎక్కువగా ఉంటే నువ్వే ఆడరాదూ?క్షణంలో నీ సంగతి తేల్చివేస్తాను!ఏం ఉయ్యాల్ల తోసిరాజు చేయించుకుని నలుగురిలో తలవంచుకోవాలని ఉందా?"

ఆ నూతన పురుషుడా పరుషప్రసంగం విన్నా విననట్టే తదేక ధ్యానంతో తన కట్టెదుటి చతురంగబలం పరిశీలించాడు. కాని అంతకు మునుపే కొత్తగా వచ్చినవారి ముఖా లొక్కసారిగా జేవురించాయి. వారిలో ఒకడు రూక్షవీక్షణాలతో గొంతెత్తి గర్జించాడు:

"మాటలు తిన్నగా రానీ! కాస్త పెద్ద-చిన్న తారతమ్యం గమ నించనక్కరలేదూ! నోటికి వచ్చినట్టు మాట్లాడడమేనా? ఉయ్యాలతోసి

చేస్తావేం? ఉయ్యాలతోసి? మహా మొనగాడవు బయలుదేరావులే! మరి నోరు మెదిపి మాడు. విన్నేం చేస్తానో!"

దానితో తిమ్మన్న మరింతగా రెచ్చిపోయాడు!

"ఏమిటయ్యా నువ్వు చేసేది? ఏది ఏమయినా సరే! ఈవేళ అన్న మాట అక్షరాలా నెగ్గించుకు తీరతాను. లేకపోతే ఇద్దరాడడ మేమిటి? రండి! మీ ఇద్దరికీ కూర్చోబెట్టి ఇప్పుడే ఉయ్యాలతోసి చేసి నోళ్ళు కట్టిం చేస్తాను!"

అంతలోనే వెంటపతి లేచి నిలబడి వారిద్దరిని శాంతింపజేసి నూతన వ్యక్తికేసి చూసి బ్రతిమాలుకొన్నాడు: "బాబూ! నా కీవేళ వల్లమాలిన వ్యవహారం ఒకటి వచ్చిపడింది. ఇందుచేత మనస్సు సరిగా లేక ఎత్తులు తిన్నగా పడంలేదు. కాస్త ఈ ఆట పూర్తిచేసి కట్టివేస్తేనేగాని ఈ బొడ్డుచర్లవారబ్బాయి తలబిరుసుతనం తగ్గేటట్టు కనబడటం లేదు. కొంచెం నా బదులు మీ రిక్కడ కూర్చుని ఆడండి! నేను వెడతాను! సెలవు!" అని చల్ల చల్లగా అక్కడినించి తప్పుకొని తన భవంతి వైపు తరలిపోయాడు.

ఆ తరవాత ఆ కొత్త వ్యక్తికీ, తిమ్మన్నకీ మధ్య నడిచిన ఆట మరింత పట్టుగా సాగింది. వెంకటపతి వేసిన ఆట పునాదు లంతగా బలమైనవి కావు. అందుచేత తిమ్మన్న తీవ్రాశ్వ ధాటికి తట్టుకోలేక అది అనతికాలం లోనే పురాతన శిథిల భవంతిలా కూలిపోయింది! నూతన ప్రేక్షకులలో కొంతమంది నవీన వ్యక్తితో చేతులు కలిపి శతవిధాల ఆట పోరాటం కొన సాగించారు. కాని బలం మరి తిరగబడలేదు. అంతలోనే ఉప్పొంగుతున్న విజయోన్మాదంతో తిమ్మన్న హేలగా నవ్వి అధిక్షేపించాడు:

"అయ్యా! మా రాజధాని ఆట మీ కలవాటు లేదులా ఉంది! ఇదిగో! పహా! ఈపైన సరిగా రెండేరెండు ఎత్తులతో ఉయ్యాలతోసి ప్రారంభిస్తాను. మీరు మాటాడక ఆట ఇచ్చేస్తారా, లేకపోతే ఆ మహారాజ మర్యాద కాస్తా జరిగించమంటారా?"

అయినా ఆ నూతన పురుషుని పెదవిపై చిన్న చిరునవ్వు మాత్రమే తరలింది. మరుక్షణంలోనే అతని పక్కనే నిలుచున్న ఇంకొక ప్రేక్షకుడు చప్రున ఒరలోనుంచి బాకుదూసి తిమ్మన మీదికి దూకి—

"జాగ్రత్త! ఇంకొక మాట మిగిలావంటే రక్తం కళ్ళ చూస్తాను. ఆడేది ఎవ్వరనుకొంటున్నావు! కళ్ళేమన్నా మూసుకు పోయాయా?" అని గొంతెత్తి ఉద్ఘోషించాడు.

తిమ్మన్న లోలోపల చెలరేగుతున్న దురాగ్రహం మరి నిగ్రహించుకోలేక "పోడవరా! పోడు! ఇది రాయలవారి రాజ్యమా! లేక భామినీ రాజ్యమా? పోడిచావంటే మరి ప్రాణాలతో బ్రతికి బయటపడగలవురా?" అని ఒక్కదూకుతో అతనితో తలపడబోయాడు. అంతలోనే వేరొక ప్రేక్షకుడు వారిద్దరిని వేరుచేసి తిమ్మన్న కేసి, నిలువునా చీల్చివేసేటట్టు చూసి "చాలు చాలులే! నేర్చావు ప్రగల్భాలు! బాపనయ్యవు కాబట్టి బతికిపోయావు! లేకపోతే నీ తల ఈపాటికి కెగిరిపోవలసిందే!" అని హెచ్చరించాడు. ఆపైన క్షణకాలం వారిమధ్య రభస రవంత చల్లారింది. అంతలోనే ఆ నూతనవ్యక్తి అక్కడినించి కదిలి తన కనతిదూరంలో రామ దేవాలయంలో అతి రహస్యంగా ఆయత్తంచేసి ఉంచిన భద్రగజంమీద అధిష్ఠించి "జయ! దక్షిణాపథాధీశ్వరా! జయ! జయ! కృష్ణరాయ మహీంద్రా! జయ!" అన్న బరాబరుల కోలాహలంతో క్రమ క్రమంగా అదృశ్యు డయినాడు!

తిమ్మన్న కాపైన రెండు మూడు నిమిషాలదాకా శరీర స్పృహే కలగలేదు. తరవాత అదంతా ఏదో విచిత్ర స్వప్నంలా భాసించింది. నిలువునా నిర్ఘాంతపడిన అతనికి తాను చేసిన తప్పిదం గ్రహించడానికెంతో సేపు పట్టలేదు. చదరంగంలో సాధారణులయిన రాచవారిని కూడా 'షహో' అని హెచ్చరించడం ఆట మర్యాద కాదు. రాజు అని సూచించడానికెంతో మర్యాదగా అంగుళితో నిర్దేశించి వారి దృష్టి అటువైపు మరలించాలి. ఆపైన తోసిరాజనడం వారి యెడల ఎన్నటికీ మన్నించరాని మహాపరాధం! సామాన్య క్షత్రియులకే అది మహావమానకర మయినప్పు డిక దక్షిణాపథానికంతటికీ ఏకైక సార్వభౌములయిన శ్రీకృష్ణదేవరాయల ఎడల అది ఎంతటి తలవంపయిన మాట! తానంతటితో ఊరకోలేదు. 'మోటు మనిషి' అని అధిక్షేపించాడు! ఆపైన ఉయ్యాలతోసిరాజుచేసి క్షణంలో ఆట కట్టిస్తానని గర్జించాడు. ఆ పరిస్థితిలో చక్రవర్తి అంగరక్షకుడు బాకు

చూసి మీది మీది కురకడంలో ఆశ్చర్యం ఏమి ఉంది! ఆ మహా ప్రభువు స్వయంగా కలగజేసుకుని సన్నని కనుసన్నతో నివారించి ఉండకపోతే తా నీపాటికి పరలోకం చేరుకొని ఉండవలసిందే!

అయితే తను కాయన సార్వభౌములని తెలియదు. ఏమాత్రం తెలిసినా అంత దురుసుగా మాట్లాడి ఉండకపోను. రాజధానిలో అంతటా అధికారుల విధినిర్వహణ పరిశీలన కోసం రాయలవారీ వేళ ప్రచ్ఛన్న వేషంతో పర్యటిస్తున్నారు కాబోలు! అప్పుడప్పుడా విధంగా విజయనగర విహారం ఆయన కొక పరిపాటి అని తానంతకుమును పెప్పుడో కర్ణాకర్ణిగా విన్నాడు. అంతేకాని ఎన్నడూ స్వయంగా ఆ వింత సందర్శించి ఉండలేదు. చూచిఉంటే కొంచెం ముందు జాగ్రత్తతో వ్యవహరించిఉండును. ఇక గతజలసేతుబంధనంవల్ల ప్రయోజనమేమి ఉన్నది! ఏది ఏమయినా తనవల్ల వల్లమాలిన మహాపరాధమే జరిగిపోయింది! అయితే తన అజ్ఞానం వల్లనే అంతటి పొరబాటు జరిగినదని చక్రవర్తి గ్రహించి రవంత మన్నించకపోరని తిమ్మన్న మళ్ళీ లోలోపల కొంత సమాధానపడ్డాడు.

కాని అతని కా ఆలోచన అంతగా సంతృప్తి కలిగించలేదు. సార్వభౌములు తన అపచారం చూచీచూడనట్లు ఉపేక్షించినా ఆయన ఇచ్చకం కోసం అహోరాత్రాలదేపనిగా నిరీక్షించే రాజాధికారులది ఎంతమాత్రము క్షమించరని తిరిగి మనసులో బాగా మథనపడ్డాడు. వారివల్ల తనమీదే కాక తన కుటుంబంమీద కూడా ఏదైనా ఒక ఘోరాపద విరుచుకు పడవచ్చునని మళ్ళీ ఎంతో భయపడ్డాడు. సరే, కానున్నదేదో కాకమానదని గుండె రాయి చేసుకొని ఇంటిముఖంపట్టి చరచరా నడక సాగించాడు.

తిమ్మన్న ఇంట్లో అడుగు పెట్టక పూర్వమే ఆనాటి విడ్డూరం ఆ వీధిలో అంతటా కార్చిచ్చులా వ్యాపించింది. బెదరుతూ బెదరుతూ గుమ్మంలో అడుగు పెట్టేసరికి అతని తండ్రి శివావధాని ఎదురుగావచ్చి ఒక్కసారిగా విరుచుకు పడ్డాడు:

"తిమ్మన్నా! ఎంతపని చేశావురా ఈవేళ! కాస్త అష్టాధ్యాయి కంఠతః వల్లించరా నాయనా! అంటే నా మాట లక్ష్యపెట్టక రచ్చ సావిడికెక్కి తగుదునమ్మా అని చదరంగం ఆడుతూ కూర్చున్నావా? పైగా

కన్ను మిన్ను గానక తాతలనాటినుంచి మనకి మడిమాన్యాలిచ్చి పోషించిన ధర్మప్రభువు రాయలవారినే అనరాని మాటలతో అవమానించావా! నీ కిదేం పిదప కాలం వచ్చిందిరా! కాకపోయినా ఆ తుంటరి మేనమామల పోలిక ఎక్కడికి పోతుంది? వాళ్ళ ఇంట పొద్దస్తమానమూ ఆ పాడు చద రంగం ఘోషేగాని పట్టుమని ఒక్కడికయినా అక్షరంముక్క అంటిందీ!''

ఆ ఆక్షేపణ వినీ వినగానే అతని తల్లి రుసరుసలాడుతూ అక్కడికి వచ్చి ''మా వాళ్ళ కేం లోటు వచ్చింది? వీరనరసింహారాయలవారి వద్ద చదరంగం మాన్యం సంపాదించి కాలుమీద కాలువేసుకొని కూచుని మహారాజుల్లా కాలక్షేపం చేస్తున్నారు!'' అని తన పుట్టింటివారిని వెనకే సుకువచ్చి తండ్రితో పెద్ద వాదులాట ప్రారంభించింది. క్రమక్రమంగా అది చినికి చినికి ఒక పెద్ద గాలివానలా తయారయింది. వా రిద్దరు ఆ గొడవలో పడి అసలు తనమాటే పట్టించుకోవడం మానివేశారని గ్రహించి తిమ్మన్న పిల్లిలా అక్కడినుంచి తప్పుకుని పెరటిలో పనసచెట్టు చుట్టూరా కట్టిన తిన్నెమీద గావంచా పరుచుకుని మేను వాల్చాడు. ఆ వృద్ధ దంపతులు తమలో తా మలాగే మరికొంతసేపు తగాదాపడి బాగా అలసిపోయి క్రమ క్రమంగా శాంతించారు. ఆ రాత్రి అంతా తిమ్మన్న కొక్క కోడి కును కయినా పట్టలేదు!

మరునాడు మధ్యాహ్నం ఇంచుమించు రెండుఝాముల పొద్దెక్క దాకా తిమ్మన్న నిద్రమత్తులోనే ఉన్నాడు. మూడోయామం తిరిగేసరికి నరాసరి రాయల కొలువుకూటంనించి ఒక పల్లకీ వచ్చి శివావధాని ఇంటి ముందు నిలిచింది. దానితోబాటే నిలుచున్నపాటుగా రావలసిందని రాజాధి కారి ముఖతః తిమ్మన్న కొక శ్రీముఖం కూడా అందింది! ఆ ఉత్తరువు పుట్టడానికి గల ప్రధాన కారణమేమో తండ్రీ కొడుకుల కిద్దరికీ కూడా అంతుపట్టలేదు. అదీగాక ఆ విషయమై ఆలోచించడానికి వ్యవధి కూడా కనబడలేదు.

తిమ్మన్న అంతకుమును పెప్పుడూ రాయల పేరోలగంలో అడుగు పెట్టలేదు. కాని తాతలనాటి పాత అంగరఖా ఒకటి ధరించి శిరస్సుమీద ఒక ఉష్ణీషం పెట్టుకొని ఆదరా బాదరాగా పల్లకీ ఎక్కి ప్రయాణ మయి

నాడు. శివావధాని వీధి మలుపుదాకా పల్లకీ వెంట వెళ్ళి "బాబూ! తిమ్మన్నా! రాచవారితో ఛేటీ నాగుబాములతో చెలగాటం సుమా! బహు భద్రం! జాగ్రత్త!" అని ముమ్మారు హెచ్చరించాడు. "ఇంత కీ ఉత్తరు వెందుచేత పుట్టిందో తెలియచెప్పాడీ. అనవసరమయిన మథన ఎందుకు?" అని తిమ్మన్న తండ్రికి ధైర్యం చెప్పి ఓదార్చాడు. కాని లోలోపల అతనికి బాగా బెదురుగానే ఉంది.

అతడలా పరధ్యానంగా ఆలోచిస్తూండగానే పల్లకీ చక్రవర్తి భవనం కక్ష్యాంతరాలన్నీ దాటి సభాగారం సింహద్వారంలో ప్రవేశించింది. పల్లకీ దిగి నెమ్మది నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ కొలువుకూటంలో ప్రవేశించిన తరువాత తిమ్మన్న మరి తన కన్నులే నమ్మలేక నిలువునా నిర్ఘాంతపడ్డాడు. అతని కెదురుగా ఇంద్రనీలాలతో, పద్మరాగాలతో మలిచిన చతురంగబలం వేర్వేరు రంగుల మాణిక్యాలతో రూపొందించిన సమున్నత పీఠం మీద అమర్చబడి ఉన్నది. దాని కిరువైపులా వేసిన బంగారు సుఖాసన పరసన ఇద్దరేసి చామరగ్రాహిణులు శిరస్సులల్లన వంచుకొని సేవావసరంకోసం నిరీక్షిస్తున్నారు. అంతేగాని తిమ్మన్న కక్కడ ఇంకెవ్వరూ గోచరించలేదు. చక్రవర్తి ఆజ్ఞలోగల అంతరార్థం అతని కప్పటికి రవంత బోధపడింది.

అంతలోనే మహాప్రధాని తిమ్మరుసయ్య అక్కడికి విచ్చేసి అల వోకగా తిమ్మన్నమీద ఆదరదృష్టి ప్రసరింపజేసి "నీవా నాయనా! ఇంకా ఎవరో అనుకున్నాను! శివావధానులుగారి కుమారుడవు కాదూ! అయితే ఈ చిన్నవయస్సులోనే చదరంగంలో ఇంతటి చాకచక్యం ఎప్పుడు సంపాదించావయ్యా! స్వయంగా సార్వభౌములే నీతో ఒక ఎత్తు వేద్దామన్నంత గా కుతూహల పడుతున్నారు!" అని అభినందించాడు. తిమ్మన్న, ఆ ప్రశంసతో లోలోపల ఉప్పొంగినా, ఎంతో అడకువతో "తమవంటి పెద్దల ఆశీర్వచన బలంవల్లనే నే నీ ఆటలో కొంచెం ప్రవేశం సంపాదించుకొన్నాను. అయితే నాదొక్క మనవి!" అని చేతులు జోడించి నిలుచున్నాడు. 'ఏమిటది?' అన్నట్టు మహామాత్యు డతని వైఖరి జిజ్ఞాసాదృష్టితో పరిశీలించాడు.

"ఏమీలేదు! సామాన్యుల నందరిని చదరంగంలో ఓడించినట్టు సార్వభౌముల నాటలో జయించడం భావ్యం కాదేమో అని భయపడు తున్నాను."

"నీ కా సంకోచం ఏమాత్రము ఉండనక్కరలేదు! దీనిలో మహా రాజ మర్యాదా లోపం ఏమీలేదు. నీ యావచ్ఛక్తి వినియోగించి వారితో ఆడి జయించి పురస్కారా లందుకోవచ్చును. దానికేమి!"

ఆవిధంగా భరవసా ఇచ్చిన తరవాత మహామంత్రి అతని ఔద్ధత్యాని కెంతో ఆశ్చర్యపడి, "తిమ్మన్నా! వారితో ఆటంటే మాటకాదు సుమా! ఈ విషయంలో వారి నోడించగలవా రింతవరకూ బయలుదేరలేదు! ప్రభువుల చతురంగ చాతుర్యం ఎటువంటిదో నీ కింకా బాగా బోధపడ లేదేమో!' అని హెచ్చరించాడు.

అంతలోనే పెద్దనామాత్యునితో కలసి కృష్ణదేవరాయ లక్కడికి విచ్చేసి తిమ్మన్నపై సగౌరవ కటాక్షం ప్రసరింపజేసి చల్లని చిరునవ్వుతో పలకరించి చతురంగపీఠం దగ్గర తనకోసం ప్రత్యేకించిన స్వర్ణసింహాసనంపై సమాసీనుడయినాడు. చక్రవర్తిపార్శ్వంలో ఆంధ్రకవితా పితామహుడు, మహాప్రధాని సుఖోపవిష్టులయిన పిమ్మట తిమ్మన్న తన కేర్పరచిన సము చితాసనంమీద స్థిరపడి రాయల కనుసన్న అనుమతితో ఆట ప్రారం భించాడు.

మొట్టమొదటినుంచి తిమ్మన ఉత్సాహావేశంతో ఉరకలు వేస్తూ మిక్కిలి మెళకువతో తన బలం ముమ్మందు కురికించాడు. దక్షిణాపథాధి పతి ధోరణిలో ఆటువంటి తొందరపా టెక్కడా గోచరించలేదు. అలాగ ఒక అరగడియ గడిచేసరికి తిమ్మన్న హృదయంలో గెలుపు తనదే అన్న గట్టి నమ్మిక కలిగింది. ఆ తరవాత అకస్మాత్తుగా ఇంకొక ఎత్తువేసి "మహా ప్రభూ! ఈ గుర్రపు ఎత్తులో మీ మంత్రి పోక తప్పదు! తా మది గమ నించలేదేమో!" అన్నాడు.

ఆ అహంకారధోరణి గమనించి మహా ప్రధాని, పెద్దనామాత్యుడు ఒండొరులవైపు చూచుకొని ముసిముసి నవ్వులతో ప్రసంగించుకొన్నారు. అయినా కృష్ణదేవరాయలు మంత్రిని మరలించలేదు. ఆ విషయమే గమనిం

చన ట్టొక చిన్న ఎత్తు వేసి తిమ్మన్న పైఎత్తుకోసం పరీక్షించాడు. మరు క్షణంలోనే సార్వభౌముని మంత్రి తిమ్మన్న అశ్వఘాటితో ఆ పక్కనే ఉన్న దంతపు బరిణెలో తలదాచుకొన్నాడు. మంత్రి పోవడంతో రాయల వారి ఆట బాగా దెబ్బతిన్నదనీ, ఇక మిగిలిన ఆట హేలగా ముగించి జయం చేజిక్కించుకోవచ్చుననీ తిమ్మన్న లోలోపల ఎంతయినా ఉబలాట పడ్డాడు. కాని రాయల గుర్రాల జంట దాటులతో, బంట్ల పోటులతో రెండు మూడు ఎత్తులలోనే అకస్మాత్తుగా అతని ఆట కట్టింది!

విజయం తనదే అన్న పూర్ణ విశ్వాసంతో ఉబ్బి తబ్బిబ్బయిన తిమ్మన్న కా హఠాత్పరాజయంతో తలకొట్టివేసినట్టయింది. కత్తివేటు వేసినా ముఖం మీద ఎక్కడా నెత్తురుచుక్క కనబడే జాడే పొడకట్ట లేదు! రాయ లది గమనించి "చతురంగ క్రీడలో జయాపజయాలు కావు పరిశీలించవలసినవి! బలం నడిపించడంలో చాకచక్యమే ముఖ్యం! ఇన్నాళ్ళ నుంచి ఇంతటి చాతుర్యం నే నెక్కడా గమనించలేదు!" అని అపూర్వా దరంతో తిమ్మన్న నభినందించాడు. అల్లన లేచి పెద్దనతో, ప్రధానా మాత్యునితోబాటు అభ్యంతర మందిరంలో ప్రవేశించాడు.

ఆ అభినందనతో కొంచెం తేరుకొన్నా, తిమ్మన్న, పరాజయావమా నంతో బాగా కుంగిపోయాడు. వంచిన తల మరి పైకెత్తలేక ఉసూరుమని నిశ్వసించాడు. అంతలోనే దుశ్శాలువ ఉంచిన బంగారు పళ్లెరంతో ప్రధానామాత్యు డతనిని సమీపించి, "నాయనా! చక్రవర్తి స్వయంగా నీ చాతుర్యం పరిశీలించి చాలాచాలా మెచ్చుకొన్నారు. ఇదిగో! ఇది వారి బహూకృతి" అని అందీయబోయాడు.

కాని తిమ్మన్న కా బహుమాన స్వీకరణ బొత్తిగా రుచించలేదు. ఎవరైనా అడిగితే ఆటలో ఓడిపోయిన తా నే ముఖం పెట్టుకొని ఆ వృత్తాంతం వెల్లడించగలడు? అందుచేత చేతులు జోడించి ప్రధానా మాత్యుని కతివినీతుడై విన్నవించాడు:

"నన్ను మన్నించగలరన్న ధైర్యంతో ఒక చిన్న విషయం విన్న వించుకొంటున్నాను. ఈ గౌరవం రాయలవారి పరమౌదార్యాని కొక గొప్ప తార్కాణం. అయితే నా కీ పురస్కారం స్వీకరించే అర్హత అవంత

కూడా లేదేమోనని మిక్కిలి ఆందోళన పడుతున్నాను. ఇందుచేత ప్రస్తుతానికిది రాజాస్థానంలోనే ఎక్కడో ఒకచోట ప్రదర్శించే ఏర్పాటు చేయించండి. అటువంటి అర్హత కలిగినదని ధైర్యం కలిగినప్పుడిది నా అంతట నేనే వచ్చి స్వీకరిస్తాను. చక్రవర్తికి నామీద అనుగ్రహం కలిగినదని సెలవిచ్చారన్న ధైర్యంతో ఇంకొక్కవరం కోరుకోవాలని సంకల్పించుకొన్నాను."

ఆ కడపటి ప్రార్థన వినగానే మహామంత్రి నెన్నుదుటిపై ప్రశ్నార్థకమైన బొమముడి విరిగింది. వెంటనే తిమ్మన్న లోలోపలి కోరిక వ్యక్తీకరించాడు:

"రాయలవారితో తిరిగి ఇంకొక్కమారు చదరంగం ఆడాలని నేనెంతైనా ఉవ్విళ్ళూరుతున్నాను. నేను వారిని జయించవలెనన్న అహంభావంతో తమకీ విషయం విన్నవించుకోవడంలేదు. వారిదగ్గర కొన్ని గొప్ప ఆటమెళుకువలు నేర్చుకోవాలన్న తహతహతోనే నేనీ విధంగా నివేదించుకొంటున్నాను. ఎలాగయినా వారు నాకీ వరం కటాక్షించేటట్టు సాయపడవలసినదని కోరుకొంటున్నాను. ఇంతకన్న నేనిక అపేక్షించ తగినదేదీ లేదు."

మహాప్రధాని అదివిని కొంచెంసేపాలోచించి బొమముడి విరిచి ప్రసంగించాడు:

"తిమ్మన్నా! వారిటీవల కళింగ విజయభేరి మోగించారని అందరికీని అవగతమయిన విషయమే గదా! అందుచేత అహోరాత్రులు వారీ జైత్రయాత్రానన్నాహాలలో తలమునకలవుతున్నారు. నాకే వారి దర్శనం సాధ్యపడడంలేదు. అందుచేత తిరిగి వారి కెప్పటికి తీరిక చిక్కగలదో నేనిప్పుడు చెప్పలేను."

అయినా తిమ్మన్న నిరుత్సాహ పడలేదు. తిరిగి అంజలి ఘటించి "ఎప్పటికి సానుకూలపడితే అప్పుడే తిరిగి వారి దర్శనం చేసుకొంటాను. తాము సంకల్పిస్తే నెరవేరనిది ఏమీ ఉండబోదని నా గట్టి నమ్మిక. ఒకవేళ తాము సంకల్పించినా కోరిక నెరవేరకపోతే అది నా తారాబలమే అనుకొంటాను" అని సవినయంగా నమస్కరించి సెలవు తీసుకొన్నాడు.

ఆపైన మరికొన్నాళ్ళదాకా విద్యానగరి యావత్తూ జైత్రయాత్రా సన్నాహాలతో భోరుమని మారు మ్రోగింది. ఎక్కడ చూచినా ఆశ్విక సైన్యాల చెంగలింపులే! ఎక్కడ విన్నా కొమ్ము ఏనుగుల ఘీంకారాలే! ఆయా సైన్య సంభారాలతో కదలిపోతున్న శకటశ్రేణుల కోలాహలాలే! కాల్బలాల వీరగర్జనలే! ఆ సమయంలో తిమ్మన్నకూ చతురంగ బలాలతోబాటు సాగిపోయి శాత్రవుల సైన్యాలలో జొరబడి చీల్చి చెండాడి వీరాధివీరుడన్న విజయ బిరుదం గణించుకోవాలని లోలోపల ఎంతయినా కౌతూహలం కలిగింది! అంతలోనే ఎప్పటికయినా తిరిగి రాయలవారితో ఇంకొక ఎత్తు వేసితీరాలని ఒక దృఢనిశ్చయం స్థిరపడింది.

కళింగజైత్రయాత్ర జేగీయమానంగా సమాప్తమయిన పిమ్మట తిమ్మన ఒకనాడు తెగించి పెద్దనామాత్యుని సందర్శించి తన మనోభావం వెల్లడించాడు. ఆయన కొంచెంసే పాలోచించి, 'గట్టిగా వాగ్దానం చెయ్యలే' నన్నాడు. అవకాశాన్ని బట్టి చేతనయినంత వరకు సాయపడగల నని మాట ఇచ్చాడు. ఆపైన అలాగ అలాగ మరికొన్ని వారాలు గడిచిపోయినా అతని సంకల్పం ఫలించలేదు. ప్రాణం విసిగి ప్రధానమంత్రి నొకసారి సందర్శించాలని నిశ్చయించుకొన్నాడు. అంతలోనే పెద్దనామాత్యు డొకనాడు కబురు పంపించి "తిమ్మన్నా! ఇన్నాళ్ళ నించి రాయలవా రెన్నడూ చదరంగం ప్రస్తావనే ఎత్తలేదు. అందుచేత నే నీ విషయం వారితో విన్నవించడం సముచితం కాదేమో అని కొంచెం సంకోచించాను. అయితే నిన్న ఆయనే స్వయంగా ఆ ప్రస్తావన తెచ్చి నిన్నొక సారి చూడాలని ఉన్నదని అన్నారు. ఆ పైన రేపే నిన్ను వెంట బెట్టుకొని రాగలనని వారితో అన్నాను. తలవని తలంపుగా నీ పూర్వ పుణ్యం ఫలించింది!" అని అభినందించాడు.

ఆ మరునాడు అపరాహ్ణవేళ తిరిగి రాయలతో తిమ్మన్న చతురంగం ప్రారంభమయింది. మహా ప్రధానితోబాటు పెద్దనామాత్యుడు వారి సరసనే సమాసీను డయినాడు. తిమ్మన ఆట బహుమతి గెలుచుకో లేకపోయినా అధమం సమానమైనా చేసి తీరాలని నిర్ణయించుకొన్నాడు.

అందుచేత ప్రతి ఎత్తు జాగ్రత్తగా ఆలోచించి వేసి మిక్కిలి మెళుకువతో బలం ముమ్మందు కురికించాడు. కాని ప్రమాదవశాత్తూ తిమ్మన్న మంత్రి రాయల శకటాఘాతంతో అస్తవ్యస్తమై బరిణెలో పడింది. ఆ మంత్రిని తిరిగి తీసుకోవలసినదని కృష్ణదేవరాయ లాదేశించినా తిమ్మన మరి స్వీకరించలేదు. "తమ దగ్గర ఓటమి కూడా నాకొక గొప్ప గెలుపే!" అని ఎంతో వినయంతో విన్నవించి ఇంకొక కొత్త ఎత్తు వేశాడు. మంత్రి పోయినా గుర్రాల జంటతో నయినా ఆట సమానం చెయ్యవచ్చు నని ఆశించాడు.

అంతలోనే గుర్రాలకు రెండింటికీ లంకె వేసి రాయల బలంలో వీర విహారం చేయించాడు. అలాగే శరపరంపరలాగ రెండు మూడు ఎత్తులు వేసి పెల్లుబికిన ఉల్లాసంతో "మహాప్రభూ! ఆట సమానమయింది!" అన్నాడు. కృష్ణదేవరాయ లంతలోనే చిరునవ్వు చిందించి "సరిసమానం కాలేదు! మా ఆటే కట్టినట్టుంది! మీరే గెలుచుకున్నా రీ వేళ!" అన్నాడు.

అంతలోనే మహామాత్యుని కనుసన్న గ్రహించిన పెద్దనామాత్యుడు అమూల్యములయిన కాశ్మీర దుశ్శాలువలతో తిమ్మన నలంకరించి నవరత్న ఖచితమయిన వీర ఘంటికలతో మారు మ్రోగుతున్న ముంజేతి కంకణాల జంట బహూకరించి గభీర స్వరంతో ప్రశంసించాడు:

"నాయనా! ఏలినవారితో నేను, ప్రధానామాత్యులు కలిసి ఎన్నెన్ని మారులు ఆటలు వేసినా ఓడిపోవడమే గాని గెలుపెన్నడూ చేకూరలేదు. అయితే మేము నిరుత్సాహపడిపోతామేమో అని ఆలోచించి ఆయన ఆటలు కొన్ని సరిసమానాలు చేసేవారు. చతురంగబలాల పోరాటంలోకాని, ఆటలోకాని దిగ్విజయమే కాని ఓటమి ఎన్నడూ వారి కెదురుపడలేదు. అటువంటి మేటి పోటరి నేడు తామై పరాజయం అంగీకరించారంటే—అది నీ ఎడల ఏర్పడిన పరమానుగ్రహమేగాని వేరొకటి కాదు సుమా!"

రాయ లా ప్రసంగం విని ( తిమ్మన ననుగ్రహించి పెద్దన నుద్దేశించి "ఆయన మహా కవీశ్వరులు! వాక్ చతురంగ

సంస్కృతిలో వారిని మించగల వా రెవ్వరున్నారు! ఎంతగా ఆలోచించినా వారి పలుకుల లోతు లెవ్వరికీ తెలియవు!" అని నర్మగర్భిత స్వరంతో వ్యాఖ్యానించాడు. అంతలోనే తిమ్మన్న ఆ బహుమానం అందుకొని, "మహాకవీ! తామన్నది అక్షరాలా యధార్థమే. అయితే నా వంటి అల్పవ్యక్తి మీద ప్రభువుల కనుగ్రహదృష్టి ఏర్పడడం కూడా ఒక గొప్ప విశేషమే!"అని సవినయంగా విన్నవించి వారి కందరికీ నమస్కరించి మిక్కిలి అడకువతో వీడ్కొన్నాడు. మార్గమధ్యంలో "రాయల వారొక వేళ నామీద దయ తలిచి ఆట ఓడిపోలేదు కదా!" అని అనేక విధాల వితర్కించుకొన్నాడు. అటుపిమ్మట రాజద్వారం దాటిపోయే సమయంలో ఒక భట్టు అతనిని సమీపించి చేయెత్తి దీవించి ఆశుకవితతో ప్రశంసించాడు:

> "మతిమంతు లేకమైనన్
> సతతము శ్రీ కృష్ణరాయ జగతీపతితో
> చతురంగమాడి గెలుచున్
> ధృతిమంతుడు బొడ్డుచెర్ల తిమ్మన బళిరే!"

ఆ ప్రశస్తి విన్న తరువాత తిమ్మన హృదయంలో చెలరేగిన మథన అంతా ఒక్కసారిగా పటాపంచలయింది! మరుక్షణంలోనే అతని చేత నున్న కాశ్మీరశాలువా భట్టు భుజయుగళి కలంకారమై తరళించింది!

# తుది వీడుకోలు

"రాత్రి ప్రథమయామం గడిచిపోయింది." అన్నాడా బుద్ధుడు ప్రశాంత గంభీరస్వరంతో.

ఆ రాత్రివేళ కుశీనరగ్రామంలో సాలవృక్షవనంలో నిట్టూర్పులైనా విడవకుండా నిశ్చల మూర్తులై నిలబడిన భిక్షుక సంఘము, కుశీనర జానపదులు ఆ మాటలు విని నిశ్శబ్దంగా నిట్టూర్పులు విడిచారు.

వెనువెంటనే భిక్షుకులందరి కనుగొలుకులలోను కన్నీటి బిందువులు నిలిచాయి. కొందరాత్మనిగ్రహం అవలంబించి ఆ కన్నీటి బిందువు లింక చెంపపై దిగజారకుండా నిలువరించుకొన్నారు. మరికొందరి కెంత ప్రయత్నించినా అది సాధ్యం కాలేదు. బాష్ప బిందువులు నెమ్మదినెమ్మదిగా వారి చెక్కిళ్ళపై దిగజారాయి.

ఆనందు డంతటివానికే ఆ విషయంలో ఆత్మనిగ్రహం దుస్సాధ్యమై పోయినప్పు డిక సామాన్య భిక్షుకు లా విధంగా అధైర్య పడిపోవడంలో ఆశ్చర్యం ఏమి ఉంది? అయినా ఆటుపిమ్మట ఆనందు డెంతో ధైర్యం అవలంబించి అలాగే ఆకాశంలో నక్షత్రాలవైపు చూస్తూ నిలుచున్నాడు.

క్రమక్రమంగా రాత్రి రెండోయామం కూడా గడిచిపోతూంది. రోహిణి శిరోనక్షత్రమై నిలిచేసరికి మూడో యామంకూడా గడిచిపోతుంది. ఆ క్షణంలో అతనికి చిరకాలంగా తన జీవితంలో ధ్రువతారకగా నిలిచిన తథాగత దేవుని స్మితజ్యోతి కూడా అంతర్హితమై పోగలదేమోనని అనిపించింది. ఆ విషయం తలుచుకునేసరికి ఆనందుని చెక్కిళ్ళపై వేడివేడి కన్నీటి బిందువులు ప్రవహించాయి.

కుశీనరగ్రామం చేరుకోగానే బుద్ధదేవుని దేహస్వాస్థ్యం బాగా క్షీణించి పోయింది. ఆయన నేత్రాలలో ఎన్నడూ లేని బడలిక ప్రారంభ

మైనది. ఒక ప్రభాత వేళ ఆనందుని తన సన్నిధికి పిలిచి, ప్రశాంతంగా అన్నాడు:

“ఆనందా! నేటి రాత్రి మూడవయామం అవసాన సమయంలో ఇక నా పరినిర్వాణం జరుగనున్నది. నా కిక విశ్రమించవలెనని ఉన్నది.”

ఆనందుని కా మాట మహాశనిపాతంలా వినబడింది. అయితే గౌతమదేవు డతనిని అనేకవిధాలుగా ఓదార్చి తన అనంతరం బౌద్ధభిక్షువు లవలంబించవలసిన ధర్మాలు, నియమాలు మొదలయినవన్నీ సంగ్రహంగా ఉపదేశించాడు.

అటు పిమ్మట ఆనందుడు గౌతమబుద్ధునికి హిరణ్యవతీ నదీతీరంలో గుబురులుగుబురులుగా పెరిగిన సాలతరువుల లతానికుంజంలో మెత్తని తరుపర్ణ పుష్పశయ్య ఏర్పాటు చేశాడు. బుద్ధు డా శయ్యపై ఉత్తరాభిముఖంగా శయనించి నిశ్చలధ్యాన నిష్ఠలో నిమగ్నుడైనాడు.

ఆ వార్త క్రమక్రమంగా భిక్షువులందరికీ తెలిసింది. వెంటనే వారంతా హిరణ్యవతీ నది దాటి సాలవనంలో ప్రవేశించారు. గౌతమబుద్ధుని నికుంజ శయ్య కనతిదూరంలో నీరవ నిశ్చలమూర్తులై నిలుచున్నారు.

ఎక్కడా ఆకల్లాడిన సవ్వడికూడా వినబడడంలేదు. సమ్యక్సంబుద్ధుని శిరస్సువైపున, పాదాలవైపున నిశ్చలంగా నిలిచిన సాలతరువులు రెండు తదేక దృష్టితో ఆయనముఖం వైపే తిలకిస్తున్నట్లు స్ఫురించాయి. ఆ నీరవ నిశీథవేళలో అప్పుడప్పుడు సాలతరువులనుండి రాలే పువ్వుల సవ్వడి మాత్రమే విస్పష్టంగా వినవస్తున్నది. అంతలోనే విశాల నీలాకాశంలో ఒక తారక రాలిన ట్లొక చిన్న కదలిక మెరిసింది. వెంటనే ఆ వెలుగు నిశ్శబ్దంగా ప్రవహించే హిరణ్యవతిలో ప్రతిఫలించింది.

ఆ సమయంలో ఆనందుని కొక్కమారుగా బుద్ధదేవుని సన్నిధిని గడిచిపోయిన ఆనందమయ క్షణాలన్నీ స్ఫురణకు వచ్చాయి. అత డెంతో కాలంనించి గౌతమునికి అంతేవాసిగా, తోడునీడగా మసులుకుంటున్నాడు. అయితే ఆ సుదీర్ఘ కాలం అంతా అతని కప్పు డొక క్షణలేశమై భాసించింది.

అంతలోనే ఉపావణు డానందుని సన్నిధికివచ్చి ఎంతో దీనంగా తలవాల్చి నిలుచున్నాడు.

# తుది వీడుకోలు

ఆనందు డతని వైఖరి చూచి జిజ్ఞాసార్థకంగా బొమముడి విరిచాడు. ఉపావణుడు చిరకాలంనించీ తథాగతునికి వీవన విసురుతూ తోడునీడలా వెంటనంటి తిరిగే ఉపాసకభిక్షువు. అతడు నాటిరాత్రి కూడా సిద్ధార్థుని పార్శ్వంలో నిలబడి నెమ్మదినెమ్మదిగా వీవన విసురుతూ నిలుచున్నాడు. కాని గౌతము డది చాలించి విశ్రమించ వలసిందని ఆదేశించాడు.

ఉపావణుడు మూడవయామం గడిచేవరకూ ఒక్క క్షణమైనా ఏమరకుండా గౌతమదేవుని పార్శ్వంలో నిలబడి, చేతులారా ఆచార్యదేవునికి పరిచర్యచేసి జన్మ సాఫల్యం పొందవలెనని ఎంతైనా ఉబలాట పడ్డాడు. కాని అతని ఆశ ఫలించలేదు. అతని హృదయం కరిగిపోయింది. ఆ విషయమే ఆనందునికి తెలియజేశాడు.

ఆనందు డది విని నిర్ఘాంతపోయి వెంటనే బుద్ధదేవుని సన్నిధికి వెళ్ళి ఉపావణుని దీన వృత్తాంతం అంతా ఆయనకు తెలియజేశాడు. గౌతమబుద్ధుడొక చిరునవ్వునవ్వి నెమ్మదిగా ఇలా అన్నాడు :

"ఆనందా! తుషితస్వర్గంలో దేవతలందరూ నా పరినిర్వాణ శుభ ముహూర్తం నిరీక్షిస్తూనాకోసమై ఆకాశంలో బారులుదీరి నిలుచున్నారు. ఉపావణుని వీవనచూచి వారందరు ఆ వీవన తమ కడ్డుగా ఉన్నదనీ, బుద్ధదేవుని తనివిదీరా సందర్శించడాని కొక విఘాతం ఏర్పడిందనీ పరిపరి విధాలుగా గుసగుస లాడుకొంటున్నారు. అందువల్లనే నే నుపావణునికి విశ్రమించవలసిందని ఆదేశించాను. అంతేగాని ఈ విషయంలో అతనివల్ల జరిగిన అపచారమేమీ లేదు!" అన్నాడు.

ఆనందు డాశ్చర్యవిస్ఫారిత నేత్రాలతో ఆకాశం అంతా కలయ జూచాడు. అతని చర్మచక్షువుల కెక్కడా తుషితస్వర్గ దేవతలు కనిపించ లేదు! అయినా కొంతసేపటివరకు అలాగే బుద్ధదేవునివైపు చూచి, సవినయంగా ఆయనదగ్గర సెలవు తీసికొని, తిరిగి ఉపావణుని కా విషయం అంతా తెలియజేశాడు. ఆత డా వార్త విని ఒక్కపెద్ద నిట్టూర్పు విడిచి పెట్టాడు. దానితో అతని హృదయం బాగా తేలికపడింది.

అంతలో ఆనందుని నేత్రాలు తిరిగి తారకలవైపు తిరిగాయి. డొక దీర్ఘ నిశ్వాసం విడిచిపెట్టి ఆ పక్కనున్నవారికికూడా వినబడీ వినబడ

నట్టుగా "ద్వితీయ యామంకూడా గడిచిపోయింది!" అన్నాడు. ఆ మాట వినగానే భిక్షుసంఘం దృష్టులన్నీ సాలవృక్ష లతానికుంజ మధ్యప్రదేశంలో పర్ణ పుష్పశయ్యపై పవళించిన బుద్ధదేవుని ముఖంవైపు ప్రసరిం

ఆకాశంలో తారకలన్నీ నిశ్చల నేత్రాలతో అదృశ్యమే తిలకిస్తున్నట్లు మెరిశాయి. మూడో యామంకూడా కొంతవరకు గడిచిపోయింది. అంతలో సుభద్రు డనే భిక్షు వానందుని సమీపానికి వచ్చి నిలుచున్నాడు. ఆనందు డతనిని చూచి చాలాకాలమైంది. సుభద్రుడు దూరప్రయాణం చేసి బాగా అలసిపోయినట్లున్నాడు. ఆనందు డతనిని బాగా పరిశీలనగా చూచి నిర్ఘాంతపోయి నెమ్మదిగా ఇలా అడిగాడు:

"సుభద్రా! ఎక్కడినుంచి ఈ రాక!"

"వైశాలినించి!"

"తథాగతులను సందర్శించడానికేనా?"

"అవును! అందుకోసమే ముమ్ముందుగా తమ సన్నిధికి వచ్చాను."

"అయ్యో! వేళ మించిపోయింది. నాయనా! తథాగతుల పరినిర్వాణ సమయానికిక ఒక రెండు గడియలు మాత్రమే అవధి!"

"అర్హతదేవా! నా కది తెలియకపోలేదు! ఈ దీనుని కింతవరకు తథాగతుల ముఖతః ధర్మదీక్ష స్వీకరించే భాగ్యం కలగలేదు! ఆ మహాదృష్టం కలిగించవలసిందని అర్థించడానికే మీ సన్నిధికి వచ్చాను! నా కీ వరం అనుగ్రహించండి!"

"ఈ చివరి క్షణంలోకూడా వారికి శ్రమ కలిగించడం ధర్మంకాదు నాయనా! మహాభినిష్క్రమణక్షణంనుంచీ ఈ క్షణందాకా ఆయన అహోరాత్రాలు నిద్రాహారాలు లేకుండా మన అందరిమీద అపార కరుణామృతం వర్షించారు. ఇటీవల అస్వస్థులై చిక్కి శల్యమైపోయారు. ఇప్పు డొక్క క్షణంపాటు ప్రశాంతంగా మౌనముద్ర వహించారు! నా మాట విను నాయనా! వారికి మౌనభంగం కలిగించటం న్యాయం కాదు!"

కాని సుభద్రుడు తనపట్టు విడిచిపెట్టలేదు. అలాగే అతి దీన స్వరంతో కాళ్ళా వేళ్ళా పడి ప్రతిమాలడం మొదలుపెట్టాడు.

అంతలో ఒక అరగడియ గడిచిపోయింది. ఇంక మిగిలిన దొక అర గడియ మాత్రమే! సుభద్రు డిక లాభంలేదని చాపచుట్టగా ఆనందుని కాళ్ళపై పడ్డాడు. ఆనందుడు తన కంఠస్వరం బాగా తగ్గించి—

"నాయనా! సుభద్రా! నన్నిక నిర్బంధించకు! ఏమైనాసరే! నీ వీ సమయంలో తథాగతులను సందర్శించడానికి వీలులేదు!" అన్నాడు.

సుభద్రు డొకక్షణకాలం నిశ్చలంగా ఎంతో జాలిగా ఆనందుని వైపు చూచి గద్గద స్వరంతో ఒక పెద్ద నిట్టూర్పు విడిచిపెట్టాడు.

"అర్హత్తా! శతకోటి జన్మలకైనా నాకిక స్వయంగా తథాగతుల సన్నిధిని ధర్మదీక్ష స్వీకరించే మహాభాగ్యం కలగదుగదా!"

"అవును సుభద్రా! నాకీ తెలియకపోలేదు! అయితే సమయం మించిపోయిన తరవాత మన మేమి చెయ్యగలం చెప్పు నాయనా!"

"అంతేనా? మీ కీ దీనునిపై మరి కరుణ కలగదా!"

"కరుణించవలసినవారు సమ్యక్సంబుద్ధులుగాని నే నెంతవాణ్ణి సుభద్రా!"

"ఈ క్షణంలో కరుణించి అనుమతించవలసినవా రిక మీరే గదా!"

"కావచ్చును! కాని వేళ మించిపోయింది నాయనా!"

ఆ మాట వినగానే సుభద్రుని ముఖం వివర్ణమై వెలవెలపోయింది. గొంతు తడి ఆరిపోయింది. తిరిగి ఒక నిట్టూర్పు విడిచిపెట్టాడు.

అంతలో సాలవృక్షాల నడుమనుంచి అమృతమాధుర్యం తొణికిసలాడే పిలుపొకటి వినబడింది. గౌతమబుద్ధుడు క్షీణస్వరంతో నెమ్మదిగా "ఆనందా!" అని పిలిచాడు.

ఆనందు డా పిలుపు వింటూనే ఒక్క అంగలో బుద్ధదేవుని శయ్యా సమీపానికి వెళ్ళి నిలుచున్నాడు.

"ఆనందా! ఆ వచ్చినవా రెవరు?"

"ఉపాసక సుభద్రుడు. స్వయంగా మీ ముఖతః ధర్మదీక్ష స్వీకరించవలెనని, దర్శనం ఇప్పించవలసినదనీ నిర్బంధిస్తున్నాడు. అయితే ఇది సముచిత సమయం కాదని—"

"అయ్యో! అలాగా! నాయనా! వెంటనే లోపలికి తోడుకురాలేక పోయినావా! ఎంతపని చేశావు! తొందరగా లోపలికి తోడుకురా!"

ఆనందుడు గురుదేవుని ఆజ్ఞ వింటూనే సుభద్రు నక్కడికి తీసుకు వచ్చాడు. తరవాత వారిద్దరిని అక్కడ విడిచి లతానికుంజద్వారంలో నిల బడ్డాడు. అయితే అతని నేత్రాలు రెండూ గౌతమదేవునివైపే తిలకిస్తు న్నాయి.

అప్పుడే ఉదయించిన చంద్రవంక వెలుగుల్లో సాలతరువనం అంతా అతనికొక చల్లని పాలవెల్లిలా స్ఫురించింది. చిరునవ్వులు చిలకరిస్తూ ఆచార్యదేవుడు సుభద్రునివైపు ఎంతో ఆప్యాయంగా చూస్తున్నాడు. మధ్య మధ్య చల్లనిమాటలతో అతని కష్టాంగ ధర్మదీక్ష అనుగ్రహిస్తు న్నాడు. క్రమక్రమంగా ఆచార్యదేవుని చిరునవ్వులు వెన్నెల వెలుగులలో కలిసిపోతున్నాయి.

సుభద్రుడు ధర్మదీక్ష స్వీకరించి తిరిగి నికుంజద్వారందగ్గరికి వచ్చాడు. అతని ముఖంలో ఒక్కనిమేషంవరకు ఆనంద సాగరం తాండవించింది!

ఆనందుని పాదాలకు మోకరిల్లి "అర్హతా! మీ దయవల్లనే నాకు సాక్షాత్తుగా తథాగతుల ముఖతః ధర్మదీక్ష స్వీకరించే మహాభాగ్యం కలి గింది! ఇక నా జన్మ తరించింది! అయితే ఈ తుదిగడియలో కూడా ఆ కరుణామూర్తిని, మిమ్మల్ని ఎంతైనా శ్రమ పెట్టాను. నన్ను మన్నించండి!" అన్నాడు. అతని ముఖంఅంతా కన్నీటితో తడిసిపోయింది. అనంతరం సుభ ద్రుడు నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ భిక్షుసంఘంలో ప్రవేశించాడు. తదేక దృష్టితో తథాగతుని ముఖం వైపే తిలకిస్తూ నిలుచున్నాడు.

ఆ సమయంలో ఆనందునికి గౌతమదేవుని అపార కరుణాస్వరూపం అంతా ఒక్కమారుగా మూర్తీభవించినట్లయింది!

బుద్ధదేవు డిటీవల కలిగిన అస్వాస్థ్యం వల్ల ఊపిరికూడా విడవలేనం తగా చిక్కి శల్యమైపోయాడు. తుది గడియలో ఒక్క క్షణంపాటు ప్రశాంత మౌనముద్ర వహించి పర్ణ పుష్పశయ్యపై విశ్రమింపవలెనని సంక ల్పించాడు. ఆ విధంగా రెండు యామాల కాలం గడిచిపోయింది. అంత లోనే సుభద్రుడక్కడికి వచ్చాడు. ఆనందు డిక ఆచార్యదేవునికి శ్రమ

కలిగించడం భావ్యం కాదని అనుకున్నాడు. అయినా ఆ చరమక్షణంలో కూడా సుభద్రుని కెంతో ఆప్యాయంగా ధర్మదీక్ష అనుగ్రహించాడు. ఆ సమయంలో ఆ ముఖంలో కొంచెమైనా అలసటగాని, విసుగుదలగాని పొడచూపలేదు. ఎంతటి శిష్యవాత్సల్యము! ఎంతటి మహాకరుణ! జీవ చైతన్యంతో తొణికిసలాడే ఆ మహా కృపామూర్తి స్మితజ్యోతి తిరిగి ఈ భూతలంపై మెరయదుకదా!

ఆ విధంగా ఆ క్షణంలో ఆనందుని హృదయంలో ఎన్నెన్నో ఆర్ద్రభావ పరంపర ఉద్భవించాయి; ఆనందు డొక్కసారి ఆచార్యదేవుని సన్నిధికి వెళ్ళి ఆయన పాదా లొక్కసారి స్పృశింపవలెనని అనుకొన్నాడు. కాని దానివల్ల గౌతమదేవుని విశ్రాంతికి భంగం కలగ గలదేమోనని భయం వేసింది. అందువల్ల వెంటనే ఆ సంకల్పం విరమించాడు.

అంతలో మూడవ యామం కూడా గడిచిపోయే సమయం ఆసన్నమయింది. అనిరుద్ధాది అర్హతులంతా ఆచార్యదేవుని కనతి దూరంలో నిలబడి నిశ్చలంగా ఆ దివ్యస్మిత జ్యోతివైపే తిలకిస్తున్నారు. సమీపంలో సన్నని వెలుగుతో ప్రవహించే హిరణ్యవతీ నది కూడా ప్రవహించడం విరమించి అక్కడే నిలబడి అలాగే స్తంభించిపోయింది. ప్రపంచం అంతా ఒకే మహా ప్రశాంత స్వరూపం ధరించింది.

"ఆనందా!" అని అంతలో ఇంకొక పిలుపు వినబడింది. ఆ పిలుపు వినబడగానే ఆనందునికి శరీరం అంతా ఒక శిరీష పుష్పంలా వికసించింది. మెల్లగా అడుగులు వేసుకుంటూ ఆచార్యుని శయ్య సమీపించాడు. అనిరుద్ధాది శిష్యులంతా చుట్టూ నిలుచుండి ఇక ఏ క్షణంలో మహాపరినిర్వాణం జరగగలదో అని ఎంతో ఆత్రంగా నిరీక్షిస్తున్నారు. ఆకాశంలో తారకలన్నీ ఆ విషయమే గుసగుసలాడుకొంటున్నట్టుగా మెరుస్తున్నాయి.

ఆనందుని దృష్టి తిరిగి ఇంకొకమారు తారకలవైపు తిరిగింది. అతనికిక మహాపరినిర్వాణసమయ మాసన్నమైనదని స్ఫురించింది. ఆనందుని హృదయంలో స్తంభించిన ధైర్యసాగరం ఒక్కమారుగా విజృంభించి అల్లకల్లోలమై పొంగింది!

అత డిక నిలబడలేక తథాగతదేవుని పాదాలపై వాలిపోయాడు! పసిపాపలా విలపించాడు! అతనికి తిరిగి ఇంకొక ఆర్ద్రాహ్వానం వినిపించింది!

ఆనందుడు ధైర్యం చిక్కబట్టుకుని నిశ్చల దృష్టితో బుద్ధదేవుని చరమోపదేశం వినవలెననే కుతూహలంతో అలాగే నిరీక్షిస్తూ నిలబడ్డాడు.

“ఆనందా! జన్మించినవారికి మరణం అనుల్లంఘనీయమని నీ కనేక మారు లుపదేశించాను. ఇప్పు డదే జరుగనున్నది. దీనికై విచారించనేల? నీవంటి శ్రద్ధాళువులకు నిర్వాణం కరతలామలకం!”

ఆ ఉపదేశంతో ఆనందుని హృదయం తిరిగి స్థిరపడింది.

అటుపిమ్మట గౌతమబుద్ధు డక్కడ సమావిష్టులయిన భిక్షువులను, కుశీనర జానపదులను, హిరణ్యవతీ నదిని, సమస్త ప్రాణి లోకాన్ని ఎంతో ఆప్యాయంగా చూచాడు. అతని విశాల విలోచనాలు చుట్టూ నిలిచిన ప్రతి ప్రాణిని, ప్రతిపదార్థాన్నీ పలకరించి తుది వీడ్కోలర్థిస్తున్నట్లుగా స్ఫురించాయి.

గౌతము డింకొకమా రానందుని వైపు చూచి అత్యంత ప్రశాంత స్వరంతో నెమ్మదిగా ఇలా ఉపదేశించాడు:

“ఆనందా! సమస్త ప్రాణి లోకానికి, సర్వవస్తుజాలానికీ వినాశం సహజం! మీరందరూ నిత్యజాగరూకులై అనంత నిర్వాణ ప్రాప్తికై ప్రయత్నించండి!”

అంతలో ఆకాశంలో ఒక సముజ్జ్వల తారక నేలపై రాలింది!

మరి ఒక మహాతారక దేదీప్యమాన ప్రభాజాలంతో ఆకాశాని కెగసి పోయింది!

# పతిత జనోద్ధర

రాగమంజరి ఆరుణిముని ఆశ్రమాని కల్లంత దూరంలోనే నిలబడి రెప్పపాటు లేకుండా, నిశ్చలంగా ఆ మహాముని వైపు చూచింది. ఇంతకు పూర్వం ఆమె ఎన్నడూ ఆ ఆశ్రమంలో అడుగుపెట్టలేదు, ఆరుణి ముని నెన్నడూ సందర్శించి ఉండలేదు.

చంపానగరవాసులందరూ ఆరుణి మహా తపశ్శాలి అనీ, చండీ భక్తుడనీ, పరమ బ్రహ్మణ్యుడనీ ఆరుణిని వేనోళ్ళ ప్రశంసించడం ఆమె అనేకమారులు విన్నది. ఇప్పుడు ప్రత్యక్షంగా సందర్శించగానే రాగమంజరి కా ప్రశంసలన్నీ యథార్థాలే అనిపించాయి.

ఆరుణి పద్మాసనాసీనుడై నాసాగ్రం మీద దృష్టి నిలిపి నిశ్చలంగా ధ్యానిస్తున్నాడు. అతని భ్రూమధ్యంమీది కుంకుమ తిలకం చూడగానే రాగమంజరి కది నిటలాక్షుని తృతీయ నేత్రంలా స్ఫురించింది. ప్రాతఃకాల సూర్యకాంతి అతని మేలిమివన్నె దేహచ్ఛాయలో లీనమై పోయింది. లేత లేత ఎండపొడ లతడు కూర్చున్న వ్యాఘ్రాజినం మీద రంగు రంగుల రత్నాలొలకబోశాయి.

రాగమంజరి ఆరుణిముని ధ్యానం ముగించే వరకూ అలాగే నిలబడి ఆ తేజశ్శాలి ఫాలంమీది విభూతిరేఖల తీరులు పరిశీలించింది.

కొంతసేపటి కతడు ధ్యానం ముగించి ఒక్క దీర్ఘనిశ్వాసం విడిచి పెట్టాడు. తరవాత నెమ్మదిగా పద్మాసనబంధం సడలించి యథా ప్రకారం సుఖంగా వ్యాఘ్రాజినం మీద కూర్చున్నాడు. కాని అతని దృష్టిలో ఏకాగ్రత ఇంకా సడలలేదు.

రాగమంజరి ఎంతో అడకువతో అతని సన్నిధికి నడిచివెళ్ళింది; ఉత్తర క్షణంలోనే అతని పాదాలమీద వాలిపోయింది, సభక్తికంగా సాష్టాంగ నమస్కారం చేసింది.

ఆమె కన్నీటితో ఆరుణిపాదాలు రెండూ తడిసిపోయాయి. ముని ఆమె ముంగురులు స్పృశించి అపార వాత్సల్యంతో ఆశీర్వదించాడు.

రాగమంజరి నెమ్మదిగా లేచి కూర్చుంది. ఒక్కమారు విశాల నేత్రాలతో ముని ముఖంవైపు చూచింది. ఉత్తరక్షణంలో ఆమె కనురెప్పలు వాలిపోయాయి. రాగమంజరి గద్గద స్వరంతో తన విషాదగాథ అంతా ఆరుణి మునికి వెల్లడించింది. నిత్యదుఃఖ భూయిష్ఠమైన సంసారంమీద విరక్తి కలిగిన దని, ఇక జీవితశేషం అంతా ముని పాదపద్మసన్నిధినే తీవ్ర తపోనిరతిలోనే గడిపివేయగోరుతున్నానని సవినయంగా విజ్ఞప్తి చేసింది; గణికా వృత్తితో తన బ్రతుకంతా మహాపాపపంకిలమై పోయినదని వాపోయింది; చండీ కరుణా కటాక్షంవల్లనే తన కీవిధంగా ముని సందర్శన భాగ్యం లభించిందని ఆ దేవతకు సభక్తికంగా చేయెత్తి నమస్కరించింది.

ఆరుణి క్షణకాలం నిశ్చలంగా ఆమెవైపు చూచాడు. ఆమెచెప్పిన విషాదగాథ అంతా అత్యంత శ్రద్ధతో ఆలకించాడు.

ఆరుణిముని చాలా జాలిగుండె. ఎవరికైనా కొంచెం కష్టం కలిగితే అతని మనస్సిట్టే ఆర్ద్రమై ద్రవించి పోతుంది. రాగమంజరి విషాదగాథ వినగానే అతని హృదయం అపారకారుణ్యంతో కరిగిపోయింది. అత డొక్క నిమిషం వరకు ఏదో ఆలోచించాడు:

"అమ్మా! సంసార స్వభావమే అంతటిది. నీకింకా పట్టుమని పంచ వింశతి వర్షాలైనా నిండినట్లు కనబడదు. దుఃఖభూయిష్ఠమైన సంసార స్వభావం నీకేమి తెలుసును!

ఇంతటి చిన్న వయస్సులో ఇంతటి వైరాగ్యం కలగడం నిశ్చయంగా పూర్వజన్మ సుకృత ఫలితమే.

కాని నీ వీ కఠిన తపశ్చర్య కోర్చుకోలేవు! నా మాట విని తిరిగి చంపా నగరానికి వెళ్ళిపో!"

అని తిరిగి తిరిగి చంపానగరానికి వెళ్లిపోవలసిందని అనేక విధాలుగా ఆమెకు బోధించాడు. ఆమె ఆ సదుపదేశం ఎంతో శ్రద్ధగా ఆలకించింది. కాని చంపానగరానికి తిరిగి వెళ్లిపోవడాని కంగీకరించలేదు.

"మీవంటి పతిత జనోద్ధారకులు తామేనని విని కొండంత ఆశతో నే నిక్కడికి వచ్చాను. తమకు దయ కలగకపోతే, ఉరిపోసుకుని, ఇక్కడే, మీ కెదురుగానే ప్రాణత్యాగం చెయ్యవలెనని నిశ్చయించాను. అంతేనే గాని తిరిగి నే నా చంపానగరానికి వెళ్ళదలుచుకోలేదు."

ఆమె అలాగే తలవంచుకొని ఆరుణి పాదాలమీద దృష్టి నిలిపి ఊనూరుమని ఒక్క దీర్ఘనిశ్వాసం విడిచిపెట్టింది.

ఆరుణి తిరిగి మరి ఒకమారు రాగమంజరికేసి బాగా పరిశీలనగా చూచాడు.

"రాగమంజరీ! సంసారం దుఃఖభూయిష్ఠమైనదని నీవే అన్నావు గదా! నీ కేదో దారుణమైన విపత్తు సంభవించి ఉండవచ్చునని ఊహిస్తున్నాను. ఆ దుఃఖోద్వేగంలో నీ కిటువంటి సంకల్పం కలిగి ఉండవచ్చు. కాని కొన్నాళ్ళ కా దుఃఖోద్వేగం ఉపశమిస్తుంది. అంతవరకు కొంచెం వేచి ఉండడం మంచిది. అప్పటికి కూడా నీలో ఈ సంకల్పం నిలబడితే తప్పక నీ వరణ్యవాసం చెయ్యవచ్చు. కాని అంతవరకు చంపానగరం లోనే ఉండడం మంచిది. నామాట విను."

అని మళ్ళీ ఆమెకు నచ్చ చెప్పాడు. అయినా ఆమె దాని కంగీకరించలేదు. ఆమెచెక్కిళ్ళపై కన్నీరు జలజలా ప్రవహించింది. అది చూడగానే ఆరుణిమనస్సు కొంచెం కరిగింది.

దూర దూరంగా గంగానదీ ఘోష జాలిగా సన్న సన్నగా వినిపించింది. శిశిర ర్తు హిమబిందువులతో తడిసిన పండుటాకులు తరువుల కన్నీటి బిందువుల్లా ఒకటొకటిగా నేలరాలిపోయాయి. ఆకాశం అంతటా పొగ గమ్మినట్లు దట్టంగా మంచు పట్టింది. కాని ప్రాతఃకాల సూర్యకిరణ కాంతులలో క్రమక్రమంగా అది కరిగిపోవడం ప్రారంభించింది.

రాగమంజరి దీనాతిదీనంగా ఆరుణి మునికేసి చూసింది :

"మా వంటి పతితుల నుద్ధరించగలిగినవా రిక మీరు గాక మరెవ్వరు?"

అని మళ్ళీ తల వంచుకుంది. ఆరుణి కిక ఏమనడానికీ పాలు పోలేదు. కాని ఆమె అరణ్యవాసం అతని కంతగా రుచించలేదు. కాని కటువుగా తిరస్కరించిన పక్షంలో ఆమె ఏదైనా సాహసాని కొడిగట్టవచ్చునని అతనికి భయం వేసింది. అందుచేత ఆమెచేత ఎట్లాగైనా ఒప్పించవలెనని అనుకున్నాడు:

"అరణ్యవాసమూ, అందులో తపశ్చర్య అత్యంత దుష్కరమైన

విషయాలు! మా వంటి వారికే ఇవి బహుదుష్కరమైనవి. నీవంటి సుకుమారులీ అసిధారా వ్రతా చరించలేరు. నా మాట విని ఈమారు చంపానగరం వెళ్ళిపో! ఆ తరవాత కూడా నీకు తపశ్చర్యమీద అభిలాష కలిగితే అప్పుడు మళ్ళీ తిరిగి వత్తువుగాని!"

ఆ మాటతో రాగమంజరి నిలువునా నీరయిపోయింది.

"స్వామీ! మా వంటి పతితులకు, పాపులకు మరి తరణోపాయం లేదా? మే మీ విధంగా ఈ సంసార పంకంలో పడి నశించి పోవలసిందేనా?"

రాగమంజరి గద్గద భారంతో మరి మాటాడలేక పోయింది. ఆ ప్రశ్న ఆరుణిహృదయం కరిగించివేసింది.

"సరే. కొన్ని రోజులపా టాశ్రమంలో ఉండు! ఆటు పిమ్మట కూడా నీ కింకా అరణ్యవాసం చెయ్యవలెనని అభిలాష కలిగిన పక్షంలో అప్పటిమాట ఆలోచించుకోవచ్చునులే"

అని ఆరుణి తన శిష్యుల నిద్దరిని పిలిచాడు. వారిద్దరూ అక్కడికి రాగానే, ఆశ్రమంలో ఆమెవసతికి తగిన ఏర్పాటులు చేయవలసిందని ఆజ్ఞాపించాడు. వారిద్దరూ ఆమెకొక చిన్న పర్ణకుటీరంలో వసతి ఏర్పాటు చేశారు.

రాగమంజరి ఆ పర్ణకుటీరంలో ప్రవేశించబోయే ముందు ఆరుణి మునిపాదాలకు సాష్టాంగ నమస్కారం చేసింది. పాదధూళి ఎంతో నమ్రతతో శిరస్సుమీద చల్లుకొని, నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ పర్ణకుటీరంలో ప్రవేశించింది.

మరునాటి సాయంకాలమే, గోధూళివేళ రాగమంజరితల్లి వలవలా ఏడుస్తూ ఆశ్రమంలో ప్రవేశించింది. ఆశ్రమాని కల్లంత దూరంలోనే ఆ ఏడ్పు విని ఆరుణిశిష్యు లామెను తమ ఆచార్యుని సన్నిధికి తోడుకు పోయారు. ఆరుణిదగ్గిరికి వస్తూనే ఆమె సాష్టాంగ నమస్కారం చేసి గోలుగోలున ఏడవడం మొదలు పెట్టింది. ఆరుణి ఎంతసే పోదార్చినా ఆమె

మరి కుదటపడలేదు. కొంతసేపటికి శేడుపు ముగించింది. రాగమంజరిని చిన్నప్పటి నుంచి పెంచి పెద్దదానిని చేశాననీ,తన కింకెవరూ లేరనీ,తన వార్ధక్యంలో ఆమె ఆ విధంగా అడవులు పట్టిపోవడం కేవలం అన్యాయమనీ మొర పెట్టుకుంది. ఆమె నెల్లాగయినా తిరిగీ చంపానగరానికి పంపించవలసిందని ప్రార్థించింది.

తరవాత ఆమె రాగమంజరి పెంపకంలో తాను పడ్డ పాట్లన్నీ ఏకరువు పెట్టింది.

"స్వామీ! గణికను పెంచి పెద్దదాన్ని చెయ్యటం మాటలతో పని గాదు. తల్లి దగ్గిర పాలు విడిచీ విడవగానే పిల్ల నింటికి తెచ్చుకోవాలి. శరీరపుష్టి కలిగించే మృష్టాహారం ఇచ్చి పోషించాలి. శరీర కాంతి పోషణ కోసం ప్రత్యేకంగా కొన్ని ప్రక్రియలు చేయించాలి. అయిదవ ఏటినుంచీ తండ్రికి కూడా ఆ పసిదాన్ని కనబడనీయకూడదు. జన్మదినోత్సవాలు పెళ్ళిళ్ళు చేసినంత మహా వైభవంగా జరిగించాలి.

"నృత్య గీత నాట్య చిత్రాది కళలలో మహావిద్వాంసురాలిని చెయ్యాలి. ఇంకా మిగిలిన వ్యాకరణాది శాస్త్రాలలో కూడా తగుమాత్రం పాండిత్యం కలిగించాలి. ద్యూతాదికళలలో కూడా బాగా ప్రవేశం కలిగించాలి.

"కొంచెం వయస్సురాగానే గొప్ప గొప్ప ఉత్సవాలలో నృత్య గోష్ఠు లేర్పాటు చేయించాలి. ఆమెసౌందర్యము, పాండిత్యము నాగరికు లందరికీ బాగా తెలిసేటట్టు చెయ్యాలి. ఆ మెకీర్తి నాలుగువైపులా వ్యాపించిన కొద్దీ శుల్కం కూడా దానికి అనుగుణంగా అభివృద్ధి పొందించాలి.

"ఒకవేళ ఎవరైనా ముందుగా వాగ్దానం చేసిన శుల్కం ఇవ్వకుండా తప్పించుకుపోయిన పక్షంలో అధికరణాలలో ప్రాడ్వివాకుల మూలంగా ఆ ద్రవ్యం తిరిగి రాబట్టుకోవాలి-"

అని ఆవేశ్యమాత అదే ధోరణిగా తన గోడంతా ఏకరువు పెట్టడం మొదలుపెట్టింది. ఆరుణి కది వింటున్న కొద్దీ క్రమంగా లోలోపల జుగుప్స బయలుదేరింది. ఆపైన అత డిక వినలేకపోయాడు. విసుగుగా ఒక నిట్టూర్పు విడిచి పెట్టాడు:

"కేగారూ, ఇంతకూ రాగమంజరికి సంసారంమీద ఇంతటి విర కలగడానికి కారణ మేమిటి?"

ప్రశ్న విని వేశ్యమాత మళ్ళీ గోలుగోలున రాగాలు మొదలు పెట్టింది. కొంతసేపటికి రాగాలు తగ్గించి గద్గద స్వరంతో తన గాథ ప్రారంభించింది:

'స్వామీ! బ్రహ్మదేవుడే స్వయంగా మా కీ కులవృత్తి విధించాడు. కోటివిద్యలు కులవిద్యకు సాటిరావుగదా! అందుచేత కులవృత్తి కులధర్మ కారమే నడిపించాలి. ఆ ధర్మం ఏమాత్రం ఏమరినా రౌరవాదినరకాల పాలు కావలసిందే! మా పూర్వులెన్నడూ కులధర్మం గోరంతైనా అతిక్ర మించిన పాపాన లేదు.

"ఇంతకూ మా ప్రాణాలకు చంపానగరంలో ఒక దరిద్ర బ్రాహ్మణ కుమారుడు దాపురించాడు. నా మట్టుకు నా కతడేమీ బాగున్నట్టు కనబడ లేదు. రాగమంజరి అంతటి నవమన్మథుడు మరి 'నభూతో న భవిష్యతి' అని ఆకాశాని కెత్తివెయ్యడం మొదలుపెట్టింది. అతగాడు గర్భదరిద్రుడు. పోనీ అనుకుంటే పొట్ట కోసినా అక్షరంముక్క లేదు. రాగమంజరి రాత్రింబగళ్ళూ అతగాడితోనే కాలక్షేపం చెయ్యటం మొదలుపెట్టింది."

ఆ తరవాత వేశ్యమాత ఆరుణి తన గాథ అంత శ్రద్ధగా వినడం లేదని కనిపెట్టింది.

"మావంటి వారి కష్టసుఖా లిక ఎవరితో చెప్పుకో గలము? ఇక ఆర్చేవారయినా తీర్చేవారయినా మీరే! కొంచెం దయదలిచి ఈ కాస్తా శ్రద్ధగా ఆలకించండి.

"అతగా డెప్పుడూ ఒక్క చిల్లిగవ్వ అయినా రాగమంజరి చేతిలో పెట్టిన పాపాన పోలేదు. పైగా రాగమంజరి నేను గడించిన ధనం అంతా అతగాడి కోసం వ్యయం చెయ్యటం మొదలు పెట్టింది.

"ఎప్పటికయినా దానికి బుద్ధి తిరగక పోతుందా అని నేను రెండు మూడు మాసాల వరకు ఓపిక పట్టాను. ఎంద రెందరో కుబేరులు వచ్చినా, గుడ్ల నీరు కుక్కుకొని వారినందరిని తిరగగొట్టివేశాను. అయినా రాగ మంజరి మనస్సు తిరగలేదు. పరిపరివిధాల—నయాన భయాన చెప్పి

చూచాను. కాని రాగమంజరి ససేమిరా, నా మాట వినసని భీష్మించుకుని కూర్చుంది.

"ఆ సందర్భంలో నా కేమీ పాలుపోక ఒకనాడు గట్టిగా చీవాట్లు పెట్టాను. అంతటితో ఊరుకోక ఆ బ్రాహ్మణ కుమారుణ్ణి మరి నా గడప తొక్క వద్దని కటువుగా తూలనాడాను. తిరిగి మా గడప తొక్కితే దాసీలచేత చీపురుకట్ట తిరగవేయిస్తానని భయపెట్టాను. ఆ మరునాటి నుంచి అతడు మరి మా గడప తొక్కలేదు.

"అంతటితో ఆ శని విరగడ అయిపోయిందని నే నెంతైనా సంతోషించాను. అత డానాడే చంపానగరం విడిచిపెట్టి దేశాంతరాలు పట్టిపోయాడని విన్నాను. ఆ వార్త విని సంతోషించాను. ఆ మరునాటి నించి రాగమంజరి దారికి రాకపోదని ఎంతో ఆశ పడ్డాను.

"కాని నా ఆశ లన్నీ అడియాస లయిపోయాయి. ఆనాటి నించీ రాగమంజరి మరి అన్నం ముట్టడమే మానివేసింది. నానాటికీ దాని వైరాగ్యం బాగా పెచ్చు పెరిగిపోయింది. ఒకనాటి ఉదయం లేచి చూస్తే ఇంట్లో ఎక్కడా కనిపించలేదు. ఊరంతా గాలించగా మీ ఆశ్రమానికి వచ్చిందని తెలిసింది.

"మా కుటుంబం అంతా రాగమంజరి మీదే ఆధార పడి ఉంది. ఆమె ఈ విధంగా కులధర్మం విసర్జించి ఆ బ్రాహ్మణ కుమారుని యెడల అంతటి మమకారంతో వ్యవహరించడం అన్యాయం! మహా పాపం! మా కులధర్మానికి కేవలం వ్యతిరేకం!

"అపైన నేనేదో అన్నానని నా మీద పగబట్టి ఈ విధంగా అడవులు పట్టిపోయింది. మీ రామె నెల్లాగైనా తిరిగి నాతో పంపించక పోతే నేను మీ ఎదటే ప్రాయోపవేశం చేసి ప్రాణత్యాగం చేస్తాను. నాకిక గత్యంతరం లేదు. మీ రెల్లాగైనా కరుణించి రాగమంజరిని తిరిగీ చంపానగరానికి పంపించాలి. మా కుటుంబం సంరక్షించాలి."

అని కాళ్ళా వేళ్ళా పడి పరిపరి విధాల బతిమాలుకుంది. అటు పిమ్మట కూడా ఆమె ఇంకా ఏమేమో వెళ్ళబోసుకోవడం మొదలు పెట్టింది. ఆరుణి ఆమె మరి చెప్పనక్కరలేదన్నట్టు హస్తసంజ్ఞతో సూచించాడు. అంతటితో వృద్ధ వేశ్యమాత నోరు కట్టుపడి పోయింది.

ఆరుణికా పరిస్థితిలో ఎలాగో అలాగ నచ్చజెప్పి రాగమంజరిని తిరిగి ఇంటికి పంపించెయ్యడమే మంచిదని తోచింది. వెంటనే శిష్యుణ్ణి పిలిచి రాగమంజరి నిక్కడికి తీసుకురావలసిందని చెప్పాడు.

ఆ వ్యవహారం అంతా రాగమంజరి పర్ణకుటీరంలోనించి ఒక కంట కనిపెట్టిచూస్తూనే ఉంది. అందుచేత శిష్యు డెంత బతిమాలినా అతని వెంట వెళ్లడాని కిష్టపడలేదు. శిష్యునికి ఆమె నిక బలవంతంగా తీసుకు వెళ్ళడం తప్ప గత్యంతరం కనిపించలేదు. అందుచేత అత డిక చేసే దేమీ లేక ఆచార్యుని కా విషయం తెలియజేశాడు. అది విని ఆచార్యు డొక్క నిట్టూర్పు విడిచిపెట్టాడు. వేశ్యమాతను నెమ్మదిగా బుజ్జగించాడు:

"అమ్మా! రాగమంజరి కింకా తపస్సంటే ఏమో తెలియదు. పది పదిహేను రోజు లీ అరణ్యవాసం చెయ్యగానే తపస్సు మీది భక్తి యావత్తూ దానంతట అదే సడలిపోతుంది. నీ విప్పటికి చంపానగరానికి వెళ్ళిపో! ఒక పక్షం రోజులలో, నయానా భయానా చెప్పి రాగమంజరిని తిరిగి పంపించి వేస్తానులే!"

వేశ్యమాత ఆ మాట వినిపించుకోలేదు:

"స్వామీ! పోనీ, నే నంతవరకూ ఇక్కడే కాలక్షేపం చేస్తాను. సరిగదా!"

"నీ విక్కడ రోజూ కనిపిస్తూంటే ఆమె మరింత బిర్రబిగిసి పోతుందేమోనని నా భయం. ఆ పైన నీ ఇష్టం."

ఆ మాటమీద వృద్ధమాత కొంచెం తమాయించింది:

"స్వామీ! మా ఇంటిల్లి పాదికీ రాగమంజరి ఒక్కత్తే దిక్కు! ఆమె మరి తిరిగిరాకపోతే మేమంతా అన్నానికి కూడా మొహం వాచి పోయి మలమల మాడి చావవలసిందే! అందుచేత మీ రెలాగైనా పంపించి తీరతామని సెలవిస్తే తిరిగి వెళ్ళిపోతాను!"

"అయ్యో వెర్రిదానా! నే నింతకు పూర్వంనించీ చెపుతూనే వున్నాను. రాగమంజరి నా మాట బొత్తిగా చెవికెక్కనీయలేదు. ఏం చెయ్యను? ఇప్పుడైనా మించిపోయిందేమీ లేదు! యథాశక్తిగా ప్రయత్నిస్తాను. ఆపైన అమ్మవారి సంకల్పం ఎలాగుంటే అలాగ జరుగుతుంది. అంతా పరమేశ్వరి అనుగ్రహం!"

ఆ మాటతో ఆ వృద్ధురాలికి కొంచెం ధైర్యం కలిగింది. మళ్ళీ సవినయంగా ఆరుణిమునికి నమస్కరించి చంపానగరానికి బయలుదేరింది.

వెళ్ళబోయే ముందు రాగమంజరిదగ్గిరకి వెళ్ళి ఆమె ననేక విధాల బతిమాలింది. భయపెట్టింది. ఆమె ఎంతకీ వినకపోతే వలవలా విలపిస్తూ అలాగే చంపానగరానికి వెళ్ళిపోయింది.

అప్పటికి బాగా పొద్దు వాలింది. ఆనాడు జరిగిన విశేషాలు తలుచుకొన్న కొద్దీ ఆరుణిహృదయం విషాదాంధకారంలో మునిగిపోయింది. సంసారం దుఃఖబహుళం అన్న విషయం అతనికి తిరిగి ఆనాడెవరో వెన్ను చరిచి బోధించినట్లయింది.

ఆప్పటికప్పుడే అరణ్యంలోని కీచురాళ్ళ మోత బాగా శ్రుతిమించి పోయింది. దూర దూరంగా ఆటవికుల కుటీరాల మంటల వెలుగులలో అరణ్య వృక్షాలు పెనుభూతాల్లా కనిపించాయి.

ఆరుణి శుద్ధశ్రోత్రియకుటుంబంలో జన్మించాడు. అతని కుటుంబంవారంతా నిత్యాగ్నిహోత్రులు; సోమపీథులు. కాని ఆరుణిది చాలా బీద కుటుంబం. అయినా, ఏదో, కలిగిన దానితోనే కాలక్షేపం చేస్తూ ఆ కుటుంబంవారంతా గుట్టుగా కాలం వెళ్ళబుచ్చుకునేవారు. వారెప్పుడూ 'దేహి' అని ఒకరిదగ్గిర చెయ్యి చాచలేదు.

ఆరుణిచిన్నతనంలో అతని కుటుంబాని కెన్నో విపత్పరంపరలు సంభవించాయి. ముందుగా అతని తండ్రి మహామారి జాడ్యంతో మరణించాడు. ఆ పైన పదిరోజులైనా తిరగకముందే అతని తల్లి కూడా ఆ వ్యాధితోనే దారుణమరణానికి ఆహుతి అయిపోయింది. ఆ భీకర సంఘటనలతో ఆరుణికి సంసారంపై విపరీతమైన విరక్తి కలిగింది. వెంటనే, సన్యసించవలెనని అనుకొన్నాడు.

ఆ విషయం అన్నగారికి తెలియజేశాడు. ఇక కుటుంబాని కంతటికీ ఆయనే పెద్ద. ఆయన కేమనడానికీ పాలుపోలేదు. వివాహం చేసుకొని గృహస్థ ధర్మం అవలంబించడమే న్యాయమని అనేక విధాల చెప్పి చూచాడు. అయినా ఆరుణి వినలేదు.

ఒకనా డెవరితోనూ చెప్పకుండా బయలుదేరాడు. కేవలం కాలి నడకతో కొన్ని వందల యోజనాలు ప్రయాణం చేసి అంగరాజ్యంలో గంగానదీతీరంలో ఉన్న మరీచిమహర్షి ఆశ్రమానికి చేరుకొన్నాడు. అనేక విధాల శుశ్రూషచేసి మరీచి మహర్షి వాత్సల్యం చూరగొన్నాడు.

అనతికాలంలోనే సన్యాసాశ్రమం స్వీకరించాడు. ఆపైన కొంత కాలం మరీచిమహర్షి ఆశ్రమంలోనే తన తపశ్చర్య సాగించాడు. ఆటు పిమ్మట మరీచిమహర్షి ఆశ్రమానికి కొంతదూరంలో ఉన్న చండీ క్షేత్రంలో తపశ్చర్య కుపక్రమించాడు. అప్పటినించీ దానికి ఆరుణి ఆశ్రమం అనే పేరు చంపానగరం అంతటా మారుమోగింది.

రాగమంజరి వృత్తాంతం తెలుసుకొన్న కొద్దీ ఆరుణికి తన చిన్ననాటి విపత్పరంపరలన్నీ జ్ఞాపకం వచ్చాయి. అందుచేతనే రాగమంజరి యెడల అతని కంత జాలికలిగింది.

కాని అటుపిమ్మట ఆ వృద్ధమాత మొర విన్న తరవాత అతని మనస్సులో ఒకవిధమైన డోలాందోళన ప్రారంభమైంది. ఇక వెంటనే రాగమంజరి నెలాగైనా తిరిగి పంపించి వెయ్యడమే మంచి దనుకొన్నాడు.

అయినా, ఆరుణికి, వెనువెంటనే ఆవిషయం రాగమంజరితో ప్రస్తావించడం సముచితం కాదని అనిపించింది.

అలాగలాగ ఒక పక్షంరోజులు గడిచిపోయాయి. ఆ పక్షం రోజుల లోనూ రాగమంజరి ఆశ్రమంలో ఎంతో అనువర్తనగా ప్రవర్తించింది. నిత్యమూ ఆమె చండీ క్షేత్రంలోనే తనకాలం వెళ్ళబుచ్చుకునేది. తెల్ల వారు జామునే లేచి ఎముకలు కొరికివేసే చలిలో గంగానదిలో స్నానం చేసి జపతపాలతో కాలం వెళ్ళబుచ్చేది.

ఆ పదిహేనురోజులూ గడిచిపోగానే వృద్ధమాత ప్రశాంతమైన ఆ ఆశ్రమంలో మళ్ళీ లేనిపోని అలజడి రేకెత్తిస్తుందేమోనని ఆరుణికి కొంచెం భయంవేసింది.

ఆ మరునాడు రాగమంజరి తెల్లవారుజామునే లేచి పరిశుభ్రమైన నారచీర ధరించి ఆరుణికి పాదాభివందనం చేసింది. ఆ ముని ఎంతో వాత్సల్యంతో ఆమె నాశీర్వదించాడు.

"రాగమంజరీ! నీ వాశ్రమానికి వచ్చి అప్పుడే ఒకపక్షం రోజు లయింది. నీ కీ అరణ్యవాసం ఎలాగుంది?"

"స్వామీ! నే నిక్కడికి వచ్చినప్పటినించి ఎన్నడూ ఎరగని మన శ్శాంతి అనుభవిస్తున్నాను."

ఆరుణి ఆమె అలాగ సమాధానం చెప్పగలదని అనుకోలేదు. కొంత సే పేదో ఆలోచించాడు:

"మొట్టమొదట నీ వీ ఆశ్రమంలో కష్టసుఖాల కోర్చుకోలేవేమో నని అనుకున్నాను."

రాగమంజరి ఆ వ్యంగ్యప్రశస్తి విని తల వంచుకుంది:

"అదంతా మీ అనుగ్రహం."

"నాలో ఏమి ఉంది? అదంతా అమ్మవారి అనుగ్రహం."

అన్నా డారుణి. తరవాత అతని కిక ఏమనడానికీ ఏమీ పాలు పోలేదు.

"అది సరేగాని, మీ అమ్మ తిరిగి ఇక్కడికి వచ్చి నిన్నిక్కడినించి తీసుకుపోతుందేమోనని భయపడుతున్నాను."

అని, ఆరుణి, పరిశీలనగా ఆమెవైపు చూచాడు.

"ఏమైనా సరే! నే నిక ఆ నరకకూపంలో ప్రవేశించదలచుకోలేదు. మీకు నేనిక్కడ నివసించడం ఇష్టం లేకపోతే నా నిండుప్రాణా లా గంగాదేవి కర్పించి వేస్తాను. అంతే!"

"తప్పు! తప్పు! అలా గనకూడదు. ఆత్మహత్య మహా పాతకమని ధర్మశాస్త్రవేత్త లుద్ఘోషిస్తున్నారు. అది సరేగాని నీవు తిరిగి వెళ్ళక పోతే మీ కుటుంబం అంతా అన్నవస్త్రాలు కూడా లేక ఆత్మహత్యలకు పాల్పడతారేమో! అప్పు డా మహాపాతకం అంతా నీ మెడకు చుట్టు కుంటుంది. ఆవిషయం ఏమైనా ఆలోచించావా?"

"మీరన్నది నిజమే! అయితే నా కిక ఈ సంసారకూపం నించి విముక్తి లేదా? నే నీ అంధకూపంలోపడి ఇల్లాగే మగ్గిపోవలసిందేనా? ధర్మవేత్తలైన తామే ఇలాగ సెలవిస్తే ఇక నేనేమనగలను!"

ఆమాట కేమని సమాధానం చెప్పాలో ఆరుణికి స్ఫురించలేదు.

"అయితే మీ అమ్మ తిరిగివచ్చినప్పుడాలోచించుకోవచ్చులే!"

ఆ ఒక్క నిట్టూర్పు విడిచిపెట్టాడు. పిమ్మట నెమ్మది నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ తన కుటీరంలోకి వెళ్ళిపోయాడు.

అటు పిమ్మట క్రమంగా ఒక పక్షం రోజులు గడిచిపోయాయి. అయినా రాగమంజరి తల్లి మరి ఆశ్రమానికి తిరిగి రాలేదు.

ఆమె తిరిగి రాకపోవడంతో ఆరుణి హృదయంలో కొంచెం ఆందోళన బయలుదేరింది. ఆ తరవాతనైనా ఆమె ఎప్పుడో ఒకప్పుడు హఠాత్తుగా ఆశ్రమంలో విరుచుకు పడగలదని, రాగమంజరి నెలాగైనా తిరిగి పంపించ వలసిందని మళ్ళీ కాళ్ళావేళ్ళాపడి గగ్గోలు చెయ్యగలదని అతడు భయపడ్డాడు.

ఆ దృష్టితోనే ఒకనాడు రాగమంజరిని తిరిగి చంపానగరానికి వెళ్ళిపోవలసిందని బలవంతం చేశాడు. కాని ఆమె చెక్కిళ్ళపై జాలువారిన కన్నీరు పరిశీలించగానే అతనికి కొంచెం జాలివేసింది. ఆమె నంతగా బలవంతం చేసినందుకు లోలోపల బాగా నొచ్చుకున్నాడు.

సంసారంపై విరక్తితో ఒక పతితస్త్రీ అతని పాదాలాశ్రయించింది. గడచిన పక్షంరోజులనించి ఆరుణి ఆమె ప్రవర్తన చాలా నిశితంగా పరిశీలించాడు. ఆ ప్రవర్తనలో అతని కెక్కడా వేలెత్తి చూపడానికాస్కారం కనిపించలేదు. బాగా పసివారైనా, అతని శిష్యుల నెన్నడూ ఆమె కన్నెత్తి పలకరించనే లేదు. ఆశ్రమానికి వచ్చినప్పుడామె శరీరం మీద కొన్ని చిన్నచిన్న అలంకారా లుండేవి.ఇప్పుడామె ఆ అలంకారాలన్నీ పూర్తిగా విసర్జించి వేసింది. కేవలం వట్టి నార చీరలతో సన్యాసినీ వేషం ధరించింది. ఎంతటి ఎముకలు కొరికివేసే చలిలోనైనా తన దైనందిన నియమాలు, జపతపాలు విసర్జించలేదు. ఆమె నిష్ఠ చూచి శిష్యులెంతో ఆశ్చర్య పడ్డారు. క్రమక్రమంగా ఆరుణికి కూడా ఆమె నిష్ఠయెడల గౌరవం కలిగింది.

ఆ విధంగా అత్యంత శ్రద్ధాభక్తులతో తన పాదాలాశ్రయించిన

ఒక పతిత స్త్రీని ఆ విధంగా తిరిగీ సంసార కూపంలోనికి తోసివెయ్యడం కేవలం పాపహేతువు కాగలదని ఆతని కా క్షణంలో స్ఫురించింది.

చంపానగర వాసులు కొంద రప్పుడప్పు డతనిని సందర్శించిపోయే వారు. అతడు వారి వారి అర్హతల ననుసరించి ధర్మోపదేశాములు చేస్తూండే వాడు.

అయితే ఇప్పుడతని కొక విషయంలో ఒక పెద్ద ఆశంక పట్టుకుని పీడించింది. ఇంతకు పూర్వం చంపానగర మహిళ లతనిని సందర్శించక పోలేదు. ఆరుణి వారి కేవవో ధర్మోపదేశాలు చేసేవాడు. వా రొకటి రెండు రోజు లాశ్రమంలో ఉండి తిరిగి చంపానగరానికి వెళ్లిపోయేవారు.

కాని రాగమంజరి ఆజన్మాంతము ఆశ్రమవాసం చెయ్యాలని నిశ్చ యించింది. తనకు మంత్రోపదేశం చెయ్యవలసినదని ప్రార్థించింది. ఆవిధంగా ఆమె కాజన్మాంత దీక్ష ఇచ్చి మంత్రోపదేశం చెయ్యడం సముచితమేనా అని అతని కొక పెద్ద సందేహం బయలుదేరింది.

అతని మనస్సులో ఇంకొక అనుమానం కూడా బయలుదేరింది. ఇన్నాళ్ళనించీ అత డామె యౌవన సౌందర్యాదు లంత శ్రద్ధగా పరిశీ లించ లేదు. ఇటీవల ఆమె యౌవన సౌందర్యాలు జాగ్రత్తగా పరిశీలిం చాడు. ఆమె కింకా పాతిక సంవత్సరాలైనా నిండలేదు. పరిపూర్ణ యౌవనం ఆమెఆకృతిలో అంతటా పరిస్ఫుటంగా స్ఫురించింది. రాగ మంజరి అంతటి మహా సౌందర్యవతి కాకపోవచ్చును గాని మొత్తం మీద ఆమె అందగత్తెలలో లెక్కే.

ఆమె యౌవన సౌందర్యాలు కొంచెం నిశితంగా పరిశీలించగానే ఆరుణికి తన శిష్యులిద్దరివిషయము హఠాత్తుగా స్ఫురించింది. వారిద్దరు వటువులే. వారిలో ఒకడింకా పసివాడే. అతనికింకా పదిపదహారేళ్ళయినా నిండాయో లేదో! రెండవ శిష్యునికి పద్దెనిమిదేళ్ళు నిండాయి. ఆ పరిస్థితు లలో వారి కీ స్త్రీసన్నికర్ష అంతగా సముచితం కాదేమోనని అతనికి భయంవేసింది.

ఆరుణికి తన విషయంలో ఆవిధమైన సందేహాని కాస్కారం లేనే లేదని అనిపించింది. అతని కిప్పుడు ఏభైయోపడి దాటిపోవచ్చింది. పైగా

అనేకమైన అసిధారావ్రతాలలో ఆరితేరిన అతని కిది ఒక ప్రశ్నగానే స్ఫురించలేదు. ఎంతసేపూ అతని కా శిష్యుల విషయమే ఒక విషమసంధిలా స్ఫురించింది. అయితే అలాగ ఎన్నాళ్లాలోచించినా అతని కేమి చెయ్యడానికీ మనసొప్పలేదు.

ఒకనాటి ప్రాతఃకాలవేళ, అతడు, తన జపతపాదులు ముగించుకుని, తన కుటీరాని కెదురుగా ఆరవేసిన నారచీరల తీరు పరిశీలిస్తూ కూర్చున్నాడు.

అవి పవిత్ర భాగీరథీజలాలలో పరిశుభ్రంగా, స్వచ్ఛంగా ఉతికి ఆరవేసిన మడుగుదోవతులు. గంగానదీ సైకతాలలో మెరిసిపోయే తెల్లని రెల్లుపూరేకల్లా ఉదికి ఆరవేసిన ఆ మడుగు దోవతులమీద శిశిర ప్రాతఃకాల సూర్యకాంతి ప్రసరించగానే అతని దృష్టి కవి కేవలం కాషాయ వస్త్రాలలా ప్రత్యక్షమైనాయి. ఆ సమయంలో హఠాత్తుగా అతని కొక అభిప్రాయం స్ఫురించింది.

ఎంతటి తెల్లని మడుగు దోవతి అయినా ఎర్ర ఎర్రని లేత ఎండ పడగానే అది కాషాయవస్త్రంలా మారిపోయింది. హృదయం కూడా ఎంత స్వచ్ఛమైనా స్త్రీసాంగత్యంలో అది ఇట్టే రాగరంజితమై పోగలదని ఆతనికి భయంవేసింది. ఆ సమయంలో శిష్యుల కిక స్త్రీసాంగత్యం క్షేమదాయకం కాదని ఒక నిశ్చయాభిప్రాయం కలిగింది. కాని వెంటనే రాగమంజరి నాశ్రమంనించి పంపించి వెయ్యడానికి మనసొప్పలేదు. అలాగని ఆమె నాశ్రమంలో ఉండనీయడానికీ మనసొప్పలేదు.

ఎప్పుడైనా తపశ్చర్యను గురించిన ధర్మసందేహాలు కలిగినప్పుడు మరీచిమహర్షి సన్నిధిలో ఆ ధర్మసందేహాలు తీర్చుకోవడం అతనికొక పరిపాటి. మరీచి మహర్షి అతనికి సన్యాసాశ్రమదీక్ష ఇచ్చిన మహామహుడు;

ఆరుణి ఆ విషయంలో మరీచి మహర్షి నొకమారు సందర్శించవలెనని అనుకొన్నాడు. శిష్యులిద్దరినీ ఆశ్రమ సంరక్షణ కప్పగించి ఆ మరునాడే మరీచి మహర్షి ఆశ్రమానికి బయలుదేరి వెళ్లిపోయాడు.

పది పదిహేను క్రోశాల దూరం నడిచి మరీచిమహర్షి ఆశ్రమం చేరుకోగానే ఆరుణి ముని హృదయంలో ఒక విధమైన ప్రశాంతస్థితి ఏర్పడింది. ఆ ఆశ్రమ వటవృక్ష చ్ఛాయలో మరీచిమహర్షి కి సాగిలిపడి అతని సన్నిధిని కూర్చోగానే ఆరుణికి తిరిగి ఇంకొక వటవృక్షచ్ఛాయలో కూర్చున్నట్టు తోచింది. అతని హృదయంలోని సంశయాలన్నీ ఒక్కమారుగా విచ్ఛిన్నమైనట్టు ఒక అపూర్వానుభూతి కలిగింది.

దట్టంగా అల్లిబిల్లిగా అల్లుకొన్న ఆశ్రమ వృక్షాల గుబురులలో కొంచెం ముందుగానే సూర్యాస్తమయం అయినట్టు కనబడింది. మరీచి మహర్షి ఆశ్రమంలోని ఉడతలు, పిచుకలు మొదలైన జీవాలు మహర్షికి దగ్గరగానే ఎంతో చనువుగా సంచరిస్తూ ఆడుకొంటున్నాయి. ఆరుణి మరీచికి సాష్టాంగనమస్కారం చేసి కూర్చోగానే ఆ జీవా లతన్ని చూచి కొంచెం బెదిరి దూరంగా పారిపోయాయి. ఒక లేడి కొంచెం దూరంలో నిలబడి అతనివైపు నిశ్చలంగా చూచింది. మరీచి మహర్షి తన కెదురుగా కూర్చున్న వృద్ధతాపసుల కిద్దరికి ధర్మోపదేశం చేస్తున్నాడు. ఆరుణిని చూచినా అతడా ధర్మోపదేశం విరమించలేదు.

"మీరెన్నడయినా వానరవినోదులు అరణ్యాలలో కోతులను పట్టుకొనే తీరులు పరిశీలించారా?"

ఆ ఇద్దరు వృద్ధులు ఆ విషయం ఎన్నడూ పరిశీలించనే లేదన్నట్లాశ్చర్యంగా మహర్షి మహర్షివైపు చూచారు. మళ్ళీ తన ప్రసంగం ప్రారంభించాడు:

"నే నది అంతా వివరిస్తున్నాను. శ్రద్ధగా ఆలకించండి! వానర వినోదులు కోతులు తిరిగే చోట భూమిలో చిన్న చిన్న మూతులున్న కలశాలను స్థాపిస్తారు. ఆ కలశాలలో కోతుల కిష్టమైన కాయలు పడవేసి దూరంగా తొలిగిపోతారు. కోతు లా కాయలకోసం ఆ కలశాలలో చేతులు పెట్టి అవి గట్టిగా పట్టుకొని పైకితీయాలని ప్రయత్నిస్తాయి. కాని ఆ కాయ లిరికించుకొన్న కోతుల పిడికిళ్ళు బాగా పెద్దవై పోతాయి. అవి

ఎంత గిలగిల కొట్టుకున్నా ఆ కలశాలలో చిక్కుకున్న పిడికిళ్ళు పైకి రావు."

ఆ వృత్తాంతం అత్యంత శ్రద్ధగా విని ఆరుణి ఎంతో ఆత్రంగా ప్రశ్నించాడు:

"ఆ కాయ లాకలశాలలోనే విడిచివేస్తే పిడికిళ్ళు సులభంగా పైకి తీసుకోవచ్చును గదా?"

"నిజమే! కోతుల కా జ్ఞానం కలగదు. అవి ఆ కాయ లలాగే పట్టుకుని అతి దీనంగా ఆక్రోశించి ఆక్రోశించి అలిసిపోతాయి. ఆ సమయంలో వానర వినోదులు వాటిని పట్టుకుని బాగా మచ్చిక చేస్తారు."

మరీచిమహర్షి ఆ విషయం ప్రసంగించడానికి కారణమేమో ఆరుణికి తెలియలేదు. అత డలాగే ఆశ్చర్యపోతూ మహర్షి కేసి చూశాడు. మహర్షి మళ్ళీ తన ప్రసంగం ప్రారంభించాడు:

"ఈ సంసార తాపత్రయాల్లో చిక్కుకొన్న దౌర్భాగ్యులు కూడా అలాంటివారే. అలభ్యమైన ఫలాలకోసం ఆ కోతుల ధోరణిలో అంగలారుస్తూ అలాగే అలసిపోయి మృత్యు దంష్ట్రిలలో చిక్కుకొంటారు. అంతేగాని ఆ అలభ్యమైన ఫలాకాంక్షలు విడిచిపెట్టాలని వారికి తెలియదు. ఎంత చెప్పినా వినిపించుకోరు."

ఆ కథ విన్న తరువాత అక్కడ కూర్చున్న వృద్ధతాపసు లిద్దరూ నిట్టూర్చి మహర్షి పాదాలకు నమస్కరించి నెమ్మదిగా అక్కడినించి వెళ్ళిపోయారు.

ఆరుణి కా కథ వినగానే నిత్యమూ తాపత్రయాలలో తలమునకలై పోతూ క్రమంగా మృత్యుదంష్ట్రిలలో పడిపోయే సంసారుల యెడల విపరీతమైన జాలి కలిగింది. వారి యమయాతన లొక్కమారు తలుచుకోగానే అతనికి కళ్ళు కొంచెం చెమ్మగిల్లాయి. ఆ క్షణంతో తన తపశ్చర్యలన్నీ నిలిపివేసి నిత్యదుఃఖితులైన పతితజనుల సముద్ధరణలోనే జీవితశేషం అంతా గడిపివెయ్యాలని అనిపించింది. అయినా కొంచెం అడకువతో మహర్షికి విన్నవించుకొన్నాడు:

"నా కీ నిత్యదుఃఖితులైన జీవుల యాతనలు తలచుకొన్న కొద్దీ ఇక

ఈ తపశ్చర్య ఇంతటితో విరమించివేసి పరమేశ్వర స్వరూపులైన పతిత జనుల పరిరక్షణలోనే జీవితశేషం యావత్తూ గడిపివెయ్యవలెననే ఉత్కంఠ కలుగుతున్నది.”

అని అలాగే రెప్పవాల్చకుండా మహర్షి ముఖం చూస్తూ కూర్చున్నాడు. ఆమాటతో మహర్షి నుదుటిపై రూక్షంగా బొమముడి ఏర్పడింది. అతడు దురుసుగా ఆరుణిమీద విరుచుకు పడ్డాడు.

“ఈ సముద్ధరణాధికారం నీ కెవరిచ్చారు? ప్రపంచం అంతా సృజించిన ఆ పరమేశ్వరుడే వారి సంరక్షణభారం వహించగలడు. మధ్యన అల్పాల్పుడవు, అజ్ఞుడవు అయిన నీ వెవరవు?”

ఆరుణి ఆ మాట విని తలవంచుకొన్నాడు. అతని కొక నిమిషం వరకు ఏమనడానికీ పాలుపోలేదు. అలాగే తలవంచుకొని వినబడీ వినబడనట్లు నెమ్మదిగా పలికాడు:

“అయితే నిత్యదుఃఖితులైన జీవు లాక్రోశిస్తూంటే మనం అంతా తటస్థంగా మాట్లాడ కూరుకోవడం ధర్మమేనా?”

మరీచి మహర్షి ముఖం ఆ ప్రశ్నతో మరింత జేవురించింది:

“ముమ్ముందు నీ ఆత్మసముద్ధరణ విషయం ఆలోచించుకో! అది జరిగిన తరవాత పతితజనోద్ధరణ విషయం ఆలోచించుకోవచ్చును లే!”

ఆరుణి అంతటితో మాట్లాడ కూరుకోలేదు:

“అయితే అంతవరకూ తటస్థంగా, మాట్లాడ కూరుకోవలసిందేనా? అది కేవలంస్వార్థదృష్టి కాదా?”

మహర్షి ముఖంలో తీవ్రత కొంచెం సడలింది:

“అహంకారావేశం అణిగిపోనంతవరకూ ఈ స్వార్థపరార్థాల నిర్ణయం మిక్కిలి దుష్కరం! అందుచేత ముమ్ముందు సాధించుకోవలసింది రాగద్వేషాది దమనం!”

అయినా ఆరుణి సందేహం అంతమాత్రంచేత తీరలేదు. అసలీ శంక లన్నీ అతనిహృదయంలో రాగమంజరిని గురించే బయలుదేరాయి. ఇక ఆ విషయం విస్పష్టంగా చెప్పకపోవడం మంచిదికాదని అతడు నిశ్చయించుకొన్నాడు. సంగ్రహంగా మరీచిమహర్షి కి రాగమంజరి విషాదగాథ అంతా

తెలియజేశాడు. ఇక మహర్షి ఏవిధంగా ఆజ్ఞాపిస్తే ఆ విధంగానే చెయ్య వలెనని నిశ్చయించుకొన్నాడు. కాని మరీచి మహర్షి ఆ ప్రశ్నకంత విస్పష్టంగా ప్రత్యుత్తరమీయలేదు. ఆరుణి అత్యంత వినయంగా ప్రార్థించిన పిమ్మట చిట్టచివర కొక నిట్టూర్పు విడిచిపెట్టాడు:

"అరుణీ! ఈవిషయం నే నేమి నిర్ణయించగలను? ఇంతకూ ఆమె అర్హత ఎట్టిదో నే నెరగను కదా! ఆమెకు సహజవిరక్తి కలిగినప్పుడు ధర్మదీక్ష ఇవ్వవచ్చును. అసలు ముమ్ముందు నీ వలవరుచుకోవలసినది రాగద్వేషరాహిత్యం. అది సిద్ధించినపు డిలాంటి వెన్ని చేసినా అవి నిన్నంట జాలవు."

ఆపైన ఆరుణి ఇక ఏమని ప్రశ్నించగలడు? కొంచెం జిజ్ఞాసా దృష్టితో మళ్ళీ ఏమో ప్రశ్నించబోయాడు. అంతలోనే మహర్షి అక్కడి నించి కదిలి వెళ్ళిపోయాడు. ఆరుణి అతని అడుగుల్లో అడుగులు వేసు కుంటూ వెనువెంటనే నడిచి వెళ్ళిపోయాడు. మహర్షి మళ్ళీ నిశితంగా ఆరుణిముఖం పరిశీలించాడు.

"ఆ పరమేశ్వరుని సంకల్పం ఎలాగున్నదో సరిగ్గా ఆవిధంగానే జరిగిపోతుంది. నీ కీ అనవసరమైన ఆందోళన ఎందుకు? యద్భావి తద్భవతి!"

అయినా అతని హృదయంలో ఆందోళన మందగించలేదు.

ఆరుణి తిరిగి తన ఆశ్రమానికి చేరుకొన్నాడు. అతడు తిరిగి వచ్చేసరి కించుమించు పదిరోజులు పట్టింది.

శిష్యులు, రాగమంజరి ఆరుణి రాకకోసం ఎదురు తెన్నులు చూస్తున్నారు. ఆరుణిని చూడగానే వారందరి ముఖాలూ ఒక్కుమ్మడిగా వికసించాయి.

ఆ పది రోజులలోనూ ఆశ్రమంలో కొన్ని కొత్త మార్పులు వచ్చాయి. ఇంతకు పూర్వం శిష్యు లిద్దరు అడివికి వెళ్ళి ఆరుణికి కావలిసిన సమిధలు, కుశలు, ఫలాలు, పుష్పాలు మొదలైనవి తీసుకు వచ్చేవారు.

కాని ఈ మధ్యన రాగమంజరి ఆశ్రమాని కనతిదూరంలో కొన్ని పూలమొక్కలు నాటింది. వాటికి పాదులు చేసింది. పొద్దస్తమానమూ వాటికి నీరుపోసి పెంచడంలోనే నిమగ్నురాలై పోయింది. మిగిలిన కాలంలో ఆమె జపతపాదులలో మునిగిపోయేది. అంతేగాక తన కుటీరమే గాక ఆరుణి కుటీరము, శిష్యుల కుటీరమూ పరిశుభ్రంగా అలికి ముగ్గులు పెట్టేది.

శిష్యుల నామె కన్నతల్లికన్నా ఎక్కువ ఆప్యాయంగా ఆదరించింది.

వారి కామె యెడల కలిగిన మాతృగౌరవ భావం పరిశీలించిన ఆరుణి కాక్షణంలో ఆవిషయంలో అంతకుపూర్వం కలిగిన భయ సందేహాలన్నీ తొలగిపోయాయి.

క్రమ క్రమంగా ఆశ్రమంలో శిశిర ఋతువుచిన్నెలన్నీ అంతరించిపోయాయి. నూతన వసంత ప్రాదుర్భావంతో రాగమంజరి పాదులుచేసి నీరుపోసి పెంచిన పూల మొక్కలన్నీ చిగిర్చి మొగ్గలు దొడిగాయి. అంతే కాదు. ఆ పరిసరారణ్యం అంతా నవవసంత ప్రాదుర్భావంతో ఒక వినూతన స్వరూపం ధరించింది.

ఒకనాటి ఉదయం రాగమంజరి కన్నతల్లిలా కొత్తగా పూచిన పూలకేసి చూస్తూ ఎంతో అమాయికంగా కనిపించింది.

ఆమె అమాయికానందం చూడగానే ఆరుణి కింతకుపూర్వం ఆమెపై కలిగిన అనుమానాలన్నీ మంచు విడిపోయినట్లు విడిపోయాయి.

"ఈమెమూలంగా నా శిష్యుల వేదాధ్యయ నాదులకు, జపతపాదులకు అంతరాయా లేవయినా కలగవచ్చునని ఎంతైనా అనుమానించాను. ఆ అనుమానాలన్నీ నా హృదయ దౌర్బల్యంవల్లనే ఏర్పడ్డాయి. సందేహామేమీ లేదు.

అని తన హృదయదౌర్బల్యానికి కొంచెం కించపడ్డాడు.

అయినా అత డంతవరకు ఆమెకు పూర్తిగా సన్యాసదీక్ష ఇవ్వనే లేదు..

మరీచిమహర్షి చెప్పినట్లు ఆమె అర్హతానర్హతలు పూర్తిగా పరిశీలించిన తరవాతే ఆమె కా సన్యాసదీక్ష ఇవ్వడం సముచిత మని అనుకొన్నాడు.

అయినా మరీచి చేసిన హెచ్చరిక లతని హృదయంలో చండీ దేవాలయ ఘంటలలా మారుమోగడం మొదలుపెట్టాయి. మరీచి మహర్షి ముందుగా చిత్తశుద్ధి, రాగద్వేష రాహిత్యము అలవరుచుకో వలసిందని నొక్కి-నొక్కి చెప్పాడు. అహంకారావేశం అణిగిపోనంతవరకు ధర్మా ధర్మనిర్ణయం చాలా క్లిష్టమని ఆదేశించాడు. ఎన్నిమారులు నొక్కి-నొక్కి అడిగినా రాగమంజరికి ధర్మదీక్ష ఇవ్వవచ్చునని కాని, ఇవ్వకూడదని కాని విస్పష్టంగా తేల్చి చెప్పలేదు. ఆరుణి అంతటితో విడిచిపెట్టలేదు. ఇంకా నొక్కి-నొక్కి అడిగాడు. అయినా మహర్షి ఆ విషయం తేల్చి చెప్పలేదు. పరమేశ్వర సంకల్పం ఏవిధంగా ఉంటే ఆ విధంగానే సర్వమూ జరిగిపోగలదని అన్నాడు. ఆ విషయంలో ఆందోళన పడడం అనవసరమని చెప్పి ఆ ప్రస్తావన అంతటితో ముగించివేశాడు.

మహర్షి ఆ విషయంలో ఇచ్చిన ఉపదేశం ఆరుణికి అంతగా రుచించలేదు. ఒకవ్యక్తి తనకు రాగద్వేష రాహిత్యం సిద్ధించేవరకూ నిత్య దుఃఖితులైన జీవుల యమయాతనలన్నీ తటస్థంగా, తనకు పట్టనట్లుగా చూస్తూ ఊరుకోవలసిందేనా?

అదీగాక ఒకవ్యక్తి తన కాత్మపరిశుద్ధి కలిగినదో లేదో నిర్ణయించు కోవడ మెలాగ?

ఆరుణికి తన చిత్తశుద్ధి విషయంలో ఎన్నడూ అణువంతైనా సందేహం కలగలేదు. పైగా పరమేశ్వర స్వరూపులైన పతితజీవుల సముద్ధరణమే తన ముఖ్యధర్మమని, ఆ ధర్మ నిర్వహణలో వెనకంజ వెయ్యడం మహా పాతకహేతువు కాగలదనీ అనుకొన్నాడు.

అయినా అతడు రాగమంజరికి పరిపూర్ణ ధర్మదీక్ష ఇవ్వడంలో తొందరపడలేదు.

రాగమంజరికూడా ఆ విషయంలో అతని నేమీ బలవంతం చెయ్య లేదు. అన్ని విషయాలలోను అతని ఆజ్ఞప్రకారమే ప్రవర్తించింది. అతడే తనకిక శరణ్యమని నమ్మింది.

అలాగలాగ వసంతం గడిచిపోయింది. క్రమక్రమంగా గ్రీష్మం కూడా గడిచిపోయింది. ప్రచండ గ్రీష్మంలోకూడా జపతపాదులలో రాగమంజరిభక్తిశ్రద్ధలు పరిశీలించిన ఆరుణి కిక ఆమెను పరీక్షించడం కేవలం అన్యాయమే అని తోచింది.

ఆ మరునాడే ఆమెకు పరిపూర్ణదీక్ష ఇచ్చాడు.

రాగమంజరి అతని అపార వాత్సల్యాని కెంతో సంతోషించి సాష్టాంగనమస్కారం చేసింది. వేడి వేడి కన్నీటితో ఆరుణిముని పాదాలు తడిపివేసింది.

ఆమె శ్రద్ధాభక్తులు పరిశీలించిన ఆరుణి కెంత ప్రయత్నించినా కనుగొలుకులలో కన్నీటిబిందువులు నిలవలేదు. అవి నెమ్మది నెమ్మదిగా చెక్కిళ్ళపై దిగజారాయి.

వర్షాకాలం ప్రవేశించగానే ఆరుణి ఆశ్రమంలో అంతటా నవనవోన్మేషం నర్తించింది. మోడులైపోయిన ఆశ్రమవృక్షాలన్నీ చల్లచల్లని జల్లులలో తలలూగిస్తూ నృత్యాలు చేశాయి.

ఆరుణి ఆనాటి ఉదయం నిశ్చలధ్యాననిష్ఠలో నిమగ్నుడై వ్యాఘ్రాజినం మీద మలిచిన స్వర్ణ ప్రతిమలా కూర్చున్నాడు.

అంతలో దూరదూరంగా ఒక నల్లనల్లని పిల్లమబ్బు ఆకాశంలో అంతటా ఆక్రమించడం మొదలు పెట్టింది. కొంతసేపటికి గంగానదీ తరంగ సంగీతంతో కలిసిన చల్లచల్లని పిల్ల తెమ్మెర లాశ్రమ లతల తలలూగించాయి.

కారు మబ్బు లింకా ఆకాశం అంతా ఆక్రమించుకోలేదు. చెట్ల కొమ్మలలోనించి బయటపడిన ఎర్రఎర్రని సూర్యకిరణా లారుణి శరీరం మీద, వ్యాఘ్రాజినం మీద ప్రసరించాయి.

తెరలు తెరలుగా గాలి వీచింది. తెరలు తెరలుగా ఆశ్రమం అంతా చల్ల చల్లని జల్లులు పడ్డాయి. అయినా అవి ఆరుణి ధ్యాననిష్ఠ కేమీ భంగం కలిగించలేదు. అతడలాగే నిశ్చలంగా ధ్యానించాడు. మళ్ళీ ఒక నిమిషంలో ఇంకొక పెద్ద జల్లు పడింది.

ఆరుణి తన ధ్యానం అంతటితో కొంచెం చాలించి నెమ్మదిగా కళ్లు తెరిచాడు. ఎదురుగా ఆకాశంలో కొంత మేర కారుమబ్బులు కమ్ముకున్నాయి. కాని ఆశ్రమంలో ఎండపొడ లింకా అలాగే నిలిచి ఉన్నాయి. మధ్యన మధ్యన మేఘాల కదలికలో అవి ఒక క్షణకాలంపాటు అదృశ్యమై అంతలోనే మళ్ళీ కళ్ళకు మిరుమిట్లు గొలుపుతున్నాయి.

అతని కెదురుగా కొంతదూరంలో రాగమంజరి పూలమొక్కలకు నీళ్ళుపోస్తూ నిలబడింది. అప్పుడప్పుడు చిన్న చిన్న జల్లులు పడినా ఆమె అవి లెక్కచేయకుండా అలాగే ఆ పూలమొక్కలకు నీళ్ళుపోస్తూ వనలక్ష్మిలా మెరిసింది.

ఆ సమయంలో ఆరుణి హృదయంలో కూడా అదేభావం స్ఫురించింది. ఒక నిమిషం ఆ భావన అతని హృదయంలో వర్షాకాల మయూరంలా పురివిప్పి ఆడింది. అంతలో దూర దూరంగా అతనికి పురివిప్పి ఒయ్యారంగా నృత్యంచేసే రంగు రంగుల నెమలి కేక వినిపించింది. క్షణకాలం అతని దృష్టి అటువైపు తిరిగింది. ప్రాతఃకాల సూర్యకాంతిలో ధగద్ధగాయమానంగా మెరిసిపోయే ఆ నెమలిపింఛం చూడగానే అతనికి రాగమంజరి మనోహరాకృతి మళ్ళీ స్ఫురణకు వచ్చింది. తిరిగీ అతని దృష్టి రాగమంజరి ముఖంపై నృత్యంచేసే ముంగురులవైపు తిరిగింది.

అలాగే ఎంతో ఆప్యాయంగా పూలమొక్కలకు నీళ్ళుపోసే ఆమె ముంగురులపై లేత లేత సూర్యకిరణాలు ప్రసరించాయి.

ఆ సమయంలో ఆమె అతనికి అచ్చంగా పురివిప్పి ఆడే నెమలిలాగే కనిపించింది. క్షణకాలం అతని దృష్టి ఆమె ముంగురులలో చిక్కుపడిపోయింది.

హఠాత్తుగా అతడు తన మనస్సు నిగ్రహించుకొన్నాడు. తన

హృదయంలో అటువంటి భావన కలిగినందు కెంతైనా పశ్చాత్తాప పడ్డాడు.

ఇంతకు పూర్వం ఆమెవల్ల తన శిష్యుల ఏకాగ్రత కేమైనా భంగం కలగవచ్చునని ఆరుణి కొంచెం భయపడ్డాడు. కాని ఇప్పుడతని హృదయమే చలించింది. అది తలుచుకోగానే అతని శరీరం జుగుప్సతో జలదరించింది.

"నా శిష్యుల నిష్ఠ కేమైనా భంగం కలిగవచ్చు ననుకొన్నాను గాని చివరి కీమె నానిష్ఠకే భంగం కలిగించిందే!"

అని తన మనోదౌర్బల్యాని కెంతైనా మథనపడ్డాడు. మళ్ళీ మనస్సు నిలవరించుకొని చండీదేవి నొకమారు మనసారా ధ్యానించుకొన్నాడు. యథాప్రకారం ధ్యాననిష్ఠలో పడ్డాడు. దృష్టి నాసాగ్రం మీదికి మళ్ళించాడు. కాని అతని ఏకాగ్ర దృష్టి కెదురుగా రాగమంజరి సుందర నాసిక మాత్రమే ప్రత్యక్షమైంది. అతడు తన యావచ్ఛక్తీ వినియోగించి, కొంతసేపటి వరకు ప్రాణాయామంచేసి తిరిగీ ధ్యాననిష్ఠలో ప్రవేశించాడు. ఈ మారతని ధ్యాననిష్ఠ ఎక్కడా చెక్కు చెదరకుండా నిశ్చల దీప కళికలా నిలిచింది.

# 8

ఆటుపిమ్మట వారం పదిరోజులు గడిచిపోయాయి. క్రమ క్రమంగా ఆరుణి ధ్యాననిష్ఠలో బిగువు సడిలిపోయింది. ఎంత ప్రయత్నించినా అతని కా దృఢనిష్ఠ తిరిగి సాధ్యపడలేదు.

దానితో అతనికి తన జీవితంమీద, తన దౌర్బల్యంమీద విపరీతమైన అసహ్యం కలిగింది. ఆరుణి ఏభై యోపడి దాటిపోవచ్చింది. ఇన్నాళ్ళనించీ కఠినమైన అసిధారావ్రతా లెన్నో అవలంబించి కృతకృత్యుడనయినా నని అనుకొన్నాడు.

అత డాజన్మబ్రహ్మచారి. ఎన్నడూ అతని మన స్సింతగా దుర్బలమై నీరసించిపోలేదు. తన నీచ దౌర్బల్యం తలచుకుంటే అతనికి నిలుచున్న పాటుగా గంగానదిలో ఉరికి ప్రాణ పరిత్యాగం చెయ్యాలని అనిపించింది. ఇక మర్రి అంతకన్న గత్యంతరం లేదని అనిపించింది.

ఆ సాయంత్రమే తిన్నగా గంగానదికి బయలుదేరాడు. దారిలో అతనికి చండీ దేవాలయ శిఖరం ఎదురుపడింది. వెంటనే లోపలికి వెళ్ళి ఆ దేవత పాదాలపై వాలిపోయాడు.

"తల్లీ! బాల్యం నించి నీ పాదపద్మాలాశ్రయించాను. అచిర కాలంలోనే నీ దివ్యస్వరూపం కళ్ళారా సాక్షాత్కరింపజేసుకోగలనని ఆశించాను. కాని ఇంతలోనే నన్నీవిధంగా ఈ మాయా మోహ జాలంలో కూలద్రోయడం నీకు న్యాయమేనా?"

అని ఆ దేవత పాదపద్మాలపై నిశ్చలంగా దృష్టి నిలుపుకొన్నాడు. క్షణకాలం పాటతని మనస్సు దేవి పాదపద్మాలలో లీనమైపోయింది.

అతని కాపాదా లేదో దివ్య తేజస్సుతో తళతళా మెరిసిపోతున్నట్లు స్ఫురించాయి. అవి శిలామూర్తి పాదాలలా కనిపించలేదు. ఎవరో దేవతా మూర్తి పాదపద్మాలలా మెరుస్తూ అతని కళ్ళలో వెలుగులు విరజిమ్మాయి.

అతడు చండీదేవి స్వయంగా సాక్షాత్కరించిందని అనుకొన్నాడు. కళ్ళెత్తి నఖ శిఖపర్యంతమూ ఆ దేవిమూర్తి తిలకించాడు. కాని అది చండీ దేవీ స్వరూపం కానేకాదు. అది చిరునవ్వుల పువ్వులు చిలకరించే రాగ మంజరి మనోజ్ఞ మూర్తి!

దేవీస్వరూపం ఆ విధంగా తన కళ్ళ కెదురుగా స్ఫురించగానే అతని హృదయం పశ్చాత్తాపాగ్నిలో పడి దగ్ధమై పోయింది! దేవిపాదాలపై వాలిన క్షణంలో కూడా అతని హృదయంలో రాగమంజరి సౌందర్యమే సాక్షాత్కరించింది! 'నా హృదయం ఎంతగా పాపపంకిలమై పోయింది!' అని ఒక క్షణకాలం అతడలాగే నిర్ఘాంతపోయాడు.

ఉత్తర క్షణంలో నాలుగైదు మార్లు లా దేవి శిలాపాదాలపై తల బద్దలు కొట్టుకున్నాడు. ఆ తీవ్రాఘాతాలతో అతని నుదురు బాగా బొప్పి కట్టింది. క్షణకాలంపాటతనికి ఒంటిమీద స్పృహే తప్పి పోయింది.

స్పృహ రాగానే ఆరుణి మనస్సు బాగా కుదటబడింది. అతడొక గడియ వరకు దేవీ పాద ధ్యానంలోనే మునిగి పోయాడు.

ఆ ధ్యానంలో అతని కేవిధమైన మనశ్చాంచల్యమూ కలగలేదు. అతడలాగే మరొక అరగడియవరకు నిశ్చలంగా ధ్యానించాడు. అయినా అతని మనస్సలాగే నిశ్చల దీపకళికలా నిలబడింది.

ఆ సాధనతో అతని కెంతో ధైర్యం కలిగింది. అదే క్షణంలో అతని కొక నిశ్చల సంకల్పం కలిగింది. ఆ సంకల్పం తనకు దేవి అపార కరుణ వల్లనే కలిగినదని అత డనుకొన్నాడు. దేవి తన్ను విడనాడలేదని తన మనో దౌర్బల్యం పూర్తిగా నిర్మూలించి వెయ్యడానికే ఆ విధమైన అగ్నిపరీక్ష చేసినదని అనుకొన్నాడు.

తరవాత ప్రశాంత హృదయంతో చిరునవ్వులు చిలకరిస్తూ నెమ్మది నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ తన కుటీరంలోనికి వెళ్ళిపోయాడు. ఆ రాత్రి అతనికి గాఢంగా నిద్ర పట్టింది. ఆ మరునాడు నిద్ర లేవగానే తన దృఢ సంకల్పం ప్రకారమే నడుచుకోవాలని నిశ్చయించుకొన్నాడు.

దేవాలయంలోనికి వెళ్ళక పూర్వం అతని కొక సంకల్పం కలిగింది. ఆరుణి మొట్టమొదటి ఆవేశంలో గంగలోపడి ప్రాణత్యాగం చెయ్యవలెననే అనుకొన్నాడు. చండీ దేవాలయ శిఖరం చూడగానే ఆత్మహత్య మహాపాతక హేతువనీ,అంతకన్న రాగమంజరినే ఏదో మిష పెట్టి ఆశ్రమం నించి పంపించివెయ్యడమే మంచిదనీ అనిపించింది. కాని దేవాలయంలో ఒక గడియసేపు ధ్యానం చేసిన పిమ్మట ఆ సంకల్పంకూడా అతని కంత సముచితంగా కనిపించలేదు.

కామినీకాంచనాలకు దూరదూరంగా పారిపోయి అరణ్యంలో ముక్కు మూసుకుని కూర్చున్నవారందరూ తాము జితేంద్రియులమైనామని మురిసిపోతారు. కాని కించిత్తు కామినీకాంచన సంపర్కం కలిగేసరికి వారి హృదయాలన్నీ తామరాకుమీది నీటిబిందువుల వతుగా చలించిపోవచ్చును. అందుచేత కామినీకాంచనాలకు దూరదూరంగా పారిపోకుండా వాటి సన్నిధిని నిగ్రహం అవలంబించినప్పుడే అది నిజమైన మనోనిగ్రహం అనిపించుకుంటుంది. కనకనే రాగమంజరివంటి దిక్కులేని పతితవనితను తిరిగి చంపానగరానికి పంపించివేస్తేమాత్రం ప్రయోజనమేమిటి? ఆమె సన్నిధిలోనే దృఢమైన ఆత్మనిగ్రహం అవలంబించి ఉరకలు వేసుకుంటూ మున్ముందు కురికే ఇంద్రియాశ్వాలను నిగ్రహించాలి. అప్పుడే సముచితమైన

ఇంద్రియ నిగ్రహం అలవడగలదు. అసలు నిగ్రహం లేనివాడు రాగమంజరిని పంపించివేస్తేమాత్రం ప్రయోజనమేమిటి?

ఆరుణిసంకల్పం క్రమక్రమంగా ఆ విధంగా రూపుదాల్చింది.

ఆనాటి సాయంకాలం రాగమంజరి అతని సన్నిధికి వచ్చికూర్చుంది. ఆరుణి చూచీ చూడనట్టుగా ఆమెవైపు చూచాడు. అతనిలో పశ్చాత్తాపాగ్ని మళ్ళీ ప్రజ్వలించింది.

"వల్లమాలిన సంసారవిరక్తితో ఒక పతితవనిత 'మరి వేరే దిక్కు లే'దని నా పాదా లాశ్రయించింది. శాయశక్తులా నియమాలు, దీక్షలు అవలంబించింది. ఆమె ప్రవర్తనలో అణువంతైనా లోపం కనిపించలేదు. అయినా నేను ఆమె నాశ్రమంనించి పంపించివెయ్యవలెనని సంకల్పించాను. కేవలం అది నా మనస్సులో ఉదయించిన మనోదౌర్బల్యం కాక మరేమిటి?"

అని కొంచెం పరిశీలనగా ఆమెవైపు చూచాడు. రాగమంజరి కొంతసే పారుణివైపు చూచి వెంటనే తలవంచుకొని ఒక్క నిట్టూర్పు విడిచిపెట్టింది. ఆరుణి కామె మనోవైకల్యానికి కారణం తెలియలేదు. "ఏమమ్మా, ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లున్నావే!"

"ఏమీ లేదు. నా కీవేళ ఉదయమే ఒక పీడకల వచ్చింది. అది తలుచుకుంటే నా కిప్పటికీ భయంగానే ఉంది."

"అమ్మవారిని తలుచుకుంటే అన్ని పీడకలలూ హరించిపోతాయి! అయినా ఏమా పీడకల?"

"నావంటి పతిత లాశ్రమంలో ఉండడం సముచితం కాదని తాము నన్నీ ఆశ్రమాన్నించి తిరిగీ చంపానగరానికి పంపించి వేశారట! నిర్దాక్షిణ్యంగా తిరిగి ఆ నరకకూపంలో తోసివేశారట. అదీ నాకు వచ్చిన కల. అది తలుచుకున్న కొద్దీ నాకేమో భయంగా ఉంది!"

"నీ కలాంటి కల ఎందుకు వచ్చింది? శిష్యులేమైనా అలాంటి మాట లనుకొన్నారా?"

"అవును. వారిద్దరి ప్రసంగం నాకు కొంచెం చూచాయగా వినిపించింది. నాలాంటి వారికి ధర్మదీక్ష ఇవ్వడం సముచితం కాదని వా రొకనాడు ప్రసంగించుకుంటూంటే నా చెవిని పడింది."

"ఎన్నాళ్ళ క్రితం?"

"నే నీ ఆశ్రమానికి వచ్చిన కొత్తలో!"

ఆరుణి కలకల నవ్వాడు.

"దానికా నీ వింతగా భయపడుతున్నది! ఇప్పుడు నీ కలాంటి భయ మేమీ లేదులే."

అని ఆరుణి ఆమె నెంతో ఆప్యాయంగా ఓదార్చాడు.

ఆ ఓదార్పు మాటలు వినగానే రాగమంజరి కనుగొలుకులలో రెండు చిన్న చిన్న కన్నీటి బిందువులు నిలిచాయి. ఆమె గొంతుక కొంచెం సవరించుకుంది:

"స్వామీ! ప్రపంచంలో సమస్తమూ క్షణభంగురమే కదా! యౌవనము, భాగ్యభోగాలు, సౌందర్యము, అన్నీ మరు మరీచికలలాగే క్షణంలో నశించిపోతున్నాయే! అయినా ఈ జీవు లీ సంసార వ్యామోహంలో పడి తల మునకలై పోవడానికి కారణ మేమిటి?"

ఆమె వైరాగ్య ప్రసంగం ఆలకించగానే ఆరుణి కెవరో హఠాత్తుగా వీపుపై చరిచినట్లయింది.

తన హృదయంలో ఇన్నాళ్ళనించీ రేగిన ఆందోళన ఆమె పసిగట్టి వేసిందేమోనని మొట్టమొదటగా అతనికి కొంచెం అనుమానం వేసింది. ఆరుణి అలాగే నిశ్చలంగా ఆమె ముఖవైఖరి పరిశీలించాడు. ఆ ధోరణి కొంచెం గమనించగానే అతని అనుమానం క్రమక్రమంగా పటాపంచలై పోయింది.

"కేవలం నా నీడ చూచే నే నీవిధంగా భయపడుతున్నాను."

ఆరుణి తనలోతానే నవ్వుకొన్నాడు.

"రాగమంజరీ! దీనిలో ఇంతగా ఆలోచించవలసిందేముంది? అంతా ఆ జగజ్జనని మాయ! హరిహర బ్రహ్మాదులుకూడా ఆ మాయా వాగురలో నించి తప్పించుకొని బయటపడలేరు!"

అని ఒక్క చిన్న నవ్వు నవ్వాడు. రాగమంజరి ఆ మాట విని బాగా తలవంచివేసింది. అయినా ఆమె చెక్కి ళ్ళెర్రబడిన విషయం ఆరుణి గ్రహించాడు. రాగమంజరి అలాగే తలవంచుకుని మళ్ళీ అడిగింది.

"స్వామీ, స్త్రీలకు మరి మోక్షాధికారం లేదా?"

"లేకేమి?"

"అయితే, ధర్మశాస్త్రజ్ఞులు వారికి సన్యాసాధికారం ఎందుకు కలిగించలేదు?"

"సామాన్యంగా స్త్రీలకు సన్యాసాధికారం లేనిమాట నిజమే! అయితే అర్హతానర్హతలను బట్టి వారికి సన్యాసదీక్ష ఇవ్వవచ్చునని ఆచార్యులాదేశించారు."

తరవాత రాగమంజరి తల ఎత్తి ఆరుణివైపు చూచింది: "స్వామీ! నేను సమస్తము పరిత్యజించి మీ పాదాలాశ్రయించాను. నన్ను తిరిగి ఆ నరక కూపంలో పడదోయకండి!"

అని అతని రెండు పాదాలూ గట్టిగా పట్టుకుంది. ఆరుణి తన పాదాలు దూరంగా తొలగించివెయ్యాలని అనుకున్నాడు గాని ఆమె గట్టిగా పట్టుకోవడంవల్ల అది సాధ్యపడలేదు.

"అమ్మా! నీ వనవసరంగా భయపడుతున్నావు. నేను తిరిగి నిన్నా నరకకూపంలో తోసివెయ్యదలుచుకోలేదు. నా మాట నమ్ము."

అని అనేకవిధాలుగా ఆమె నోదార్చాడు. తరవాత రాగమంజరి నెమ్మది నెమ్మదిగా అతని పాదాలొత్తడం మొదలుపెట్టింది.

"స్వామీ! నా వంటి దీనురాలిని మీరు కాక ఇంకెవ రుద్ధరించ గలరు?"

అని ఎంతో జాలిగా, కేవలం పసిపాపలా అతనివైపు చూచి ప్రాధేయపడింది.

అలాటి భయమేమీ లేదని ఆరుణి మళ్ళీ ఆమెకు గట్టిగా ధైర్యం చెప్పాడు.

మృదువైన ఆమెహస్తం పాదాలమీద పడగానే అతని హృదయం కొంచెం జలదరించింది. అతడు కళ్ళు మూసుకుని చండీదేవతా ధ్యానంలో పడ్డాడు. అలాంటి ఘట్టంలో నిశ్చలధ్యానం సాధించినప్పుడే సరియైన ఇంద్రియనిగ్రహం అలవడగలదని ఆరుణి కా క్షణంలో మళ్ళీ జ్ఞాపకం వచ్చింది.

ఆమె అలాగే కాళ్ళుపట్టినా అతని ధ్యానం ఎక్కడా చెక్కు చెదర లేదు. క్రమంగా ఇంద్రియాశ్వాలన్నీ బాగా లొంగిపోయాయని గుర్తించిన అరుణి ఆ క్షణంలో తన ఘన విజయాని కెంతైనా సంతోషించాడు!

# 10

"అయ్యయ్యో! నే నీ సుడిగుండంలో పడి మునిగి పోతున్నాను! రక్షించండి! రక్షించండి!"

అని ఒక ఆర్తనాదం గంగా తీరంలో హృదయవిదారకంగా మారు మోగింది.

అప్పటి కింకా బాగా తెల్లవారలేదు. కొంచెం చీకటిగానే ఉంది. ఆపైన ఆకాశం అంతటా కారుమబ్బులు కమ్ముకొన్నాయి. వర్షం కురిసీ కురవనట్టు కురుస్తూంది. ఈదర గాలి వీచి గంగానదీతరంగా లుద్వేత్తుగా పొంగుతున్నాయి. మళ్ళీ ఆర్తనాదం మరింత హృదయవిదారకంగా వినిపించింది. అది క్రమక్రమంగా మునిగిపోతున్నట్టు ధ్వనించింది.

ఆ దారుణాక్రందనధ్వనితో గంగానదీ సైకతంలో పద్మాసనాసీనుడై నిశ్చలంగా ధ్యానిస్తున్న అరుణికి హఠాత్తుగా ధ్యానభంగమయింది. అతడొక్కమారు కళ్ళు తెరిచి అటువైపు చూచాడు. క్షణంలో అదంతా అతనికి అవగాహన అయిపోయింది.

రాగమంజరి కూడా తెల్లవారుజామునే లేచి గంగా నదిలో స్నానం చేసి జపతపాల కుపక్రమిస్తూ ఉంటుంది. అయితే ఆమె స్నానం చేసే ఘట్టం అతడు స్నానం చేసే ఘట్టానికి కొంచెం దూరం. ఆమె ఏదో పెద్ద ఆపత్తులో చిక్కుకొని ఉండవచ్చు నని ఊహించడాని కతని కొక క్షణం కూడా పట్టలేదు. ఆ ప్రాంతంలో అప్పుడప్పుడు మొసళ్ళు మొదలైన క్రూర జలచరాలు కూడా మసులుతూ వుంటాయి. వాటిమూలంగా ఆమె కేదైనా ఆపద సంభవించిఉండవచ్చు నని క్షణంలో అతని కింకొక ఊహ స్ఫురించింది.

వెంటనే అత డక్కడికి పరిగెత్తాడు. ఆ ప్రాంతం అంతా జాగ్రత్తగా పరిశీలించాడు. ఎక్కడా ఆమె జాడ కనిపించలేదు. ఇంకా బాగా

నదీగర్భంలోకి చొచ్చుకు పోయాడు. రెండు మూడు నిమిషా లా ప్రాంతం కొంత వరకు గాలించాడు.

అదృష్టవశాత్తూ ఒక్క చోట ఆమె శరీరం చేతికి తగిలింది. అక్కడ అంత లోతుగా లేదు. వెంటనే అత డామెను రెండు చేతులతోనూ గట్టిగా పొదివి పట్టుకున్నాడు.

రాగమంజరి గాఢంగా కౌగలించుకుని శక్తి కొద్దీ అతన్ని గట్టిగా పట్టుకుంది. నీటిలో నించి నెమ్మదిగా ఒడ్డుకు తీసుకు వచ్చేదాకా ఆమె శరీరం అతని కంతగా భార మనిపించలేదు.

అప్పటికి కొంచెం తెల్లవారింది. అతని కామె అర్ధనగ్నంగా ఉన్నట్టు కనిపించింది. రాగమంజరి కింకా స్పృహ వచ్చినట్లు కనబడలేదు. అతడే ఆమె శరీరానికి ఆచ్ఛాదన కల్పించాడు. రాగమంజరికి తెలివి వచ్చే దాకా కొంచెంసే పలాగే ఆమె పక్కనే కూర్చున్నాడు.

క్రమంగా కొంతసేపటికి రాగమంజరికి తెలివి వచ్చింది. తన పరిస్థితికి బాగా సిగ్గుపడి, ఆమె, తడిసి ముద్దఅయిపోయిన నార చీరతో ఒళ్ళంతా కప్పుకుంది. అయినా ఆమెకు శరీరం అంతా అర్ధనగ్నంగా ఉన్నట్లే కనబడింది. రాగమంజరి ముఖం వల్లమాలిన సిగ్గుతో చిమిడిపోయింది.

ఆరుణి అనేక విధాలుగా ఆమె నోదార్చాడు. రాగమంజరి అతని బుజం ఆనుకుని నెమ్మదిగా లేచి నిలబడింది. అలాగే అతని ఆసరాతో నెమ్మదినెమ్మదిగా నడక సాగించింది.

ఆరుణి ఆమెధోరణి జాగ్రత్తగా పరిశీలించాడు. ఆమె ఇంకా మగత నిద్రలో నడుస్తున్నట్లే కనబడింది. అతని ఓదార్పు మాటల కామె సరియైన ప్రత్యుత్తరా లివ్వలేదు. వారిద్దరు అలా పది బారల మేర నడక సాగించారు.

అంతలోనే ఆమె హఠాత్తుగా అతన్ని గాఢంగా కౌగలించుకుంది.

"అయ్యొయ్యో! మునిగిపోతున్నాను! మునిగిపోతున్నాను! రక్షించండి! రక్షించండి!" అని గట్టిగా కేకలు పెట్టింది. ఆమె హఠా దాలింగనాఘాతానికి తట్టుకోలేక అతడు గంగాసైకతంలో కూలబడి పోవలసిందే! కాని పడిపోకుండా అతి కష్టంమీద కాళ్ళు గట్టిగా నిలవ

దొక్కుకున్నాడు. ఆమె కింకా పూర్తిగా తెలివి రాలేదని క్షణంలో గ్రహించివేశాడు. ఆమె నలాగే గట్టిగా అదిమి పట్టుకొని నెమ్మదిగా ఓదార్చడం మొదలు పెట్టాడు. కాని అతని నోట మాట లంత తేలికగా వెలువడలేదు.

అర్ధనగ్నమైన ఆమెశరీర గాఢాలింగనంతో నఖశిఖపర్యంతము విద్యుదాఘాతం సోకినట్లయి అతని ఒళ్ళంతా జలదరించింది.

అగరు ధూమవాసన తలకెక్కిన ట్లతని మనస్సులో అంతటా మైకం కమ్మింది.

వారిద్దరు అలాగే నడుస్తూ ఆమె నివసించే కుటీరం సమీపించారు. ఆ తరువాత ఆమె కుటీరంలోకి వెళ్ళి మెత్తని వ్యాఘ్రాజినం మీద మేను వాల్చింది.

ఆరుణి శిష్యుల కప్పటికి జరిగిన గాథ అంతా తెలిసింది. కొంచెం స్వస్థతకలిగేవరకు వారు కొంతసే పామె కుటీరంలోనే ఉండి జాగ్రత్తగా పరిచర్యలు చేశారు. తరవాత ఆమెకు బాగా తెలివి వచ్చింది. అయినా ఆమె అప్పుడప్పుడు చెరుపు మరుపుగా మాట్లాడడం మానలేదు. వా రా విషయం వెంటనే ఆరుణికి తెలియచేశారు.

ఆరుణి కామె పరిస్థితి తలుచుకుంటే అదంతా ఒక పెద్ద విషమ సంధిలా కనబడింది.

ఇంతకీ గంగా నదిలో ఆమె కేవిధమైన ఆపద వచ్చిందో అతనికి బోధపడలేదు. బహుశః కొంచెం కాలు జారి ప్రవాహవేగంలో పడి కొట్టుకు పోతూ భయపడి ఆ విధంగా కేకలుపెట్టి ఉండవచ్చు నని అత డూహించాడు. అంతేగాని ఆ విషయాలేవీ ఆమె తిన్నగా చెప్పలేక పోయింది. ఆ భయోద్వేగంలో ఆమెకు తాత్కాలికంగా కొంత మనశ్చాంచల్యం కలిగి ఉండవచ్చు నని అత డూహించాడు.

ఆ మరునా డామె పరిస్థితి కొంచెం బాగుపడింది. కాని మనశ్చాంచల్యంలో అంతగా మార్పేమీ లేదని శిష్యు లాచార్యునికి తెలియజేశారు. ఆరుణి ఆ మాట విని బాగా ఆందోళన పడ్డాడు.

# 11

ఆ వేళ సాయంత్రం ఆరుణి రాగమంజరి పరిస్థితి పరిశీలించడానికి కామె కుటీరానికి వెళ్ళాడు. కుటీరంలో ఒకమూల మినుకు మినుకు మంటూ గారకాయనూనె దీపం వెలుగుతూంది. ఆరుణి క్షణకాలం ఆమెపరిస్థితి పరిశీలించాడు.

చెదురుచెదురుగా ఆకాశం అంతటా అలముకొన్న నల్లని మబ్బు లలాగలా కరిగి కరిగి వానజల్లులుగా మారిపోయాయి. అంతలోనే అవి పెద్ద వానగా వినిపించాయి.

ఆరుణి లోపలికి వచ్చిన అలికిడి విని రాగమంజరి నెమ్మదిగా నీర సంగా కళ్ళు తెరిచింది.

"నీ వంట్లో ఎలాగుంది?"

ప్రశ్నించా డారుణి, ఎంతో ఆత్రంగా.

రాగమంజరి పెదవిపై చింతపువ్వువంటి చిరునవ్వు మెరిసింది. "ఈవేళ కొంచెం తేలికగానే ఉంది. ఇక నాకేమీ భయంలేదు."

అయినా ఆరుణి కామె చిత్తస్థైర్యం మీద అంతగా నమ్మిక కలగ లేదు. ఆమెచూపులలో మనశ్చాంచల్యచిహ్నా లింకా మెదులుతూనే ఉన్నాయి.

అంతలో రాగమంజరి నాడీ పరీక్షకోసమని ముంజేయి అతనికి అందించింది.

ఆరుణికి హస్తనిదానం అంతబాగా తెలియదు. అయినా ఏదో విధంగా ధైర్యం చెప్పవచ్చునని అత డామె నాడీ పరిశీలన ప్రారంభిం భించాడు. నాడీ పరీక్ష కనుకూలంగా ఆమె నెమ్మదిగా లేచి కూర్చుంది.

వర్షం క్రమంగా క్షుతిమించి రాగంలో పడింది. ఆరుణి నాడీ పరీక్ష ముగించి వెంటనే తిరిగి కుటీరంలోకి వెళ్ళిపోవా లనుకొన్నాడు. కాని వర్షంవల్ల అలాగే ఆ నాడీనిదానం కొంచెం ఆలస్యం చేశాడు. అంతలో నూరు రథా లొక్కపరుగు పెట్టిన ట్టురుములు ఫెళఫెళమని మారుమోగాయి. రాగమంజరి ఆ ధ్వని వింటూనే—

“అయ్యో! మునిగి పోతున్నాను, మునిగి పోతున్నాను.”

అని గట్టిగా ఒక్క కేక పెట్టి రెండు కళ్ళూ మూసుకుని, వెంటనే అతన్ని గాఢంగా కౌగలించుకుంది.

ఆరుణి ఎంత ప్రయత్నించినా ఆమెకౌగిలి విడిపించుకోలేక పోయాడు. కొంతసేపటి వరకు అతనికొక పెద్ద మొసలివాత పడిపోతున్నట్లనిపించింది. మరి కొంత సేపటి కా స్ఫురణే పూర్తిగా నశించిపోయింది!

క్రమంగా విస్మృతి, ఆనందోన్మాదము ఒక దానితో ఒకటి పెన వేసుకుని అతని హృదయంలోను, శరీరంలోను పక్షవాతంలా కమ్ముకున్నాయి. రాగమంజరి కౌగిలింతలో ఆరుణి పూర్తిగా వివశుడై పోయాడు!

ఆ తరవాత కొంతసేపటికి వాన వెలిసింది. ఆరుణి ఆ అదను కనిపెట్టి చల్లచల్లగా తిరిగి తన కుటీరానికి మళ్ళి పోయాడు. తరవాత క్రమక్రమంగా వారిద్దరిమధ్య కొంచెం గట్టి అనుబంధమే ఏర్పడింది.

రాగమంజరితో అతని కిప్పుడు బాగా సన్నిహిత సంసర్గం కలిగింది. ఆ ఆవేశోన్మాదంలో అతని కా సంసర్గమే ఒక విధమైన ఆధ్యాత్మికసాధనగా ఉపకరించగలదని తోచింది. పాశవిక ప్రవృత్తికి దోహదమిచ్చే కామినీసంసర్గ సురాపానాదులతో తాంత్రికులు చేసే సాధనలు కొన్ని అత డప్పుడప్పుడు చూచాయగా విన్నాడు. వా రా విధంగా సిద్ధి పొందిన సందర్భాలు కొన్ని అతని కింతకు పూర్వం చెవినిపడ్డాయి. ప్రస్తుతం రాగమంజరితో ఏర్పడిన సంసర్గం ఆ విధంగా ఒక తాంత్రిక సాధనగా ఉపకరింపగలదని అతనికి తోచింది.

వారిద్దరు పూజా పుష్పాల కోసమని సాయంకాలవేళ అరణ్యంలోనికి వెళ్ళిపోయేవారు. చీకటిపడేదాకా అరణ్యంలో కాలక్షేపం చెయ్యడం వారి కొక పరిపాటిగా ఏర్పడిపోయింది.

అలా ఒక పక్షంరోజులు గడిచిపోయాయి.

ఆ రోజులలో ఆరుణిముని సామాన్యజీవుల సంసారవ్యాసంగానికి బీజభూతమయిన కామినీవ్యామోహ రహస్యం అంతా పూర్తిగా ఆకళించుకొన్నానని అనుకొన్నాడు. అంతేకాదు: అత డావ్యామోహానికి అతీతుడననీ, అది తనకింక బంధహేతువు కాజాలదనీ అనుకొన్నాడు. ఆ విధంగా

రాగమంజరితో సంబంధం ఏర్పడడం తన తపస్సాధన కొక చివరి మెట్టుగా ఉపకరించినదని కూడా అతనికి స్ఫురించింది. మరికొంత కాలానికి అదంతా చండీదేవి అనుగ్రహ ఫలితమే అని కూడా అనుకొన్నాడు.

క్రమ క్రమంగా రాగమంజరి సంసర్గం తన కేమీ అంటజాలదని అతనికొక స్పష్ట నిశ్చయం కలిగింది. ఆ నిశ్చయం రాగమంజరితో అతని కేర్పడిన గాఢ సంసర్గానికి మరింత దోహదం కలిగించింది.

అరుణి ఒకనాటి సాయంకాలం వేళ ఇటీవలి కాలంలో తనకు కలిగిన అభిప్రాయాలు, సంకల్పాలు ఒకటొకటిగా రాగమంజరికి తెలియజేశాడు. త్వరలోనే తన సాధన సమాప్తం కాగలదనికూడా అన్నాడు.

మొట్టమొదట అతని ప్రసంగం ధోరణి విని ఆమె ఎంతైనా ఆశ్చర్యపడింది. కాని ఆ ఆశ్చర్యం పైకి కనబడనీయలేదు. పక్కనే గుబురుగా పెరిగిన చిన్న చేమంతి చిగురాకు కోసి పరధ్యానంగా మునిపంటితో కొరికి కొంటెగా ఒక్క చిన్న చిరునవ్వు విసిరింది:

"ఏమోలెండి! మీ ధోరణి కొక దారీ, తెన్నూ లేదని అనుకున్నాను ...దాని కేమిగాని నేను రేపుదయమే నందీశ్వర క్షేత్రానికి వెళ్ళిపోతున్నాను."

"ఎందుకు?"

"నందీశ్వర స్వామి నొక్కమారు సందర్శించి వత్తామని."

ఆ మాట విని అరుణి నిర్ఘాంత పోయాడు. నందీశ్వరక్షేత్రం చంపానగరానికి కొంచెం సమీపంలో ఉన్న పుణ్యస్థలం. అక్కడికి వెళ్ళి రావడాని కొక పక్షం రోజులైనా పట్టవచ్చును. అతనికి కొంత సేపటివరకు ఏమీ పాలుపోలేదు.

"ఒక్కత్తెవు ఒంటరిగా వెళ్ళి రాగలవా?"

"అమ్మో! నే నొక్కత్తినీ ఒంటరిగా ఈ కీకారణ్యంలో ప్రయాణం చెయ్యగలనా? మీరు కూడా నాతో రావాలి."

అరుణి దానికి వెంటనే ప్రత్యుత్తరం ఈయలేదు. అంతలో రాగమంజరి మళ్ళీ అందుకుంది:

"ఈ మధ్యన మీ శిష్యులు నన్ను చూచి ఏమేమో గుసగుస లాడు

కుంటున్నారు. మీ కేమి! మీ రన్నింటికి అతీతులు. కాని నామట్టుకున్నా కేమీ పాలుపోకుండా ఉంది. ఒక పక్షం రోజుల పాటూ యాత్ర చేసి వద్దామని ఉంది. మీరుకూడా రండి!"

అని గట్టిగా బలవంత పెట్టింది. ఆరుణి ఆ మరునాటి ఉదయమే ఆశ్రమం శిష్యుల కప్పజెప్పి, రాగమంజరితో కలిసి నందీశ్వర క్షేత్రానికి బయలుదేరాడు. అరణ్యం దాటగానే వారిద్దరు తీర్థ యాత్రాపరుల ధోరణి లోనే వ్యవహరించారు. నాలుగయిదు రోజులలో నందీశ్వర క్షేత్రం చేరుకొన్నారు.

## 12

నందీశ్వర క్షేత్రంలో అయిదారు రోజులు గడచి పోయేసరికి ఆరుణి, రాగమంజరి బాగా మారిపోయారు.

ఆరుణి అరణ్యంలో తా నవలంబించే నియమాలన్నీ చాలావరకు సడలించివేశాడు.

ఇక రాగమంజరి మాట వేరే చెప్పనే అక్కరలేదు. ఆమె నార చీరలు మొదలైనవన్నీ విసర్జించివేసి ఇంచుమించుగా గణికలాగే వేషధారణ చెయ్యడం మొదలుపెట్టింది.

నందీశ్వర క్షేత్రం చంపానగరాని కనతి దూరంలో ఉన్న ఒక చిన్న నగరానికి మధ్యనున్న పుణ్యస్థలం. అసలే అది ఒక చిన్న నగరం. ఆపైన తీర్థయాత్రాపరు లక్కడికి తండోపతండాలుగా వస్తూంటారు. ఆ జన సమ్మర్దంలో రాగమంజరిని గురించి, ఆరుణిని గురించి ఆలోచించేవా రెవరు?

అత డా నగరంలో ప్రవేశించిన పది పదిహేను రోజులలో ఇంకా బాగా మారిపోయాడు. రాగమంజరితో సంపర్కం కలిగినా అంతకు పూర్వం అదంతా తాంత్రిక సాధనే అని అతడు భావించేవాడు. రాగ మంజరికికూడా మొదట అలాంటి నమ్మకమే కలిగించాడు. ఆ రోజులలో రాగమంజరి ఒక చిరునవ్వు నవ్వుకొని, అదంతా కొంతవరకు నిజమేమో అనుకుంది.

నందీశ్వర క్షేత్రానికి వచ్చిన తరవాత ఆరుణి మరి తన సాధన మాటే తలపెట్టలేదు. రాగమంజరి అంతకన్నా బాగా తెలుగుమీరి పోయింది. వారిద్దరు ఆ క్షేత్రంలో ఒక ధర్మశాలలో విడిది చేశారు. రాగమంజరి తనదగ్గర రహస్యంగా దాచుకొన్న నగ లొక్కటొక్కటే విక్రయిస్తూ ఏలోటూ రాకుండా అతనితోబాటు సుఖంగా కాలక్షేపం చెయ్యడం మొదలుపెట్టింది.

క్రమంగా అలాగ ఒక నెలరోజులు గడిచిపోయాయి. ఆరుణి కా విచిత్ర నాగరికజీవితం ఎంతో మనోహరంగా కనిపించింది. ఒకనాటి సాయంత్రం రాగమంజరి చక్కగా అలంకరించుకుని అతని ఎదుట నిలబడింది. కొంటెగా ఆరుణివైపు చూచింది:

"మా అమ్మ నాకోసమని ఎంతగా కుమిలి కృశించిపోతూందో! నా కొక్కసారి ఆమెను చూచిరావాలని ఉంది. వెళ్ళిరానా?"

ఆరుణి గుండెలో రాయి పడింది. ఆమె అలాగ హఠాత్తుగా వెళ్ళిపోతానని అనడమే అతని కెంతో దుర్భరమైపోయింది.

"మరి నా మాట?"

"మీరుకూడా నాతో వత్తురుగాని!"

"నే నక్కడికి వెడితే మరి నలుగురిలోను తలెత్తుకు తిరగాలా?"

"ఆఁ! నాలుగు రోజులుంటే అదే అలవాటైపోతుంది."

"నే నక్కడికి రాను!"

"రాకపోయినా నేను వెళ్ళితీరాలి!"

"పోనీ ఆమెనే ఇక్కడికి పిలిపిస్తే—"

రాగమంజరి కతని ఉపాయం కొంతవరకు నచ్చింది.

"అవునవును. ఈ ఉపాయం బాగానే ఉంది."

అని రాగమంజరి వెంటనే ఒక పరిచారికను పిలిచి రహస్యంగా ఆమె కేదో చెప్పి చంపానగరానికి పంపించింది. ఆమె ధోరణి చూస్తే ఆరుణి మనస్సులో ప్రప్రథమంగా కొంచెం అనుమానం బయలుదేరింది.

"రాగమంజరీ! న న్నివిధంగా ఇక్కడ ఒంటరిగా విడిచివేసి చంపానగరానికే వెళ్ళిపోవాలని నీ కెలా తోచింది?"

రాగమంజరి పక్కుమని నవ్వి కొంచెం చిలిపిగా అతని కేసి చూసింది.

"స్వామీ! సమస్తము పరిత్యజించి కలకాలం అరణ్యవాసం చేసిన వారు ఒక్క పది రోజులపాటే నన్ను విడిచి ఉండలేకపోతే ఎలాగ?"

ఆ అధిక్షేపం అతని గుండెలో బాకులా పొడుచుకుంది. కాని కొంత సేపటి కాతడా ఆఘాతంలోనించి తేరుకొన్నాడు.

ఆ క్షణం మొదలుకొని అతనికి రాగమంజరి తల్లి ఏ క్షణంలో అక్కడ విరుచుకు పడుతుందో అని భయం వేసింది. అరుణి చూచాయగా ఆ మాట రాగమంజరితో అన్నాడు. అటువంటి భయమేమీ లేదని ఆమె అతనికి గట్టిగా ధైర్యం చెప్పింది. కాని అరుణికి అనుమానం తీరలేదు:

"నిన్న మీ అమ్మ నిక్కడికి రావలసిందని కబురు పంపించావేం?"

"మా అమ్మను కాదు. నా చెలికత్తె కామమంజరినే ఇక్కడికి పంపించ మన్నాను."

"ఆమె నెందు కిక్కడికి పిలిపిస్తున్నావు?"

"ఈ పెద్దతనంలో మా అమ్మ కదిలి రాలేదేమో నని భయపడ్డాను. పోనీ కామమంజరినైనా ఒక్కసారి ఇక్కడికి పంపించమని కబురు పంపించాను."

ఆ సమాధానం అరుణి కేమాత్రమూ అనుమానం తొలగించలేదు. అతడలాగే జిజ్ఞాసాదృష్టితో రాగమంజరి కేసి చూచాడు. అది కనిపెట్టి ఆమె అతన్ని గాఢంగా కౌగలించుకుంది:

"స్వామీ! కామమంజరి, నేను చిన్నప్పటి నించి ఒక్క కంచంలో తిని ఒక్క మంచం మీద పడుకున్నాము. మా అమ్మ తరవాత ఆమె తప్ప నా కింకెవరూ లేరు. అందుచేత ఆమె నొక్కమారు చూడాలని కబురు పంపించాను. అంతే!"

ఆపైన రాగమంజరి అతని చెక్కిలిపై చిక్కని ముద్దు ముద్రించింది.

ఆ మరునాడే కామమంజరి అక్కడికి వచ్చింది. చీనిచీనాంబరాలతోనూ చిత్ర విచిత్రమైన అలంకారాలతోనూ పెళపెళలాడిపోతూ, కామమంజరి ఎంతో ఒయ్యారంగా అతనికి సాష్టాంగ నమస్కారం చేసింది. అరుణి అంటీ అంటనట్టుగా ఆమె నాశీర్వదించాడు.

కామమంజరి అక్కడికి చ్చిన ఉత్తరక్షణంనించి రాగమంజరి ధోరణి బాగా మారిపోయింది. పొద్దస్తమానమూ రాగమంజరి కామ మంజరితోనే కలిసి కాలక్షేపం చేసేది. ఎక్కడికి వెళ్ళి వాళ్ళిద్దరు కలిసే వెళ్ళేవారు.

ఆరుణికి నానాటికీ రాగమంజరిమీద మమకారం బాగా ఎక్కువై పోయింది.

అత డొక్క నిమిషమైనా ఆమెను విడిచిపెట్టి ఉండలేక పోయే వాడు. ఆ మాట ఒకనా డతడు రాగమంజరితో కూడా అన్నాడు. కాని ఆమె అతని అభిలాష అంతగా లక్ష్య పెట్టలేదు. వినీ విన ట్టూరుకుంది. ఒకనా డారుణి రాగమంజరి నెక్కడికీ వెళ్ళవద్దని గట్టిగా కట్టడి చేశాడు. ఆమె అతని మాట కెదురాడలేదు. కాని మరునాటి సాయంకాలమే ఒక చిన్న విశేషం జరిగింది.

ఆరుణి తన గదిలో ఒక్కడూ ఒంటరిగా కూర్చున్నాడు. అతడు రాగమంజరి ధోరణితో బాగా విసిగిపోయాడు. ఆ మరునాడే రాగ మంజరితో కలిసి ఇంకెక్కడికయినా దూర దూర ప్రాంతానికి వెళ్ళిపోవా లని అనుకున్నాడు.

అంతలో హఠాత్తుగా పక్క గదిలోనించి ఉవ్వెత్తుగా ఒక పెద్ద నవ్వు వినిపించింది. రాగమంజరి, కామమంజరి కలిసి ఏదో ఇష్టాగోష్ఠిలో పడ్డారు. రాగమంజరి ఏదో మాటలాడింది. ఆ మాటలలో ఆరుణికి తన పేరు కొంచెం విస్పష్టంగానే వినిపించింది. ఆపైన కామమంజరి విరగబడి నవ్వడం మొదలు పెట్టింది.

ఆ నవ్వుతో ఆరుణిఅనుమానం బాగా స్థిరపడిపోయింది. వా రిద్దరు కలిసి తన సంగతే ముచ్చటించుకున్నారని, కామమంజరి విరగబడి నవ్వడాని కదే కారణమనీ అతడు గ్రహించివేశాడు. ఆ అవమానంతో అతని ముఖం జేవురించింది.

ఆ మరునాడే రాగమంజరితో ఆ విషయం ప్రస్తావించాలని ఆరుణి నిశ్చయించుకొన్నాడు.

# 13

ఆ మరునాటికి ఆరుణిలో బయలుదేరిన జిజ్ఞాస రాగమంజరి పనిగట్టి వేసింది. అప్పటినించి అతన్ని మరింత బిగువుగా తన కౌగిలిలో బంధించి వేసుకుంది. ఆ మైకంలో మరి నాలుగైదు రోజులవరకు ఆరుణి తన ప్రశ్న మాట అంత గట్టిగా పట్టించుకోలేదు. అయినా అతని హృదయంలో అది అప్పుడప్పుడు మెదులుతూనే ఉంది.

ఒకనాటి అపరాహ్ణవేళ రాగమంజరి, కామమంజరి అతి రహస్యంగా గుసగుసలాడుకోవడం ప్రారంభించారు. ఆ గుసగుసలలో ఆరుణికి తన పేరు కొంచెం అస్పష్టంగా వినిపించింది.

మళ్ళీ అతనిలో మథన ప్రారంభమైంది. అంతలో కొంచెం దూరంలో రాగమంజరితల్లి ప్రత్యక్షమైంది. ఆమె అక్కడికి వచ్చిన ట్టతని కంతవరకు తెలియనే తెలియలేదు! మాటవరసకైనా రాగమంజరి ఆ సంగతి అతనితో చెప్పలేదు. అంతలో అతనికి కామమంజరి ఒక్కమారుగా ఉవ్వెత్తుగా నవ్విన నవ్వడి వినిపించింది. దానికి కారణమేమో అతనికి తెలియలేదు. ఇక ఆనాటి సాయంకాలంలోగా ఆ విషయం అంతా నిష్కర్షగా తేల్చుకునితీరాలని అత డొక నిశ్చయానికి వచ్చేశాడు.

కాని సూర్యాస్తమయం అయిన దాకా అతనికి రాగమంజరితో ఆ విషయం ప్రసంగించడాని కవకాశమే దొరకలేదు. దీపదీపాల వేళ ఆరుణి కా అవకాశం దొరికింది. కామమంజరి అప్పుడే రాగమంజరి గదిలో నించి వెళ్ళిపోయింది. ఆమె ఏదో పరధ్యానంగా ఆలోచిస్తూ కూర్చుంది. ఆరుణి లోపలికి వెళ్ళగానే ఆమెముఖం ఒక్కమారుగా వికసించింది. ఆమె తటాలున లేచి అతని సరసన చేరింది.

ఆరుణి ఆమెఎదట కొంచెం వ్యంగ్యంగా తన అనుమానాలన్నీ వెళ్ళబోసుకున్నాడు. రాగమంజరి మొట్టమొదట అతని మాటలకు వినీ విననట్టుగా, అంటీ అంటనట్టుగా సమాధానాలు చెప్పింది. ఆరుణి అంతటితో విడిచి పెట్టలేదు. ఈ మారు స్పష్టంగా గద్దించి అడిగాడు:

"మీ అమ్మ ఇక్కడికి వచ్చిన విషయం ఇన్నాళ్ళనించి నాతో

ఎందుకు చెప్పలేదు? ఆమె నా ఎదటపడకుండా అలాగలాగ తప్పించుకు తిరగడానికి కారణ మేమిటి?"

రాగమంజరి ఆ ప్రశ్నకు తగిన సమాధానం చెప్పలేకపోయింది. కొంచెంసేపు నిశ్చలంగా అతనివైపు చూచి గట్టిగా కౌగలించుకుంది.

"నేను మీ యెడల ఒక పెద్ద అపచారమే చేశాను. నన్ను మన సారా మన్నిస్తానంటే అడంతా మీతో మనవి చేసుకుంటాను."

ఆమె మరి అతని ముఖం కేసి చూడలేక కనురెప్పలు వాల్చివేసింది.

"ఏమా అపచారం?"

మళ్ళీ అంతకన్నా గట్టిగా గద్దించి అడిగా డారుణి. రాగమంజరి అతని పాదాలపై వాలిపోయి అతని కాలివేళ్ళు ముద్దుపెట్టుకుంది.

"నన్ను మన్నిస్తానని అభయ ప్రదానం చేస్తే మనవి చేసుకుంటాను."

అని సానునయంగా, నిశ్చలంగా అతనివైపు చూచింది.

"ఈ ఆషాఢభూతి వినయాల కేమిగాని అసలు జరిగిన కథ ఏమిటో త్వరగా చెప్పు! అసలీ కామమంజరి ఎవరు? ఇక్కడి కెందుకు వచ్చినట్లు? మీ అమ్మ తిన్నగా నా ఎదుట పడకుండా మొహం తప్పించి తిరగడానికి కారణ మేమిటి? కామమంజరికి, నీకు గల సంబంధమేమిటి?"

రాగమంజరి ఆ ప్రశ్నల పరంపరతో అలాగే దిగాలు పడిపోయింది. ఇక లాభంలేదని తన కథ మొదలు పెట్టింది:

"కామమంజరి చంపాధీశ్వరుల ఆస్థానంలో నర్తకి—"

ఆరుణి అలాగే ఆమె వైపెంతో ఆశ్చర్యంగా చూచాడు. రాగమంజరి ఒక గుటక మింగి మళ్ళీ అలాగే తన కథ చెప్పుకుపోయింది:

"ఒకనాడు మహారాజ సన్నిధిలో మా ఇద్దరికీ మధ్య నృత్యపరీక్ష జరిగింది. మే మిద్దరము ఆనాడు మేనకావిశ్వామిత్ర నృత్యం చేశాము. నే నానాడు సాక్షాత్తు మేనకలాగే నృత్యం చేశాను. నిజంగా కామమంజరి ఆనా డంత గొప్పగా నృత్యం చెయ్యనేలేదు. అయినా ఆమె యెడల తమ కుండుకున్న మమకారం కొద్దీ మహారాజు ఆమెనృత్యమే గొప్పగా ఉన్నదని ప్రశంసించారు. రాజే తలుచుకుంటే మరి దెబ్బలకేమి కొదవ?

ఆ పైన మిగిలిన విద్వాంసులందరు నా నృత్యమేమీ బాగాలేదని ఈసడించివేశారు. కామమంజరి నృత్యమే నా నృత్యం కన్నా బాగా మిన్నగా ఉన్నదని ఆకాశాని కెత్తివెయ్యడం ప్రారంభించారు. నా కా సమయంలో ఒళ్ళు మండిపోయింది. కాని నే నొక్కర్తెను! అబలను! ఎంత గొప్పగా మేనకా విశ్వామిత్ర నృత్యాభినయం పట్టితే మాత్రం ప్రయోజన మేమిటి?"

అని రాగమంజరి ఉసూరుమని ఒక్క నిట్టూర్పు విడిచి పెట్టింది. ఆరుణి కామె ఆ కథ ఎందుకుపక్రమించిందో బోధపడలేదు:

"అయితే ప్రస్తుతం కామమంజరి ఇక్కడికి రావడానికి, దీనికి సంబంధ మేమిటి?"

అని అన్నా డెంతో విసుగ్గా.

రాగమంజరి క్షణం సేపాగి మళ్ళా మొదలు పెట్టింది:

"స్వామీ! అదే విన్నవించుకుంటున్నాను. కొంచెం సావధానంగా చిత్తగించండి. తరవాత ఇష్టాగోష్ఠిలో మహారాజు ప్రసంగం క్రమక్రమంగా విశ్వామిత్ర మహర్షి తపోనిష్ఠమీదికి తిరిగింది. తరవాత మేమంతా జితేంద్రియులైన మహాత్ముల మహిమలను గురించి ప్రసంగించుకొన్నాము. కొంతసేపటి కా ప్రసంగంలో మీ మాట వచ్చింది. మహారాజు మీరు సాక్షాత్తు మహర్షి కల్పులనీ, పరమబ్రహ్మణ్యులనీ ప్రశంసించారు.

"కామమంజరికి మిమ్మల్నిగురించి ఏమీ తెలియనే తెలియదు. అయినా ఆమె ఇచ్చకాలు చెప్పడం మొదలుపెట్టింది. మహారా జన్న మాటకు సరీగా అదేధోరణిలో పక్కతాళం వెయ్యడం ప్రారంభించింది.

"నా కా కామమంజరి ఇచ్చకాల ధోరణి గమనించగానే హఠాత్తుగా అరికాలిమంట నెత్తికెక్కింది. ఇక తమాయించుకోలేక పోయాను:

" 'మహారాజా! ఎందు కీ ప్రగల్భాలు? పురుషులంతా ఎంతటి బ్రహ్మణ్యులయినా కొంతామణులకు దాసానుదాసులే!'

"అని నా ఉక్రోషం పట్టలేక, ఉన్నది కాస్తా దురుసుగా దులిపేశాను."

అని రాగమంజరి తన కథ అంతటితో ఆపివేసి, కొంచెం సిగ్గుతో

ఆరుణివైపు చూచింది. ఆరుణి ఆమాట విని నిలువునా నిర్ఘాంతపోయాడు. అంతలోనే రాగమంజరి తిరిగి తన కథ ప్రారంభించింది:

"స్వామీ! నే నాసమయంలో మహారాజు మీద, కామమంజరి మీద బయలుదేరిన అక్కసుకొద్దీ ఆమాట అనేశాను. అంతేగాని అది మీమీద అగౌరవంకొద్ది అన్న మాట కానేకాదు. నే ననుకున్నట్లే ఆమాట మహారాజుకు, రాగమంజరికీ బాగా పొడుచుకుంది.

"ఆపైన కామమంజరి నామాటకు హఠాత్తుగా అడ్డుతగిలి ఆరుణి ముని పరమబ్రహ్మణ్యులనీ, మహాత్ములనీ అన్నది. వెంటనే మహారాజా మెకు పక్కతాళం వేశారు. దానితో నా ఉద్రేకం బాగా రెచ్చిపోయింది. 'ఆఁ, దానికేమిలెండి! ఎంతటి మునీశ్వరులనైనా మూడు నిమిషాలలో నాకు దాసానుదాసులుగా చేసివేస్తాను! కావలిస్తే పందెం వెయ్యండి!' అన్నాను. దానిమీద కామమంజరి మరింతగా రెచ్చిపోయింది.

" 'ఆరుణిముని అలాంటివారు కానేకారు. ఒకవేళ నీవేకనక ఆయన వ్రతభంగం చెయ్యగలిగితే నృత్య నాట్యాలలో ఇక నీవే యీ రాజ్యాని కంతటికీ గొప్పదానివని ఆక్షణంనించి అంగీకరించి నీవెనక నిలబడతాను. సరిగదా!' అని గట్టిగా కవ్వించింది. మహారాజామెను వెనక వేసుకువచ్చి 'చేతనైతే ఆ పందెం గెలుచుకో'మని నన్ను చూచి అతిహేళనగా నవ్వారు! వారిద్దరు ఏకమై నన్నావిధంగా కించపరచడంతో ఆవేళ అంతా నాకిక నిద్రపట్టలేదు. ఆ మరునాడే బయలుదేరి మీ ఆశ్రమానికి వచ్చి వేశాను."

రాగమంజరి ఆపైన మరి మాట్లాడలేక నెమ్మదిగా తలవంచుకుంది:

"స్వామీ! నేను మీయెడల వల్లమాలిన మహాపచారం చేశాను. నన్ను మన్నించండి."

అని ఆరుణిపాదాలు రెండూ పట్టుకుంది.

కథ చిట్టచివరిఘట్టంలోకి వచ్చేసరికి ఆరుణి మరి తన కళ్ళే నమ్మలేక పోయాడు. ఒక్కనిమిషంసేపు ఆలాగే శిలాప్రతిమలా నిర్ఘాంతపోయాడు:

"రాగమంజరీ! అయితే ఇన్నాళ్ళనుంచీ నీవు ఆడించి అంతా వట్టి కపటనాటకమేనా?"

రాగమంజరి తలఎత్తి క్షణకాలం ఆతని ముఖవైఖరి గమనించింది:

"స్వామీ! మీరన్నట్టు ఇన్నాళ్ళనించి నేను నిజంగా కపటనాటకమే ఆడాను. కాని ఈ క్షేత్రానికి వచ్చినప్పటినుంచీ నేను చేసినదానికెంతైనా పశ్చాత్తాపపడ్డాను. నేను చేసిన పాపానికి మరి ప్రాయశ్చిత్తం లేదని నాకు తెలియకపోలేదు. అయినా దయతలిచి నన్ను కొంచెం మన్నించండి."

ఆమె అతని పాదాలు రెండూ మరింత గట్టిగా అదిమిపట్టుకుంది. ఆమాటతో ఆరుణిశరీరం క్రోధావేశంతో గజగజ వణికిపోయింది. అతడొక్కమారుగా విరుచుకుపడ్డాడు:

"అయితే ఈ కామమంజరిని, మీ అమ్మని ఇక్కడికెందుకు పిలిపించావు? నీగొప్ప చెప్పుకుని నలుగురిలోను నన్నవమానపరచడానికేనా?"

ఉరుమువంటి ఆప్రశ్న విని రాగమంజరి అంతగా నిర్ఘాంతపడలేదు.

"వాళ్ళిద్దరు మిమ్మల్ని చంపానగరానికి తోడుకురమ్మన్నారుగాని నేనే దాని కంగీకరించలేదు. తిరిగి మీతోకలిసి ఆశ్రమానికే వెళ్ళిపోతానని, ఇప్పటినించీ నిజంగా నాకు ప్రపంచంపై విరక్తికలిగిందనీ అన్నాను. నామాట నమ్మండి! నన్ను మన్నించండి."

అని రాగమంజరి అతన్ని మరింత ఆప్యాయంగా బతిమాలుకోవడం మొదలుపెట్టింది. ఆపైన వెంటనే అతని పాదాలమీద వాలిపోయింది.

కాని అదంతా కేవలం నటనే అని గ్రహించడానికి ఆరుణి కొక్కక్షణంకూడా పట్టలేదు. ఉత్తరక్షణంలోనే లేచినిలబడి ఒక్కదూకులోనే అత డామెపట్టు విడిపించుకుని వీధిలోకి వెళ్ళిపోయాడు. ఆగదిలోనే కుప్పగా కూలబడిపోయిన రాగమంజరికి "ఛీ పాపాత్మురాలా! ఎంత ద్రోహాని కొడిగట్టావు! ఇప్పటికీ ఇంకా నటనేనా? చాల్చాలు లే! పో!" అన్న మాటలు విస్పష్టంగా వినిపించాయి.

# 14

ఆరుణి ఒళ్ళు తెలియకుండా అలాగే ఆ మసక మసక చీకటిలో పడి తొందర తొందరగా నడిచివెళ్ళి పోయాడు. అంతేగాని ఒక్కమా

రైనా వెనక్కి తిరిగి చూడలేదు. అత డెక్కడ నడిచివెళ్ళిపోతున్నాడో అతనికే తెలియదు!

ఆరుణి ఇంక ఆ క్షేత్రంలో ఒక్కక్షణం కూడా ఉండడానికి మనస్కరించలేదు. ఒక్క దూకులో సంధీశ్వర క్షేత్రం పొలిమేర దాకా నడిచి వెళ్ళిపోయాడు. అప్పటికి బాగా చీకటి పడింది. అతనికి మార్గం కూడా తిన్నగా కనిపించలేదు. పైగా గమ్యస్థాన మేదో అతనికే తెలియదు! అలాగలాగ నడిచి పోగా పోగా ఆ క్షేత్రానికి పొలిమేరలో అతని కొక జీర్ణదేవాలయం కనిపించింది.

ఒళ్లెరగని నడకతో ఆరుణి బాగా అలిసిపోయాడు. ఆ దేవాలయం చూడగానే అతనికి ఆరాత్రి కక్కడ విశ్రమించాలని అనిపించింది. అత డలాగే ఆ జీర్ణదేవాలయ మంటపంలో చదికిలపడ్డాడు. కొంత సేపటికి నెమ్మదిగా అక్కడ మేనువాల్చాడు.

అప్పటి కతనికి కొంచెం స్పృహవచ్చినట్లయింది. అలాగే పడుకుని గతచరిత్ర అంతా తలుచుకోవడం మొదలుపెట్టాడు. అదంతా అతని కొక పీడకలలా కనిపించింది. అలాగ తలుచుకుంటున్నంతసేపూ అతని నోటినుండి అప్రయత్నంగా "ఎంతటి ద్రోహాని కొడిగట్టింది!" అన్న వాక్యం నాలుగైదు మారులు వెలువడింది.

కొంతసేపు గడిచిపోయేసరి కిన్నాళ్ళనించీ జరిగినదంతా అతనికి కొంచెం స్పష్టంగా తెలిసింది. ఆశ్రమానికి వచ్చినప్పుడు వేశ్యమాత ఆడినది అంతా కేవలం నాటకమే అని అతని కొక్కక్షణంలో అవగతమై పోయింది. గంగానదిలో మునిగిపోతున్నట్లు రాగమంజరి కేకలుపెట్టడం కూడా కేవలం నటనే అని అత డొక్కక్షణంలో గ్రహించి వేశాడు.

సరీగా అదే సమయంలో అతని కెదురుగా ఒక మూల కొంచెం శిథిలమైపోయిన గ్రామదేవతా విగ్రహం కనిపించింది. అది చూడగానే అతనికి ఆశ్రమంలో చండీ దేవతామూర్తి జ్ఞాపకం వచ్చింది.

"అవిచ్ఛిన్నంగా రెండు పుష్కరాలపాటూ దేవతపాదాలాశ్రయించాను. నా తపఃఫలితం అంతా చిట్టచివరి కీ విధంగా బుగ్గి అయిపోయింది."

అని సణుగుకోవడం మొదలు పెట్టాడు. అతని కా దేవతా విగ్రహం చూస్తూంటే హృదయంలో పట్టరాని అసహ్యభావం బయలు దేరింది. ఆరుణి ఇక ఆ దేవతముఖం చూడలేక పెడమొహం పెట్టుకుని కూర్చున్నాడు.

క్రమక్రమంగా అతని హృదయంలో ప్రస్తుతం తన గమ్యస్థానాన్ని గురించిన జిజ్ఞాస బయలుదేరింది. మొట్ట మొదటగా తిరిగి తిన్నగా తన ఆశ్రమానికే వెళ్ళిపోవాలని అనుకొన్నాడు. శిష్యుల కింకా తనమీద అంతటి అనుమానం కలగలేదని అత డంతకు పూర్వమే గ్రహించు కొన్నాడు. ఆశ్రమానికి చేరుకొంటే తిరిగి నిశ్చలహృదయంతో జపతపాదు లుపక్రమింపవచ్చునని అతనికి ఆశ.

కాని తిరిగి తన ఆశ్రమానికి వెళ్ళడం అంటే అతనికి రుచించ లేదు. ఇక మిగిలినది మరీచిమహర్షి ఆశ్రమం. ఆమాట తలుచుకొంటేనే అతని కెందుకో పెద్ద సంకోచం బయలుదేరింది. తా నీ విధంగా భ్రష్టుడైపోయి మరీచిమహర్షి ఆశ్రమం చేరుకొంటే ఆయన ఆప్యాయంగా ఆదరించగల డనే ఆశ ఏమి ఉంది?

ఆ మహర్షి తన కథ విని మరి ఆశ్రమం దరిమానానికి కూడా రావద్దని దూరదూరంగా తరిమి వెయ్యవచ్చును! మరి గత్యంతరం? చల్లచల్లగా తన ఆశ్రమానికి వెళ్ళిపోవడమే అతని కిక శరణ్యంగా కనిపించింది. కాని ఆ విధంగా తన ఆశ్రమానికి చేరుకోవడం అతని కంతగా రుచించలేదు.

అతని గుంజాటన ఎంతసేపటికీ నిష్కర్షగా ఎటూ తేలలేదు.

దానితో అతనికి ఆ రాత్రంతా తిన్నగా నిద్ర పట్టలేదు. తెల్లవారు జామున కొంచెం చిన్న కునుకు పట్టింది. నిద్రలేవగానే, ఆరుణికి, ఆచార్యుని సన్నిధికి వెళ్ళిపోయి తన పాపపంకిలగాథ అంతా ఆ మహర్షి కి ఆమూలా గ్రంగా నివేదించి, ఆయనపాదా లాశ్రయించడమే శరణ్యమని అని పించింది. ఆ తరువాత ఆ జీర్ణ దేవాలయంలో అత డొక్క క్షణమైనా నిలవలేదు. వెంటనే బయలుదేరాడు. మార్గంలో అన్నపానాదుల విషయం కూడా అత డంతగా ఆలోచించలేదు. ఎక్కడైనా లభ్యమైతే కాయో కసరో తిని ఆనాటి కలాగే కాలక్షేపం చేసేవాడు.

ఆరుణి అలా ఏకబిగిని పది పదిహేను రోజుల పాటు ప్రయాణం సాగించి ఒకనాటి ఉదయానికి మరీచిమహర్షి ఆశ్రమం చేరుకొన్నాడు.

కాని మహర్షి కి ఎదుటపడడాని కతని కెంతో సంకోచం కలిగింది. అయినా ధైర్యం వహించి అతని సన్నిధికి వెళ్ళి సాష్టాంగ నమస్కారం చేశాడు. ఆరుణి కన్నీటితో ఆచార్యుని పాదాలు తడిసిపోయాయి. మరీచి ఎంతో ఆప్యాయంగా పిలిచి "లే, నాయనా!" అని ఆజ్ఞాపించేదాకా అత డాచార్యుని పాదాలు విడిచిపెట్టలేదు. వాత్సల్యపూరితమైన అతని పిలుపు వినగానే ఆరుణికి కొంచెం ధైర్యం వచ్చింది. వెంటనే నెమ్మదిగా లేచి కూర్చున్నాడు.

# 15

మరీచి ఆరుణి నెంతో వాత్సల్యంతో ఆదరించి అతని యోగ క్షేమా లడిగి తెలుసుకొన్నాడు. మహర్షి ఆదరం చవిచూచిన ఆరుణి కప్పటికి బాగా ధైర్యం కలిగింది. తల వంచుకుని తన విషాదగాథ అంతా ఆమూలా గ్రంగా మరీచిమహర్షి కి విన్నవించుకొన్నాడు. ఆ కథ పూర్తికాగానే మహర్షి తనమీద విరుచుకుపడగల డేమో అని ఆరుణి కొంచెం భయపడ్డాడు. కాని మహర్షి ఆరుణిని చల్లనిచల్లని మాటలతోనే ఓదార్చాడు. అంతేగాని అతనిని పల్లెత్తుమాట అనలేదు. ఆ అపార వాత్సల్యం చవిచూచిన ఆరుణి కంఠం గద్గద భారంతో వణికిపోయింది. అతడు తన కిటీవల కలిగిన ఒక సంశయం మహర్షి కి విన్నవించుకున్నాడు:

"మహర్షీ! నేను రాగమంజరి మీద ఎంతైనా జాలి దలిచాను. ఆమె నుద్ధరించవలె ననే అనుకున్నాను. చివరి కా పాపాత్ములు న న్నీ విధంగా వంచించడానికి కారణ మేమిటి? నే నేమి పాపం చేసు కొన్నాను?"

మహర్షి పెదవిపై చిరునవ్వు చిగిరించింది. వెంటనే కొంచెం మృదువుగా మందలించాడు:

"ఆరుణీ! నీ వామె నెందుకు నిందిస్తావు! దీనిలో నా కామె చేసిన తప్పిద మేమీ గోచరించడం లేదు!"

ఆరుణి తెల్లబోయి మహర్షి వై పలాగే చూస్తూ కూర్చున్నాడు. మరీచిమహర్షి అంతలోనే అందుకొన్నాడు:

"నీ హృదయసంకల్పం పైపైకి నిష్కల్మషంగా ఉంటే ఉండ వచ్చును. కాని అంతరాంతరాలలో నీలోని కామలాలస పూర్తిగా నశించ లేదు. ఆ కారణం వల్లనే మొట్టమొదటగా నీ కామె యెడల ఆ విధంగా జాలికలిగింది. అదే చిట్టచివరకి నీ భ్రష్టత్వానికి దారి తీసింది. అనవసరంగా ఆమెను నిందించడం వల్ల ప్రయోజన మేమిటి?"

అయినా ఆరుణి కా విషయం పూర్తిగా బోధపడలేదు. కొంచెం సేపాలోచించి మెల్లిగా నసిగాడు:

"నా కింకా సందేహ నివృత్తి కాలేదు. దయఉంచి నా అజ్ఞత మన్నించండి...అయితే మొదటినించీ ఈ పన్నాగం అంతా పన్ని న న్నీవిధంగా మోసగించినది ఆమే కదా?"

"కావచ్చును! కాని నీ హృదయం నిష్కల్మషంగా ఉన్నప్పుడు ఆమె ఎంత పాపబుద్ధితో వస్తే మాత్రం నిన్నేమి చెయ్యగలదు?"

అని మరీచిమహర్షి తిరిగి ఒక్క నవ్వు నవ్వాడు:

"ఆరుణీ! అజ్ఞులు తమ లోకప్రవృత్తికి కేవలం బాహ్యసంఘటనలే ప్రధాన కారణాలని భ్రమిస్తారు. అంతేగాని తమ లోలోపలి సంస్కా రాల సంకల్పాల వల్లనే బాహ్యసంఘటన లుద్భవిస్తాయని గ్రహించుకో లేరు!"

"వెర్రివాడా! నీ హృదయం నిష్కల్మషమైతే ప్రపంచంలోని వారంతా సజ్జనులుగానే కనిపిస్తారు. లేకపోతే వా రంతా దుష్టులుగానే భాసిస్తారు. ఈ రహస్యం తెలిస్తే ఒకర్ని నిందించవలసిన అవసరమే లేదు. కనుకనే నిన్ను ముందుగా నీ ఆత్మసముద్ధరణ విషయం ఆలోచించుకోవల సిందని అన్నాను—జ్ఞాపకం ఉన్నదా?"

ఆరుణి మరీచిసూక్తులు జాగ్రత్తగా విని ఒక నిట్టూర్పు విడిచి పెట్టాడు:

"అయితే జీవుల కిక పతితులు, దుఃఖితులు అయినవారి నుద్ధరించే అధికారమే లేదన్నమాట!"

మరీచిముఖం మళ్ళీ కొంచెం జేవురించింది.

"త్రికరణశుద్ధి లేనివారి కా అధికారం లేనిమాట నిజమే! అదికాక ని న్నింకా ఒక్క భ్రమ పట్టుకుని పీడిస్తూంది. నీ వెన్నడూ ఇంకొకరి నుద్ధ

రించలేవు! అది చెయ్యగలిగిన దా జగన్మాత మాత్రమే! ప్రపంచం అంతా ఆ జగన్మాత స్వరూపమే! కనక నీ వొకరికి చేయగలిగిన ఉపకృతి ఏదైనా ఉంటే అది నీ ఆత్మోద్ధరణకు మాత్రమే ఉపకరించగలదు. కనక నీ వొకరికి ఉపకృతి చేస్తున్నావని భావించడం కేవలం అహంకారమే! ఆ అహంకారనాశనం జరిగేవరకు నీ కొకరిని ఉద్ధరించే అధికారమే లేదు. ఇది ముమ్మాటికీ నిజం. ఈ ఆర్యసూక్తి జాగ్రత్తగా మననం చేసుకో!"

ఆరుణి కా ఉపదేశంతో కొంచెం ఊరట కలిగింది. అయినా అతనికి రాగమంజరి యెడల ద్వేష భావం ఇంకా బాగా సడలలేదు. ఒక్క నిట్టూర్పు విడిచి పెట్టాడు:

"ఏమి ఏమైనా ఆ పాపాత్మురాలు నా కొక అశనిపాతంలా దాపురించింది."

అని తల వంచుకొన్నాడు. మరీచి మళ్ళీ అతన్ని మందలించాడు:

"నాయనా! ఈ అఘాతంవల్ల నీలోని పాపచింత అంతా క్షాళితమై పోయింది. ఇక ముందిది నీ సాధన కెంతైనా ఉపకరించగలదు. కనుక ఆమె నీ కీ విధంగా ఉపకరించినదనే అనుకో! ఇక ఇప్పటినించీ ఆమె నెన్నడూ నిందించకు. ఆమె జగన్మాతస్వరూపిణి అని భావించుకో! ఆమె ఆ విధంగా నీ హృదయకల్మషం పోగొట్టి నిన్నుద్ధరించినదనుకో! అదే నీకు శ్రేయస్కరం!"

ఆరుణి నెమ్మదిగా అక్కడినించి లేచి వెళ్ళి నాలుగైదు రోజుల పాటు మహర్షి చేసిన సదుపదేశం అంతా జాగ్రత్తగా మననం చేసుకొన్నాడు.

క్రమంగా ఆ ప్రశాంతాశ్రమంలో అతని హృదయం పద్మముకుళంలా స్వచ్ఛమై వికసించింది.

"నిజానికి నాలో అంతకుపూర్వం అంతర్నిహితంగా ఉండిపోయిన కామసంకల్పంవల్ల నేనే పతితుడ నైపోయాను. ఆ తరుణంలో రాగమంజరే నన్నుద్ధరించింది."

అని ఆలోచిస్తూ ఒక్క చిరునవ్వు నవ్వుకున్నా డారుణి. ఆ భావనతో అతని అహంకారం అంతా పటాపంచలై పోయింది. అదే క్షణంలో అతని హృదయంలో ఒక వినూతన దివ్య విజ్ఞానజ్యోతి మెరిసింది.

# ఆచార్య విభ్రాంతి

**రాజనర్తకి కింశుకప్రభ** వలయాకార మయూర నృత్యం తిలకిం చిన సభాస్తారుల హృదయాలన్నీ ఒక్క క్షణంలో క్రొంకారు మెరుపులై పరుగులు పెట్టాయి!

అర్ధరాత్రి. చైత్రపూర్ణిమ వెన్నెల వెల్లువలో అమరుకదేవభూపతి రాజప్రాసాదమే ఒక రాజహంసలా మెరిసింది. ఆ మహీపతి కింశుకప్రభ నృత్య చాతుర్య భంగిమలన్నీ నిశ్చల దృష్టితో పరిశీలించాడు. ఆ ఆనంద తన్మయతలో క్రమక్రమంగా అతనికి మైమరపే కలిగింది.

రాజప్రాసాదం పై అంతస్తు పై అమర్చిన నృత్యమండపంలో రాజ వల్లభులయిన సదస్యులందరి దృష్టి క్రమక్రమంగా కింశుకప్రభ లలితహస్త విన్యాసలీలలో లీనమైపోయింది.

ఆ జవ్వని కాలి అందెల సవ్వడీ, మంద్ర మంద్రమైన వీణావేణు మృదంగ ధ్వని, నర్తకి వెనక నిలిచిన నట్టువరాంద్ర తాళనిక్వాణాలు— అన్నీ ఒకే ఒక శ్రుతిలో మారుమ్రోగి సదస్యు లందరిని నృత్య తన్మయతలో ముంచెత్తాయి.

అంతలో కింశుకప్రభ నృత్యం పరిసమాప్త మయింది. ముమ్మారు మారుమోగిన మద్దెల ముక్తాయింపుల సండడితో సదస్యులందరు మళ్ళీ ఈ లోకంలో పడ్డారు. వెనువెంటనే సాధువాదాలతో సభాపరిసరాలన్నీ మారుమోగాయి. ఆనాటి నృత్యభంగిమ లనేక విధాలుగా ప్రశంసిస్తూ సభ్యులంతా తిరిగి తమ భవనాలకు వెళ్ళిపోయారు.

అమరుకదేవు డొక దీర్ఘ నిశ్వాసం విడిచి లేచి నిలుచున్నాడు. కింశుకప్రభ వెనువెంటనే అతని సన్నిధికి వెళ్ళి కయిదండ ఇచ్చి నిలబడింది.

అత డంటీ అంటనట్టుగా ఆమె బుజం మీద చెయ్యివేసి తన శయ్యాగారంవైపు నడక సాగించాడు.

ఇంకొక నిమిషంలో వా రిద్దరు శయ్యాగారంలో ప్రవేశించారు. అమరుకదేవు డేదో పరధ్యానంగా ఆలోచిస్తూ తన హంసతూలికా తల్పం

మీద మేను వాల్చాడు. కింశుకప్రభ అతని సరసనే ఆ శయ్యాపై ఒయ్యారంగా కూర్చుని అతనివైపు తదేకదృష్టితో చూచింది.

అమరుకదేవుడు నిద్రిస్తున్నాడా? మేలుకునే ఉన్నాడా? ఆమెకా సందేహమే తీరలేదు! అత డర్ధనిమీలిత నేత్రాలతో ఏదో పరధ్యానంగా ఆలోచిస్తూన్నట్టు కనిపించాడు. శయ్యాగారంలోని దీపకాంతి అతని అర్ధనిమీలిత నేత్రాంతాలపై ప్రసరించి తళతళ మెరిసింది.

ఒక దీర్ఘ నిశ్వాసం ఆమె పెదవులనుండి వెలువడింది. కింశుకప్రభ తన పార్శ్వంలో ఉన్న మద్యపాత్ర నెమ్మదిగా అమరుకదేవుని పెదవుల కందించింది. అతడు రెండు మూడు గుక్కలు చవిచూచి మళ్ళీ అలాగే శయ్యపై మేను వాల్చాడు. కొంచెంసే పామెవైపు చూచి నెమ్మదిగా ప్రశ్నించాడు:

"నీ వెవరవు?"

ఆత డామెవై పెంతో వింతగా చూచి అలాగే ఆశ్చర్యపోయాడు. కింశుకప్రభ చెక్కిళ్ళపై కన్నీటి బిందువు లొకటొకటిగా దిగజారాయి. కంఠస్వరం గద్గద భారంతో తొణికిసలాడింది.

"అంతటి గాఢానురాగమే ఈ నాటి కీ విధంగా మారిపోయిందే! ఇక నే నెవరినో మీకు తెలుపుడు చేస్తేమాత్రం ప్రయోజన మేమిటి?"

అమరుకదేవు డామె వై పలాగే రెప్పపాటు లేకుండా చూచాడు. ఆమె మళ్ళీ చెప్పింది: "నా పేరు కింశుకప్రభ! ఇప్పటికైనా జ్ఞాపకం వచ్చిందా? న న్నీ విధంగా విస్మరించడం తమకు ధర్మమేనా?"

"కింశుకప్రభా! ఎవరు? నీవా? ఇంతగా మారిపోయావేమి? నిన్ను తిన్నగా గుర్తించలేక పోయాను సుమా!"

అమరుకదేవ భూపతి నిద్రాభార సూచకంగా, లీలగా ఆవలించాడు. కింశుకప్రభ అది గ్రహించింది. దానితో ఆమెఆత్మాభిమానాని కొక పెద్ద దెబ్బ తగిలింది:

"నిరంతర నృత్యగాన వినోదాలతో తా మెంతో అలిసిన ట్టున్నారు. సెలవైతే తిరిగి మరి ఒకమారు తమ దర్శనం చేసుకుంటాను. పాదదాసి విషయం ఈ మాత్రమైనా జ్ఞప్తికి రావడం నిజంగా నా పూర్వ జన్మ పుణ్య విశేష ఫలితమే!"

కింశుకప్రభ తన కన్నీ రతనికి కనబడనీయకుండా ముఖం మరి ఒక పక్కకు తిప్పివేసి నెమ్మదిగా అక్కడినించి వెళ్ళిపోయింది.

ఆమె విషయం జ్ఞాపకం చేసుకోవాలని అమరుకదేవు డెన్నో విధాల ప్రయత్నించాడు. ఎంతసేపటికీ అతని కామె విషయమే స్మరణకు రాలేదు!

"రే పంతఃపుర పరిచారికల నెవరినైనా ప్రశ్నిస్తే ఈ విషయం ఇట్టే తేలిపోతుంది! దీనికోసం ఇంత మథన ఎందుకు?"

అని లోలోపలే సమాధాన పడ్డాడు. కాని అతని నా జిజ్ఞాస అలాగే పుండు సలిపినట్టు సలిపింది. కాని ఎంతసేప అతని కా విషయం అంతు దొరకలేదు.

కింశుకప్రభ ఆనాడు నృత్యం చేసిన నర్తకీమణులందరికన్నా రూపసి. నృత్యగాన విద్యలలో సాటిలేని నెరజాణ. నృత్యావసానంలో ఆతనికి కయిదండ ఇచ్చే మిషతో తనకు తానై కోరివచ్చి అతనిదగ్గిర తన గోడంతా వెళ్ళబోసుకున్నది. అయినా అతని కామె ఎవరో గుర్తుకు రాలేదు!

అమరుకదేవుడు మద్యపాత్రలో మిగిలిన మద్యం అంతా ఒక్క చుక్కైనా మిగలకుండా ఒక్క గుక్కలో తాగివేసి, మళ్ళీ జిజ్ఞాసలో పడ్డాడు. అతని కేమీ గుర్తు రాలేదు.

అతని దృష్టి పక్కనే తెరిచిఉన్న గవాక్షంగుండా విశాలా నగరం వైపు తిరిగింది. నగర రాజవీధులన్నీ పాలవెన్నెలవెల్లువలో తల మునకలైనాయి. ఆ అతిలోక సౌందర్యం నిశ్చల దృష్టితో చూచిన అతనికి మరి కొంత సేపటికి కొంచెం మగత నిద్ర పట్టింది. ఇంకా కొంత సేపటికి గాఢ నిద్రాభారంలో మైమరచిన అతని నేత్రా లప్రయత్నంగా మూసుకొన్నాయి. సన్నని అగరుధూమమాలిక లా శయ్యాగారం అంతా వ్యాపించి అల్లిబిల్లిగా అల్లుకొన్నాయి. అమరుకదేవుని నిద్రాముద్రిత హృదయంలో చిత్రవిచిత్రమైన కలల నెమళ్ళెన్నో రంగురంగుల పురులు విప్పి మైమరిచి నృత్యం చేశాయి.

కావడాని కది అమరుకదేవుని రహస్య మంత్రాగారమే. అయినా అత డా మంత్రాగారంలో వీణావాద్యంతో వినోదిస్తున్నాడు. ఆ సమ

యంలో మంత్రు లెవరూ అతని సన్నిధికి రావడానికి సాహసించరు. అయితే మహామాత్యుడు రాజ్యవర్ధనుని కలని సన్నిధికివచ్చి అత్యవసర రాజ్యకార్యమేదో నివేదించవలసిన అగత్యం ఏర్పడింది.

రాజ్యవర్ధను డడుగుల సవ్వడి కాకుండా నెమ్మదిగా లోపలికివచ్చి అమరుకదేవుని సమీపంలో ఒక రత్నకంబళంమీద కూర్చున్నాడు. అగరు ధూప ధూమమాలిక క్షణకాలం అమరుకదేవుని వీణ కలంకారమై నిలిచి నెమ్మదినెమ్మదిగా పైకెగసింది. మహామాత్యుడు కొంచెంసేపు వీణా గానం విని ఆనందిస్తున్నట్టు తల పంకించి, వేళ్ళు తాటించి పక్కతాళం వేశాడు. కాని అతని హృదయం ఆ వీణాగానంమీద లేదని మహారాజా గ్రహించుకొన్నాడు. వెనువెంటనే ఆ వాద్యం విరమించి, కొంచెం విసుగుదలతో బొమముడి విరిచాడు. మహామాత్యు డేదేవో రాజ్యకార్య వ్యవహారా లేకరువు పెట్టాడుగాని మహారాజది తిన్నగా వినిపించుకో లేదు. పైగా వేరే ఇంకొక వ్యవహారం గుచ్చిగుచ్చి అడిగాడు:

"ఇంతకీ విదర్భ వ్యవహార మేమైనది? ఆమాట చెప్పరేమి?"

"విదర్భాధీశ్వరులు తమ కన్యకను మీకీయడాని కంగీకరించ లేదు. అయితే స్వయంవరమహోత్సవం నిశ్చయించి మిమ్మల్ని ఆ మహోత్సవాని కాహ్వానించారు. అంతే!"

అమరుకదేవు డంతకన్నా రూక్షంగా బొమముడి విరిచాడు:

"అయితే వెంటనే సైన్యాలన్నిటిని స్వయంవర యాత్రకోసం సన్నాహపరచండి!"

అమరుకదేవుడు మళ్ళీ వీణావాద్యంలో మైమరిచాడు. మహా మాత్యుడు నెమ్మదిగా నసిగాడు:

"స్వయంవరోత్సవానికి సైన్యసంరంభం ఎందుకు మహాప్రభూ!"

"అదంతా మీ కనతికాలంలోనే తెలుస్తుంది! ముందు మన సైన్యాలన్నీ సమాయత్త పరచండి."

మహారాజిక మహామాత్యునివైపు పొక్కమారయినా కన్నెత్తి చూడలేదు. అతని వేళ్లు మళ్లీ వీణాతంత్రులపై నృత్యం ప్రారంభించాయి.

ఆ అజ్ఞ విని రాజ్యవర్ధనుడు దిగాలుపడి పోయాడు. అమరుకదేవు

డెప్పుడూ అతనితో సంప్రతించనిదే ఏ వ్యవహారమూ తలపెట్టలేదు! కాని ఈ మధ్యన అతనికి మహారాజదర్శనమే దుర్లభమైపోయింది. ఒకవేళ దర్శనం దొరికినా అమరుకదేవు డంతగా అతనితో ఆయా రాజ్యవ్యవహారాలు సంప్రతించడమే మానివేశాడు. అదంతా రాజ్యవర్ధనుని కత్యద్భుతంగా కనిపించింది. అతడు మారుమాట చెప్పలేక వీణావాద్యం విని ఆనందిస్తూ పక్కతాళం వేస్తూ తలవంచుకొని మరికొంచెంసే పక్కడ కూర్చున్నాడు. ఇంకా మరికొంతసేపుండి మహారాజుదగ్గర సెలవుతీసుకుని వెళ్ళిపోయాడు. ఆనాడంతా అతని హృదయంలో మహారాజును గురించిన మథనే!

దానికి కారణాలు లేకపోలేదు. మాళవరాజ్య సింహాసనం చేజిక్కించుకొన్నప్పటినుంచి అమరుకదేవు డెన్నడూ అంత లోతుగా రాజ్యవ్యవహారాలలో జోక్యం కలిగించుకోలేదు. రాజ్యభారం అంతా రాజ్యవర్ధనునికీ, మిగిలిన మంత్రులకు అప్పగించి నిత్యము భోగలాలసలో మైమరిచి యథేచ్ఛగా సంచరించాడు.

పొద్దస్తమానము వీణావేణు మృదంగ వినోదాలు! ఆపైన నర్తకీ మణుల లాస్యవిద్యావినోదాలు! ఆపైన అతనికి మద్యపానము, మృగయ, ద్యూతము మొదలైన దుర్వ్యసనాలు కూడా అలవడ్డాయి.

ఆ పరిస్థితులలో ఒకనా డతడు విశాలాపుర పరిసరాలలో సింహాల వేట కుపక్రమించాడు. అది అత్యంత ప్రమాదకరమైన మృగయావినోదం. ఒకనా డత డెన్నెన్నో సింహాలను సంహరించాడు. కాని ఆ సింహాలలో ఒక కొదమసింహం శూలప్రహారం చవిచూచిన వెంటనే అతనిపై కురికి పంజాతో శిరస్సుపై ఒక గట్టిదెబ్బ కొట్టింది. ఆ దెబ్బతో గుర్రంమీద కూర్చుని స్వారీచేస్తున్న అమరుకదేవుడు హఠాత్తుగా స్పృహతప్పి నేల మీద కూలబడిపోయాడు.మిగిలిన రౌతు లా సింహాన్ని వెంటనే సంహరించి వేశారు. అమరుకదేవునికి శాయశక్తులా పరిచర్యలు చేశారు. కాని ఎంత సేపటికీ అతనికి తెలివిరాలేదు.

ఇక గత్యంతరంలేక నెమ్మదిగా అతనిని తిరిగి రాజప్రాసాదానికి తీసుకుపోయారు. రాజవైద్యు లెన్నెన్నో ప్రక్రియలు చెయ్యగా చెయ్యగా

రెండుమూడు రోజుల కతనికి కొంచెం తెలివివచ్చింది. ఇంకా కొంత కాలాని కతడు క్రమక్రమంగా కోలుకున్నాడు. అతని కప్పటికి పరిపూర్ణా రోగ్య భాగ్యం కలిగింది.

కాని అప్పటినించీ అతనికి పూర్వపు రాజ్య వ్యవహారాలేవీ తిన్నగా గుర్తుకురాలేదు. సింహం పంజాదెబ్బవల్ల అతని కొవిధమైన విస్మృతి కలిగిందనీ, క్రమక్రమంగా ఆ మానసికవ్యాధి దానంతట అదే నయమైపో గలదనీ రాజవైద్యులంతా కలిసి ఏకగ్రీవంగా నిశ్చయించారు. తిరిగి శాయ శక్తులా చికిత్సలు చేశారు.

మహారాజు మనస్సు చాలావరకు కుదటపడిందిగాని అతని కింకా సంపూర్ణస్మృతి కలగలేదు.

అయితే వేటనించి తిరిగివచ్చిన కొంతకాలాని కతని వినోద వ్యాసంగం వేయిరె ట్లినుమడించింది. నిరంతర వారకాంతా వ్యాసక్తి అతని కొక నిత్యకృత్యమై కూర్చుంది. నిత్యము మద్యపానమత్తతతో మైమరిచిన అతని సన్నిధికి వెళ్ళడం అంటే మహామాత్యునికికూడా కొంచెం సంకోచమే కలిగింది.

మహారాజీవిధంగా నిరంతర భోగలాలసలో మైమరచి మత్తెక్కి పోవడానికి కారణం ఎవరికీ తిన్నగా తెలియలేదు.

క్రమక్రమంగా అమరుకదేవుని వినోదవ్యాసంగం ఆనాటికానాడు బాగా పెచ్చు పెరిగిపోయింది గాని కొంచెమైనా తగ్గుముఖం పట్టలేదు.

సింహం పంజా దెబ్బతగిలి అప్పుడే ఒక సంవత్సరంపైగా గడిచి పోయింది. అయినా అతని నిత్యభోగ వినోదప్రసక్తి అలాగే ఇనుమ డించింది గాని కొంచెమైనా తగ్గలేదు.

అమరుకదేవుని అంతఃపురాంగనలు సుమారు శరవై మంది సుందరీ మణులు! ఇటీవల వారి సంఖ్య ఇంకా ఇనుమడించింది!

ఆపైన అతడు విదర్భదేశాధీశ్వరుని కుమార్తె లీలావతిని తనకిచ్చి వివాహం చెయ్యవలసిందని రాజదూతద్వారా ఒక సందేశం పంపించాడు.

కింశుకప్రభ పూర్వం అమరుకదేవుని హృదయం చూరగొన్న ఒక విశాలా పుర నర్తకి. క్రమ క్రమంగా అమరుకదేవుని అనురాగ కటాక్షవీక్షణం

పడి ఆమె అతని అంతఃపురంలోనే ప్రవేశించింది. మరి కొన్నాళ్ళకు తన లలితకళాచాతుర్యంతో అతని హృదయమే వశపరచుకుంది. కాని అమరుకభూపతి వేటనించి తిరిగి వచ్చినప్పటినించి మరి ఆమెమాటే తల పెట్టడం మానుకున్నాడు. అప్పటినించీ ఆమె తిరిగి అతని హృదయ మెలాగైనా చూరగొనాలని తహతహలాడింది. ఆనాటి రాత్రి నృత్యం ముగిసిన తరవాత ఆమె మళ్ళీ అతని అనుగ్రహం సంపాదించి కొంతవరకు సంతృప్తి పడింది. అయితే అతని హృదయం పూర్తిగా తన గుప్పిట్లో పెట్టుకోవాలని ఆమె నొక గట్టి పట్టుదల పట్టుకుని పీడించింది.

కింశుకప్రభ తన పైటచెరగులో ఒక విచిత్ర వస్తువేదో దాచి ఇంకెవ రికీ తెలియకుండా అతిరహస్యంగా అతని రహస్య మంత్రాగారంలో ప్రవేశించింది.

అప్పటి కొక జాముర్రాత్రి గడిచింది. నిశ్చలంగా వెలిగే దీపకళిక వెలుగులో అమరుకదేవుని ముఖం ఆనా డామె కెంతో మనోజ్ఞంగా కనిపించింది.

ఆ నృపతి అప్పుడప్పుడు కొంచెం కొంచెం మద్యం చవిచూచి ఏదో తీవ్రాలోచనలో పడి సతమతమవుతున్నాడు. ఆమె రహస్యమంత్రాగార ద్వారం కొంచెం తెరచి కొంతసేపటివరకు అతని ధోరణి అంతా అతి జాగ్రత్తగా పరిశీలించి చూచింది. హఠాత్తుగా లోపలికివెళ్ళి అతని కెదు రుగా చదికిలపడింది:

“మీకొక అమూల్యరత్నం బహూకరిస్తాను! మరి నాకేమిస్తారు?”

అత డొక్క నవ్వు నవ్వి ఆమె పైట చెరుగులో దాచిన ఆ అమూల్యరత్నం హఠాత్తుగా చేజిక్కించుకోవా లని ప్రయత్నించాడు. కాని ఆమె అతని ఎత్తు సాగనివ్వలేదు. దానితో అతని ఆట కట్టింది.

“నీ కంతకన్నా అమూల్యరత్నమే బహూకరిస్తున్నాను! తీసుకో!”

అని ఆమెపెదవులపై కెంపు లపహరించబోయాడు. ఆమె తటాలున తన ముఖం ఇంకొకపక్కకు తిప్పివేసుకుంది. అంతలో అత డామె చెక్కిలి ముద్దు పెట్టుకొన్నాడు. ఆ ఆదరణకే కింశుకప్రభ ఎంతో మురిసి పోయింది. తన పైటచెరగులో దాచిన చిత్రఫలకం హఠాత్తుగా అతని ముందుంచింది.

అమరుకదేవుడు రెప్ప వాల్చకుండా ఆ చిత్తరువు పరిశీలించాడు. అతని ముఖం వికసించింది. ఆ ముఖ వికాసం చూచి కింశుక లోలోపల బాగా మధన పడింది.

అది విదర్భదేశాధీశ్వరుని తనయ లీలావతి చిత్తరువు!

ఆ చిత్తరువుపై నిలిచిన అమరుకదేవుని దృష్టి మరి చలించలేదు! అతడు తదేక దృష్టితో ఆ చిత్తరువులోని చిత్తరివైపు చూచాడు:

"ఇంతటి జగదేకసుందరిని నే నెంతకు పూర్వం ఎక్కడా కని విని ఎరగనే!"

అప్రయత్నంగా వెలువడిన ఆ ప్రశస్తి వినగానే కింశుకప్రభ చెక్కిళ్ళలో మోదుగపూ గుత్తులు వికసించాయి.

"సరికొత్తవా రయితే సరి! మీ కెవరైనా అందగత్తెలే!"

కింశుకప్రభ ఇప్పు డాతని ఆదరణ కొంచెం చవిచూచింది. దానితో బాగా కొండెక్కి కూర్చుని అదే పనిగా రుసరుస లాడడం మొదలు పెట్టింది.

అమరుకదేవు డామె నెన్నో విధాల లాలించి బుజ్జగించాడు. ఆమె ఆ ఆదరణకు లోలోపల బాగా సంతోషించింది. అంతలోనే అతని దృష్టి మళ్ళీ లీలావతి చిత్తరువుమీదికి తిరిగింది. కింశుకప్రభ అది కనిపెట్టి హఠాత్తుగా అతని ఆశ్లేషబంధనం విడిపించుకొని ఒక్క దూకులో అక్కడి నించి వెళ్ళిపోయింది.

అమరుకదేవుని కామె ఈర్ష్యానూయల ధోరణి అత్యంత విచిత్రంగా కనిపించింది.

కింశుకప్రభ అమరుకదేవుని కిటీవల లీలావతిపై మిక్కిలి మక్కువ కలిగిందని గ్రహించింది. తనమీద అతని అనురాగం ఇంకా ఇనుమడించా లని ఆశించింది. దానికోసం ఎంతో శ్రమపడి లీలావతి చిత్తరు వొకటి సంపాదించి అతనికి బహూకరించింది. ఆ విధంగా అతని ఆదరాభిమానాలు చూరగొన్నా నని బాగా మురిసిపోయింది. కాని ఆ సమయంలో అతని దృష్టి చిత్తరువు మీదికి తిరిగేసరికి పట్టరాని ఉక్రోషంతో అక్కడినించి లేచివెళ్ళిపోయింది! ఆమెకు తనమీద కలిగిన గాఢానురాగానూయలు తలుచు

కాని అమరుకదేవుడా సుందరి మీద జాలి పడ్డాడు. కాని ఆ విషయ మై గ్రహించకుండా ఒక్క క్షణంలో ఆమె అక్కడి నించి వెళ్ళి పోయింది!

అదంతా తెలుసుకొని అత డొక వేడి నిట్టూర్పు విడిచి పెట్టాడు. ఆ పార్శ్వంలో కనిపించిన మద్యపాత్రికలోని మద్యం అంతా ఒక్క గుక్కలో తాగివేసి, కింశుకప్రభ తనకు బహూకరించిన చిత్రఫలకం వైపు చూస్తూ కూర్చున్నాడు.

పిమ్మట ఒక అంతఃపుర పరిచారిక అక్కడికి వచ్చి శిరస్సుపై దోసిలి ఒగ్గి సవినయంగా విన్నవించింది:

"మహాప్రభూ! ఇది భృగువాసర రాత్రి. ఈనాడు క్రమప్రకారం అంగరాజకుమారిక వారం! ద్యూత క్రీడలో కమలారాజ్ఞి ఈ రాత్రి గెలుచుకొన్న విషయం తమకు విదితమే గదా! ఇక తల కట్టుకుని కోప గృహంలోనికి వేంచేసిన దేవేరిగారు తమపై ఎంతైనా అలక వహించి ఉన్నారు! అది అత్యంత ముఖ్యమైన విషయమని నేను వేరే విన్నవించ వలసిన అవసర మేమీ లేదుగదా! ఆపైన దేవరవారి చిత్తం!"

ఆమె ఆనాటి రాత్రి అమరుకభూపతి ప్రత్యేకంగా సందర్శించ వలసిన అంతఃపుర రాణుల పేరు లన్నీ వరసగా ఏకరువు పెట్టింది. అత డొకసారి ఆమె వైపు చూచాడు. అంతఃపుర పరిచారిక వెంటనే అక్కడి నించి వెళ్ళిపోయింది.

అమరుకదేవుని కే విధంగా నిశ్చయించడానికీ మనస్కరించ లేదు.

అతని హృదయం అంతా అంతకు పూర్వమే లీలావతి చూర కొన్నది.

కాని దేవేరి నొకమారు సందర్శించకపోతే ఆమె మరి ఆ కోప గృహమే తన నిత్యనివాసంగా ఏర్పరుచుకోవచ్చును! మిగిలిన రాణు లా విషయంలో దేవేరి కన్నా మరి రెండాకు లెక్కువే చదివారు!

క్షణకాలం అత డా రాణు లందరిని గురించీ ఆలోచించాడు. కాని అతని హృదయం వారిమీద ఎంతోసేపు నిలవలేదు.

ఉత్తరక్షణంలో అతని దృష్టి తిరిగి లీలావతి చిత్తరువుపై పడింది.

అలక్ష్యమైన ఆమె రూపరేఖలు తలుచుకొని అత డొక దీర్ఘ నిశ్శ్వాసం విడిచిపెట్టాడు.

స్మృతి తప్పి పోయేవరకు సీధుపానంచేసి ఆ మైమరుపులో అత డా రహస్య మంత్రాగారంలోనే మేనువాల్చి నిద్రించాడు.

అమరుకదేవుడికి లీలావతిపై కలిగిన గాఢానురాగం అంతఃపుర రాణు లందరికీ కన్నెర్రగా మారింది. వారెవ్వరూ ఎన్నడూ అతని అనురాగం అంత గాఢంగా చవిచూడలేదు. స్వతః అతని ప్రకృతి అంత లోతైనది కాదు. ఇంతకుపూర్వం అతని అనురాగము, అపేక్ష, మమకారము ఏ రాణీమీదా పట్టుమని పది రోజులపాటైనా సుస్థిరంగా నిలబడలేదు! అలాంటప్పుడు ఒకమారు చిత్తరువులో చూచినంతమాత్రాన ఆయనకు లీలావతిపై అంతటి వల్లమాలిన ప్రేమ కలగడానికి కారణమేమో! రాణు లెవరికీ మహారాజు స్వభావంలో కలిగిన ఈ విచిత్ర పరిణామానికి కారణం తెలియలేదు. కొంతమంది రాణు లదంతా వట్టి మూన్నాళ్ళ ముచ్చట అని కొట్టిపారేశారు. "ఇదంతా వట్టి నటనే లే! తీరా ఆ కొత్తరాణి రాణివాసం ప్రారంభించగానే మళ్ళీ యథాప్రకారం పాతకథే ప్రారంభం అవు తుంది. మొదట్లో మామీద మాత్రం ఆయన కీ మాత్రం అనురాగం కలగ లేదు గనకనా?"

వారిలో వా రలాగ సమాధానపడ్డారు.

ఇక కింశుకప్రభ కీ లీలావతి ప్రేమ మరింత విచిత్రంగా కనిపించింది. కింశుకప్రభ ఒకప్పుడు మహారాజు మమకారం గాఢంగానే చవిచూచింది. తరవాత అమరుకుని కామెపై ఏర్పడింది కేవలం ఉపేక్షా భావం మాత్రమే!

తలవని తలంపుగా మహారాజు తన కత్యంత సన్నిహితు లయిన రసి కులతోను, విట విదూషకులతోను కలిసి అంతఃపురంలో రెండు మూడు మారు లామె నృత్య చాతుర్యం చూచి ఔనౌనని తల పంకించి వేనోళ్ళ ప్రశంసించాడు. నిరాదరణావమాన భారంతో కుమిలి కృశించిపోతున్న కింశుకప్రభ కా ఆదరణ ఒక పెన్నిధిలా కనిపించింది. ఆ పరిస్థితులలో

ఆమె తనపై అతని కిటీవల ఏర్పడిన ఆసక్తి అలాగే నిలవరించుకోవాలని అనేక విధాల ప్రయత్నించింది. లీలావతికథ విన్న తరువాత కింశుక ప్రభ కామెపై ఈర్ష్యాసూయలు కలగకపోలేదు! కాని అమరుకదేవుని కామె మీద కలిగిన ఆసక్తి కేవలం తాత్కాలికమే అని ఆమె నిశ్చయించింది. అందుచేతనే తనకు లీలావతిపై కలిగిన ఈర్ష్యాసూయ లలాగే దిగమింగి అతి కష్టంమీద ఆమెచిత్తరువొకటి సంపాదించి ఎంతో ఆప్యాయంగా అమరుకదేవునికి బహూకరించింది. అది గ్రహించిన అమరుకదేవుని కామె యెడల జాలి కలగక పోలేదు గాని అతని చిత్తం లీలావతీ గాఢానురాగ పాశబద్ధమై వివశమై పోయింది!

అది హఠాత్తుగా గ్రహించిన కింశుకప్రభ నిష్కారణంగా కొరివితో తల గోక్కున్నానని పశ్చాత్తాప పడింది. కాని చేతులు కాలిన తరవాత ఆకులు పట్టుకుంటే ఏమి లాభం?

మహామాత్యుడు రాజ్యవర్ధనుని కిది మరింత పెద్ద విషమ సంధిగా కనిపించింది. విదర్భ దేశాధిపతి తన కుమార్తె నమరుకదేవుని కిచ్చి వివాహం చెయ్యడాని కంగీకరించలేదు. కాని ఇరుగుపొరుగు రాజ్యమైన మాళవంతో విరోధానికి వెరచి ఆ మహారాజును స్వయంవరానికి మాత్రం ఆహ్వానించాడు. అంతే! అమరుకదేవుడు స్వయంవర యాత్ర మిషతో సైన్యాలన్నీ సమాయత్త పరచవలసిందని ఆజ్ఞాపించాడు. అంతేగాని తన నిజ సంకల్పం మాత్రం రాజ్యవర్ధనునికి తెలియనీయలేదు. కాని రాజ్యవర్ధనుని కతని సంకల్పం గ్రహించడాని కట్టేకాలం పట్టలేదు. లీలావతిని రాక్షస వివాహ మర్యాదతోనైనా వివాహమాడి తీరాలని మహారాజు నిశ్చయించుకొన్నాడని మహామాత్యు డిట్టే పసికట్టివేశాడు. దానివల్ల మాళవ విదర్భ దేశాలమధ్య ఏర్పడిన సామరస్యం చెడి తిరిగి వైమనస్యంగా, ప్రబల వైరంగా పరిణమించగలదని అతడు భయపడ్డాడు. అందుచేత మహారా జంతగా మనసిచ్చి మాట్లాడకపోయినా సైన్య సన్నాహాలతో స్వయంవర యాత్రకు తరలివెళ్ళడం సముచితం కాదని, దానివల్ల అనేకమైన అపోహ లేర్పడవచ్చుననీ అన్నాడు. అమరుకదేవు డది విని అతి హేళనగా ఒక నవ్వు నవ్వాడు.

"మీకా భయం అక్కరలేదు! అవన్నీ నేను చూచుకుంటాను. రాజ్యం వీరభోజ్యం! అంతేగాని భీరుభోజ్యం కాదు! మీ రిక వెళ్ళ వచ్చును."

అంత పరుషంగా మహారాజు మాట్లాడినప్పుడిక రాజ్య వర్ధను డేమీ అనలేక తల వంచుకుని ఒక్క నిట్టూర్పు విడిచిపెట్టి చల్లగా అక్కడి నించి జారుకున్నాడు.

అతని హృదయంలో మళ్ళీ మథన ప్రారంభమయింది. మహారాజు పూర్వం రాజ్య వ్యవహారాలన్నీ తనమీద విడిచిపెట్టి యథేచ్ఛగా భోగ విలాస లాలసలో మైమరిచేవాడు. ఎన్నివిధాల చెప్పినా రాజ్య వ్యవహారా లేవీ చెవికెక్కించుకునేవాడు కాదు.

ఇప్పుడది మరింత మితిమీరి పోయింది.

కొన్ని వ్యవహారా లేమయి? తరిచి తరిచి అడిగితే వాటి కన్ని — అంటీ అంటని సమాధానా లేవో చెప్పి తప్పించుకోవడం మొదలు పెట్టాడు. మరికొన్ని వ్యవహారా లతని కేమీ జ్ఞాపక మున్నట్లే కనబడ లేదు!

పూర్వకాలంలో ఏదైనా ఒక ముఖ్య వ్యవహారం పరిష్కరించవలసి వస్తే తన మాట ప్రకారమే నడుచుకునేవాడు. ఇప్పుడదంతా తారుమా రయింది. మహారాజు భోగ విలాసా లానాటి కానాడు పెచ్చు పెరిగి పోయాయి. పైగా ముఖ్య వ్యవహారాలలో తనతో ఒకమాటయినా అన కుండా యథేచ్ఛగా, ఇష్టంవచ్చినట్టు సంచరిస్తున్నాడు. ఇక వైనందిన రాజ్యపరిపాలనగోడే పట్టించుకోవడం మానివేశాడు. వాటి విషయం ఎత్తితే అతని కెక్కడలేని చిరాకు, విసుగు పుట్టుకొస్తున్నాయి. ఒకవేళ ఏదయినా సమాధానం ఇచ్చినా దానిలో పూర్వాపర సంబంధం లేదు! ఆ విస్మృతికి, విసుగుదలకు అసలు కారణమేదో మహామాత్యుని కేమీ అంతు చిక్కలేదు.

అతని కేమీ పాలుపోక మిగిలిన మంత్రులతో ఆ విషయం మిుచ్చ టించాడు. వారిలో కొంద రది తేలికగా కొట్టిపారేశారు. "దేవరవారి దివ్యచిత్తాని కొక దారీ తెన్నూ ఉండాలనుకోవడమే ఒక పెద్ద పొరబాటు!

మారు మాట్లాడకుం వారి సంకల్పప్రకారం నడుచుకోవడమే మన విధ్యుక్తధర్మం! మహారాజు తామై ప్రశ్నిస్తే ఏదైనా తోచిన సదుపదేశం చెయ్యడంవరకే మన ధర్మం! అంతే!"

కాని రాజ్యవర్ధను డంతటితో సంతృప్తిపడి ఊరుకోలేదు. మహారాజు హృదయంలో ఇటీవల బయలుదేరిన ఈ విపరీత పరిణతి కేదో ప్రబలకారణం ఉండితీరాలని నిశ్చయించాడు. రాజవైద్యుల్ని కొందరిని పిలిచి మహారాజు చిత్తవిభ్రాంతిని గురించి చర్చించాడు. వారదంతా క్రమక్రమంగా దానంతట అదే కుదటపడగలదని సమాధానాలిచ్చారు. రాజ్యవర్ధనుడికి చేయగలిగినదేమీలేక వారిమాటప్రకారం కొంతకాలం వరకు వేచి ఉండడమే మంచిదని నిశ్చయించుకొన్నాడు.

విదర్భదేశాధిపతి తన కుమార్తె లీలావతిని అమరుకదేవుని కిచ్చి వివాహం చెయ్యడాని కంగీకరించకపోవడాని కొక కారణం లేకపోలేదు. అమరుకు డసలే భోగలాలసుడు. ఆపైన అతని కప్పుడే సుమారు నూరుగురు దాకా రాణు లున్నారని ఒక లోకప్రవాదం బయలుదేరింది. బహుభార్యాత్వం ఆనాటి మహారాజ సంప్రదాయమే! అయినా తన కుమార్తె సుఖం ఆలోచించి అత డమరుకుని వివాహసంబంధాని కంగీకరించలేదు! కాని దానివల్ల అమరుకదేవునితో బలవద్విరోధం ఏర్పడ గలదని అతనికి భయం కలగకపోలేదు. కాని అత డది లెక్క చెయ్యలేదు. అలాగే భీష్మించుకుని కూర్చున్నాడు. ఇటీవల అమరుకుని కేదో కొంచెం చిత్తచాంచల్యం కలిగినదని కూడా అతనికి తెలిసింది. దానితో అతనికి మరింత గట్టి పట్టుదల పట్టుకుంది. ఏది ఏమైనాసరే! లీలావతి నమరుకదేవుని కిచ్చి వివాహం చెయ్యకూడదని గట్టిగా నిశ్చయించుకొన్నాడు.

అప్పటి విదర్భరాజధాని పద్మనగరం రాజకుమార్తె లీలావతి స్వయంవర సన్నాహ కోలాహలంతో, నూతన తోరణాలంకారాలతో కలకలలాడింది. స్వయంవరార్థం విచ్చేసిన రాజకుమారులంతా తమకోసం ప్రత్యేకంగా అమర్చిన సింహాసనాలమీద కూర్చుని లీలావతి సందర్శనం

కోసం అనుక్షణము ఎదురుచూస్తున్నారు. అమరుకదేవుడామె రాకకోసం మరింత ఆత్రంగా ఎదురుతెన్నులు చూచాడు.

చివరికి నూతన వధూవేషంతో కలకలలాడుతూ లీలావతి ప్రత్యక్షమయింది. ఆమె సౌందర్యం చూచిన రాజకుమారు లలాగే నిశ్చేష్టులై శిలాప్రతిమ లయినారు. అమరుకదేవుని కామె చిత్తరువులో, ఆ సౌందర్యంలో లవలేశం కూడా ప్రతిఫలించలేదని అనిపించింది!

లీలావతి స్వయంవరమాలిక చేత ధరించి నెమ్మది నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ నడిచి వస్తూంది. ఆమె చెలికత్తె బారులుదీర్చికూర్చున్న రాజకుమారులలో ఒక్కొక్కరి వైపే చూచి సంగ్రహంగా వారి వారి గుణగణా లేకరువుపెడుతూంది.

క్రమక్రమంగా లీలావతి అమరుకదేవుని సింహాసనం సమీపించింది. అతనితోబాటతని పార్శ్వాల కూర్చున్న రాజకుమారులంతా ఆమె స్వయంవరమాలిక ఉత్తరక్షణంలో తమ కంఠా లలంకరించగలదని ఎంతైనా ఉవ్విళ్ళూరారు. కాని అలాంటిదేమీ జరగలేదు. ఆమె వారిసందరినీ అతిక్రమించి వెళ్ళిపోయింది! అయినా రాజకుమారులంతా పైపైకలాగే చిరునవ్వులు చిలకరించారు. అమరుకదేవుని కది సాధ్యం కాలేదు. ఎలాగో అలాగ శ్రమపడి ఒక్క విషపు నవ్వు వెళ్ళగక్కాడు. లీలావతి చెలికత్తెతో కలిసి హేలగా అలాగే మున్ముందుకు సాగిపోయింది. ఒక రాజకుమారుని సింహాసనం దగ్గర కొంతసేపు నిలబడింది. అది గ్రహించి చెలికత్తె అతని గుణగణా లదేపనిగా పొగడడం మొదలుపెట్టింది. లీలావతి చెక్కి ళ్లెర్రబడ్డాయి. ఆమె స్వయంవరమాలిక నెమ్మదిగా ఆ రాజకుమారుని కంఠంలో అలంకరించబోయింది.

అంతలో రాజకుమార పంక్తిలో ఒక పెద్ద గగ్గోలు బయలుదేరింది. వారందరూ తమ తమ సింహాసనాలు దిగి ఆ కల్లోలానికి కారణం తెలుసుకోడానికి ప్రయత్నించారు. క్షణంలో వారి కది అంతా అవగాహన అయింది.

లీలావతి తన సింహాసనం దాటి మున్ముందుకు సాగిపోగానే అమరుకదేవు డిక తన సింహాసనంపై కూర్చోలేక పోయాడు. మరికొంత సేపటికి లీలావతి స్వయంవరమాలిక ఇంకొకరి కంఠం అలంకరించబోతున్నదని

గ్రహించాడు. మరుక్షణంలో లీలావతిని హఠాత్తుగా చేజిక్కించుకొని తన రథం మీదికి వెళ్ళిపోయాడు. అంతంతకు అమరుకదేవుని విడిదిలో పరిచారకులుగా, అధికారులుగా, మారువేషాలు ధరించిన సైనికులంతా నిజ స్వరూపాలతో అతని రథం పక్కనే యుద్ధసన్నద్ధులై నిలిచారు.

అప్పటికి సూర్యాస్తమయం అయింది. అమరుకదేవుని సైనికులు, విదర్భదేశాధిపతి సైనికులు ఒకరొకరితో యుద్ధానికి తలపడ్డారు. క్రమంగా బాగా చీకటి పడింది. విదర్భదేశాధిపతి సైనికులు స్వయంవర మహోత్సవ సన్నాహంలో పడి వివిధ వినోదాలతో వినోదిస్తున్నారు వారెవ్వరూ హఠాత్తుగా యుద్ధం తమపై విరుచుకుపడగలదని అనుకోలేదు! అమరుకుని సైనికులంతా సర్వసన్నద్ధులై అక్కడికి వచ్చారు. అనుక్షణము యుద్ధంకోసం ఎదురుచూస్తున్నారు. అందుచేత ఆ సంకుల సమరంలో వారిదే పైచేయి అయింది. అయినా అమరుకదేవుని సైనికులలో చాలా మంది ఆ యుద్ధంలో మరణించారు. అమరుకదేవు డతి కష్టంమీద లీలావతితో సహా తన రాజధానికి రాగలిగాడు.

ఆటుపిమ్మట రెండు రోజులలో వారిద్దరికి యథావిధిగా వివాహం జరిగిపోయింది. ఆ వివాహంలో లీలావతి ఇష్టానిష్టాల విషయం ఎవరూ తలపెట్టలేదు. ఆ విధంగా వివాహమాడడం ఆ రోజుల్లో సుక్షత్రియ ధర్మం! అందుచేత అమరుకదేవుని అత్యద్భుత సాహసం విని అందరు వేనోళ్ళ ప్రశంసించారు. అత డావిధంగా అత్యద్భుత శౌర్య సాహసాలు ప్రదర్శించి శత్రువులందరినీ చెండాడి లీలావతిని రాక్షసవివాహ మర్యాదను చేజిక్కించుకు రావడమే వారి కత్యాశ్చర్యకరంగా కనిపించింది.

అంతేనే గాని లీలావతి కది అంగీకారం అవునో కాదో వారెవ్వరూ ఆలోచించలేదు! అందరూ అమరుకదేవుని నూతన కళ్యాణోత్సవాల కోలాహాలంలో పడి ఆ విషయమే విస్మరించారు.

ఇక లీలావతిమాట! ఆమె మొట్టమొదట ఆ అఘాతానికి తట్టుకోలేక అమరుకదేవుని రథంమీదే స్పృహతప్పి పడిపోయింది. తరవాత అతని అంతఃపురంలో కళ్ళు, తెరిచి నాలుగువైపులా పరకాయించి చూచింది. ఈ తరక్షణంలో ఆమె కదంతా అవగాహన అయింది. కాని ఆమె మరి

మాటలాడలేదు! ఒకమారు తన దురదృష్టం నిందించుకొని గుక్క నీరు గుక్కుకుంది. వివాహసమయంలో కూడా ఆమె పెదవులపై ఒక చిన్న చిరునవ్వైనా చిగిరించలేదు!

వివాహం జరిగిన ఒక పక్షంరోజులవరకూ ఆమె ముఖవైఖరిలో మార్పేమీ గోచరించలేదు. కాని అమరుకదేవు డామె అనుగ్రహం సంపాదించడాని కెన్నెన్నో విధాల ప్రయత్నించాడు. అనుక్షణము ఆమె కే లోటూ రానీయకుండా కంటికి రెప్పలా చూడవలసిందని అంతఃపుర పరిచారికల కాజ్ఞాపించాడు.

లీలావతి అంతఃపురంలో అడుగుపెట్టినప్పటినించి అతని దృష్టి అంతా ఆమె మీదనే లగ్నమయింది. అంతేకాదు! ఆపైన మరి ఒక మాసంరోజులు గడిచిపోయినా అతని వైఖరిలో మార్పేమీ గోచరించలేదు. అప్పటికి లీలావతి పెదవులపై చిన్ని చిన్ని చిరునవ్వులు చిగిరించడం మొదలుపెట్టాయి. అమరుకదేవు డిక తనవంటి అదృష్టశాలి ప్రపంచంలో ఇంకెవరూ లేరని సంతోషించాడు. లీలావతి కనుసన్నలలో మెలుగుతూ ఇక మిగిలిన అంతఃపుర రాణుల మాటే మరిచిపోయాడు. ఆ ధోరణి చూచి మిగిలిన రాణులందరు ఆశ్చర్యపోయారు. కొత్తరాణి అతిలోకసౌందర్యమే అతని నంతగా ఆకర్షించిందని కొంచెం సమాధానపడ్డారు. మరి కొంద రామె చాలా అదృష్టవంతురాలని అసూయపడ్డారు.

అప్పటి కా వివాహం జరిగి ఇంచుమించుగా ఒక నెల రోజుల కాలం గడిచిపోయింది. అప్పటి కమరుకదేవుడు లీలావతి బాగా కుదట పడిందని సంతోషించాడు.

కాని మరి కొంత కాలానికి లీలావతి క్రమక్రమంగా చిక్కి శల్యమై పోయింది. ఆమె తన శయ్యమీదినించి లేచి నాలుగడుగులు వెయ్యడమే గగనమైపోయింది. ఆమె ఆ విధంగా క్షీణించి చిక్కి శల్యమై పోవడానికి కారణ మెవరికీ తెలియలేదు. చివరికి రాజవైద్యుల ప్రత్యేక ప్రక్రియలు కూడా పనికిరాలేదు. ఆమె అలాగే చిక్కిశల్యమైపోయింది. అస లామె రుగ్మతకూడా ఎవరికీ అంతుబట్టలేదు. లీలావతి పెదవులమీది చిరునవ్వూ, ముఖలావణ్యమూ మాత్రం క్షీణించలేదు. అంటే, కొంద రామె దురంత

చింతతో ఆవిక్షంగా శుష్కించిపోయిందని అన్నారు! మరి కొందరామె
కమరుకదేవునితో వివాహం బొత్తిగా సరిపడలేదని గుసగుసలాడారు. మరి
కొందరామె రహస్యంగా విషం పుచ్చుకొని ఉండవచ్చునని అనుమా
నించారు. అమరుకదేవుడామె శయ్యపక్కనే నిలబడి అనుక్షణము కంటికి
రెప్పలా కాపాడుతూ శాయశక్తులా వైద్యం చేయించాడు. కాని ప్రయో
జనం కలగలేదు. ఒకనాటి అర్ధరాత్రి ఆమె అలాగే చిరునవ్వుతో కళ్ళు
మూసింది. అది చూచి అమరుకుడక్కడే కూలబడిపోయాడు.

అతనికా ఆఘాతంతో ఒక పెద్ద పిడుగు మీద విరుచుకు పడినట్లయింది.
అంతకు పూర్వం అతడెప్పుడూ అంత హృదయాఘాతమే చవిచూడ
లేదు! ఆ దుఃఖాఘాతంతో అతడొక్కమారు కళ్ళు తెరిచి చూచాడు!
జీవితం అంతా అతని కొక్కమారుగా దుఃఖభూయిష్ఠమై అనిత్యమై పోయి
నట్లు స్ఫురించింది. తన భోగలాలస నిత్యవినోదాసక్తులన్నీ కేవలం అర్థ
రహితంగా, వ్యర్థంగా కనిపించాయి.

జీవితంలో, అందరికీ, అడుగడుక్కీ తీవ్రమైన దుఃఖాఘాతాలు
తగులుతూనే ఉంటాయి. కాని ఆ ఆఘాతాల కేవేవో అర్థాలు చెప్పు
కొని అనేకు లనేక విధాలుగా సంతృప్తి పడుతూ అలాగే జీవిత
యాత్రలు సాగిస్తూంటారు. ఒక్కొక్కరి కొక్క శోకాఘాతంతో
జీవితం అంతా నిస్సారమై పోయినట్లు స్ఫురిస్తుంది. అమరుకుడంతకు
పూర్వం అనేక వివాహాలు చేసుకొన్నాడు. కాని వారెవరి మీదా అతని
కంతటి గాఢానురాగం ఏర్పడలేదు. తలవని తలంపుగా లీలావతి మీదనే
అతని కంతటి గాఢానురాగం కలిగింది. అయితే ఆమె అప్పుడప్పుడే విక
సించిన క్రొవ్విరిలా అతని హృదయం అలంకరించి అంతలోనే వాడి
నేలపై రాలిపోయింది. అమరుకుని కామెహృదయం అన్యాయత్తమై
ఉండవచ్చునని అనుమానం కలిగింది. అయినా ఆమె యెడల అతని
అనురాగం కొంచెమైనా వాడిపోలేదు. కనుకనే ఆమె, మృతితో అతని
కంతటి తీవ్రావేదన కలిగింది. ఆ ఆవేదన అతని కంత గొప్ప కనువిప్పు కలి
గించింది.

అత డప్పటినించి పూర్వ భోగలాలస లన్నీ పూర్తిగా విసర్జించి వేశాడు. లీలావతి మృత్యుజిజ్ఞాస అతని అంతరాంతరాలలో ఒక పెద్ద సంక్షోభం రేకెత్తించింది. అమరుకు డప్పటినించీ విద్యావయోవృద్ధులతో వేదాంతచర్చ లారంభించాడు.

వేదాంత వేత్త లనేక విధాలుగా అతనికి దుఃఖోపశమనం కలిగించ డానికి ప్రయత్నించారు. వారి వేదాంత సూక్తులు గాని, ఉపశమన వాక్యాలుగాని అతని హృదయంలోని చిచ్చార్పలేక పోయాయి.

ఎంతసేపూ అతని కొకటే జిజ్ఞాస. లీలావతి ఎక్కడికి వెళ్ళి పోయింది? మరుమరీచికలై స్ఫురించే జీవనమరణాల అంతరార్థ మేమిటి? ధా నెవరు? ఆమె వియోగం తన హృదయాంతరా లావిధంగా దొలిచి వేయడానికి కారణ మేమిటి? లీలావతి ఎవరు? అస లీజీవిత పరమార్థ మేమిటి?—ఇటువంటి ప్రశ్న లెన్నెన్నో అనుక్షణమూ అతని హృద యంలో ఆరని జిజ్ఞాసాగ్ని ప్రజ్వలింప జేశాయి. ఎంతమంది తత్త్వవేత్త లెన్ని విధాల సమాధానపరిచినా అతని హృదయ వేదనాజ్వాల చల్లార లేదు. ఆ కారణంవల్లనే అతని దర్శనం అంతఃపుర స్త్రీలకే గాక మంత్రు లకు కూడా దుర్లభమైపోయింది.

ఒకనాడు రాజ్యవర్ధను డేదో అత్యవసర వ్యవహారం మీద మహా రాజ దర్శనానికి వస్తున్నా నని కబురు పంపించాడు. ఎంత రుచించక పోయినా అమరుకదేవునికి తన దర్శనం ఇవ్వక తప్పలేదు. రాజ్యవర్ధనుడు లోపలికి వస్తూనే ఎంతో ఆత్రంగా మాట్లాడాడు:

"మహాప్రభూ! విదర్భదేశాధిపతి సైన్యాలతో సహా మనమీదికి దండెత్తి వస్తున్నారట! ఆయన తమ కుమార్తె మృతికి తగిన ప్రతీకారం చెయ్యడం కోసమే ఈవిధంగా మనపై విరుచుకుపడుతున్నారట!"

ఆ మాటలు విని అమరుకదేవు డొక్క మారుగా విరగబడి నవ్వడం మొదలుపెట్టాడు. ఆ ధోరణి చూచి రాజ్యవర్ధను డతనికి పూర్తిగా మతిభ్రమణమే కలిగిందని అనుమానించాడు. అంతలో మహా రాజు తన వెర్రిన వ్యాపివేశాడు:

"రానివ్వండి! దానికేం? నేను యుద్ధమే కోరుకొంటున్నాను!

వారు సరిగా సమయానికే వచ్చారు! మీరు వెంటనే వెళ్ళి సైన్యా లన్నీ సమాయత్తపరచండి! వెళ్ళండి!"

రాజ్యవర్ధను డతని మాటలు విని మరింత ఆశ్చర్యపోయాడు. వెను వెంటనే సైన్య సన్నాహప్రయత్నంలో పడ్డాడు.

సఖోద్వేగంవల్ల అమరుకుని కప్పటి జీవితం కేవలం దుర్భరమై పోయింది. ఆ సమయంలో విదర్భసైన్యాధిపతితో యుద్ధంచేసి వీర స్వర్గం పొందగోరడమే సముచితమని అతనికి స్ఫురించింది. కాని పైపై కాసంకల్పం ఎవరికీ తెలియనీయకుండా వెంటనే యుద్ధ ప్రయత్నంలో పడ్డాడు. ఆ ప్రయత్న తన్మయతలో మైమరచిన అతనికి తాత్కాలికంగా కొంతవరకు దుఃఖోపశమనం కలిగింది.

విదర్భాధిపతి తన అపార సైన్య సంపత్తితో మాళవ రాజధాని మీదికి దండెత్తి వచ్చాడు. క్రమక్రమంగా ఆ విషయం అమరుకదేవునికి పూర్తిగా స్పష్టపడింది. అయినా అత డెక్కడా చెక్కు చెదర లేదు! శాయ శక్తులా యుద్ధ ప్రయత్నాలు చేయించాడు. అంతవరకు వినోద విలాసా లలో మునిగి తేలుతున్న మాళవ రాజధానిలో ఆ వార్త ఒక్క మారుగా దిగ్భ్రాంతి కలిగించింది!

విదర్భ సైన్యాలతో పోలిస్తే మాళవ సైన్యం అత్యల్పమనీ,అమరుక దేవుని కా యుద్ధంలో పరాజయం తప్పదనీ రాజ్యవర్ధనుడు భయపడ్డాడు. అయినా అతడు మహారాజాజ్ఞ ననుసరించి రాత్రింబవళ్ళదే పనిగా యుద్ధ సన్నాహాలు చేయించాడు.

ఆ యుద్ధంలో తన కిక ఘోర పరాజయం తప్పదని, అయినా వీర మరణమే శరణ్యమని, తన కా పరిస్థితిలో అదే మహా భాగ్యమనీ అమరుక దేవు డొక స్థిరనిశ్చయానికి వచ్చాడు.

అతడు లీలావతి మృతిక్షణంవరకు జీవిత భాగ్యభోగా లన్నీ యథేచ్ఛగా అనుభవించాడు ఆ ఆనందతన్మయతతో మైమరచి తదితర

విషయాల గోడే విస్మరించాడు. అయితే లీలావతి స్మృతితో అతని జీవితాని కొక బలమైన బల్లెపు పోటు నాటుకుంది. చూస్తూ ఉండగానే సమస్తము కలకరిగిపోతున్నట్టు స్ఫురించింది.

ఆ పైన మీద మీద విరుచుకుపడ నున్న సమర పరాజయ బీభత్సంలో అతనికి ఆ రాజ్యం, భాగ్యభోగాలు అన్నీ కేవలం మరు మరీచికలే అని తోచింది.

రాజ్యానికి వచ్చిన కొత్తలో అతడు విద్యా వయో వృద్ధుల వేదాంతోపదేశాలు, పౌరాణిక సూక్తులు వినక పోలేదు. కాని ఆ సమయంలో అవేవీ అతని చెవి కెక్కలేదు! లీలావతి స్మృతితో ఆ ఉపదేశాల అంతరార్థం అతనికి కొంతవరకు స్పష్టపడింది. నేడో రేపో పెను ప్రళయమై విరుచుకుపడ నున్న మహా యుద్ధ బీభత్సంలో ఆ వేదాంతోపదేశా లతని కళ్ళ కెదురుగా భీకర శిలాక్షరాలై నిలిచాయి!

తా నెవరో! నిత్యము మహానదీ ప్రవాహంలా పరవళ్లు దొక్కుతూ మున్ముందుకు సాగిపోయే జీవిత పరమార్థ మేమో! నిరంతర ద్వంద్వాలై భాసించే జీవన మరణాలకు, సుఖదుఃఖాలకు, లోలోపల అనుస్యూతమై వెలిగే పరమ రహస్య మేమో!

ఆ విధమైన మథన క్షణక్షణము అతని అంతరాంతరాలలో ఎలుగెత్తి ఘోషించింది.

కాని అమరుకుని కా మథన సమన్వయించే మార్గ మేదీ కనబడ లేదు. కాని ఆ సందేహా లతన్ని పట్టుకుని వేధించడం మానలేదు. ఇక గత్యంతరం లేక అతడు నిరంతర మదిరాపానంతో మత్తెక్కి మైమరిచాడు!

ఒకనాటి సాయంకాలం వేళ రాజ్యవర్ధను డెంతో ఆత్రంగా అతని దగ్గిరికి పరుగెత్తుకు వచ్చాడు:

"మహాప్రభూ! శత్రువులు పురద్వారం సమీపిస్తున్నారు! వారి అపార సేనావాహిని ఎంతో ఎవరూ లెక్క పెట్టలేక పోతున్నారు!"

మహామాత్యు డలాగే తెల్లబోయి నిలుచున్నాడు. అమరుకు డతని భయోద్వేగం గమనించి గట్టిగా గర్జించాడు:

"ఈ యుద్ధంలో నేనే స్వయంగా సేనాధిపత్యం వహిస్తున్నాను. రణభేరి మోగించి సైన్యా లన్నిటికీ జైత్రయాత్ర ఘోషించండి! ఆలస్యా దమృతం విషం! కదలండి! అలాగ నిర్ఘాంతపోయి చూస్తారేమిటి?"

రాజ్యవర్ధను డొక్క అంగలో అక్కడినించి కదిలి వెళ్ళిపోయాడు. అమరుకు డా విధంగా కళ్ళు మూసుకుని యుద్ధరంగంలో కురకగలడని అత డెన్నడూ ఊహించలేదు! తీరా యుద్ధ ప్రళయమే ముంచుకు వస్తే, మహా రా జేదో విధంగా సంధిమార్గం అవలంబించకపోడని అతని నమ్మిక! నిత్యము భోగలాలసతోను, అలసతతోను మైమరచిన అత డావిధంగా కళ్ళు మూసుకుని రణరంగంలో కురకగలడని మహామాత్యుడు కలనైనా ఊహించలేదు! ఇప్పు డతని ఊహా లన్నీ పట్టి అపోహలై ఎగిరిపోయాయి!

మహామాత్యు డమరుకునికి శత్రుసైన్య వార్త వినిపించేసరికి సాయం కాలం గోధూళివేళ సమీపించింది.

ఆ రోజుల్లో రాత్రివేళ యుద్ధం ధర్మసమ్మతం కాదు. అందుచేత మాళవ విపక్షసైన్యాలు రెండూ ఆ మరునాటి ఉదయం ప్రారంభించబోయే మహాయుద్ధాని కువ్విళ్ళూరుతూ మహోత్సాహంతో ఎదురు చూస్తున్నాయి.

అమరుకు డానాటి రాత్రి అంతా మేలుకునే ఉన్నాడు. సైన్యాధిపతు లందరికీ ఆయా సమయాలలో అనుసరించవలసిన యుద్ధ పద్ధతులు, వ్యూహరచనలు వేర్వేరుగా వివరించి బోధించాడు. వా రంతా అతని అచంచల ధైర్యమూ, వ్యూహరచనా నైపుణి చవిచూచి నిర్ఘాంత పోయారు. అతని ధైర్యోత్సాహాల ధోరణి చూడగానే వారికి కూడా కొండంత ధైర్యం కలిగింది. శత్రువు లెంత సైన్యంతో దండెత్తి వచ్చినా వారిని జయించి తీరగలమన్న గుండె నిబ్బరం కలిగింది.

ఆ మరునాటి ప్రాతఃకాలం వేళ రణభేరి బీభత్సంగా మారు మోగింది. అమరుకు డొక మా రంతఃపురం వైపు వెళ్ళాడు. అతని యోధ వేషంచూచి రాణులందరూ చుట్టూ గుమిగూడారు. అమరుకదేవుడు కొంతసే పందరితోను అంటీ అంటనట్లుగా ఇష్టాగోష్ఠి జరిపి వెనువెంటనే అక్కడి నుంచి కదిలి వెళ్ళి పోయాడు. అతని ఛలోక్తుల ధోరణిని బట్టి రాణులు

మహారాజెంతో ఉల్లాసంగా ఉన్నాడని గ్రహించారు. యుద్ధంలో మాళవదేశానికే దిగ్విజయం కలగ గలదని నిశ్చయించారు. అయినా దిగ్విజయం కోరుతూ గృహదేవత లందరికీ బలులర్పించి పూజాపురస్కారాలు చేయించారు.

# 8

ప్రయాణ రణభేరీధ్వని గంభీరంగా మారుమోగింది. అమరుక దేవుడు క్షణంలో తన ఉత్తమాశ్వంపై కెక్కి కూర్చున్నాడు. తిరిగీ రణభేరి గంభీరంగా మారుమోగింది. మాళవ సైన్యాలన్నీ యుద్ధరంగాని కురకలు వేసుకుంటూ పరుగులు పెట్టాయి. భేరీ ధ్వనులు అదే పనిగా మారుమోగుతున్నాయి. అమరుకు డొక్కమారు వెను తిరిగి చూచాడు. ఒక్క వేడి నిట్టూర్పు విడిచిపెట్టాడు. లీలావతి రాజ ప్రాసాదంపై నిలబడి అతని వైపు రెప్పపాటు లేకుండా తిలకిస్తున్నట్టు కనబడింది. అమరుకుడు మళ్ళీ ఇంకొకమారు పరిశీలనగా చూచాడు. ఉత్తరక్షణంలో అది కేవలం భ్రాంతిమాత్రమే అని స్పష్టపడింది. అతని చెక్కిళ్ళపై రెండు కన్నీటి బిందువులు దిగజారాయి.

ఆ స్మరణతో అతనికి రణరంగంలో కురికి వీరస్వర్గం చూరగొనవలెనన్న సంకల్పం మరింత బలపడింది. తనకు, తన రాజ్యానికి ఆ క్షణంతో ఋణం తీరిపోయిందని స్ఫురించింది.

అమరుక దేవుడు రణభేరీ కోలాహలంతో యుద్ధరంగంవైపు సాగిపోతూంటే రాజవీథులలో ప్రాసాదాలపై నిలబడిన పుణ్యపురంధ్రులతనిపై లాజపుష్పవర్షం కురిపించారు. ప్రాచీనకాలంలో జైత్రయాత్రకు బయలుదేరే మహారాజులపై పేలాలు వెదజల్లి ఆశీర్వదించడం ఒక అనూచాన సంప్రదాయం. ఆ సంప్రదాయం ప్రకారమే రాజధానిలోని పుణ్యకాంతలందరూ అమరుకదేవుని శిరస్సుపై లాజలతో కలిపిన ఆశీర్వర్షం కురిపించారు.

మహారాజా పుణ్యపురంధ్రులందరికి సవినయంగా చేయెత్తి నమస్కరించాడు. ఆ క్షణంలో ఆ మహానగర రాజవీథులు మరి తన కంటబడవని అతనికి స్ఫురించింది.

మళ్ళీ అతని హృదయంలో పూర్వ స్మృతులన్నీ వరుసగా పురి విప్పి నృత్యంచేశాయి. ఆ మహానగరంలో తన జీవితం అంతా ఒక లిప్తలో గడిచి అదృశ్యమై పోయిన ట్లతనికి తోచింది. అత డొక్క నిట్టూర్పు విడిచి దిగ్భ్రాంతభావంతో అలాగే ముమ్ముందుకు సాగిపోయాడు. తన పూర్వ జీవితానుభూతులన్నీ పూర్తిగా విస్మరించివెయ్యాలని నిశ్చయించు కొన్నాడు. కాని ఒక్క లీలావతి స్మృతి మాత్రం అతని హృదయంలో నీడలా కదలాడడం మానలేదు.

సరీగా అదే సమయంలో విదర్భదేశసైన్యం ఒక్కుమ్మడిగా మాళవసైన్యంమీద విరుచుకుపడింది. దానితో మాళవసైన్యంలో అంతటా ఒక పెద్ద కోలాహలం చెలరేగింది. ఆ ధాటి కాగలేక మాళవసైన్యం కొంత సేపు వెనకంజ వేసింది.

అమరుకు డెలుగెత్తి తన సైనికులందరికి హెచ్చరిక చేశాడు. విజయమో వీరస్వర్గమో తప్ప మరి మధ్యమార్గ మేమీలేదని హుంకరించాడు. కళ్లు మూసుకుని తానే ముమ్ముందుగా శత్రువ్యూహంలో చొరబడ్డాడు.

మాళవ సైనికు లాతని ధైర్యసాహస పరాక్రమాలు చూచి నిర్ఘాంత పోయారు. మళ్ళీ మహోత్సాహంతో విదర్భ సైన్యం లోలోపలికి చొచ్చుకుపోయారు. శత్రుసైనికులు వారి ధాటి కాగలేక చెల్లాచెదరై పారిపోయారు.

మాళవ సైన్యంతో పోలిస్తే విదర్భసైన్యం చాలా పెద్దది. మాళవ సైనికు లల్పసంఖ్యాకులయినా ధైర్యోత్సాహాలతో వీరవిహారం చేశారు. అపారపారావారంలా విస్తరించిన విదర్భసైన్యం మాళవసైన్య వీరవిహార ధాటి కెదురొడ్డి నిలబడలేక చెల్లాచెదరై పారిపోయింది. విదర్భ సేనాధిపతు లందరికీ అది ఒక పెద్ద తలవంపయింది.

ఆ సైన్యాధిపతు లా అవమానం భరించలేక తమ సైన్యాల నొక్క చోట చేర్చి అనేక విధాలుగా ప్రోత్సహించారు. కళ్ళు మూసుకుని మళ్ళీ మాళవ సైన్యంతో తలపడవలసిందని ప్రోత్సహించారు. అటుపిమ్మట గోధూళివేళ వరకు ఉభయసైన్యాలకు ఘోరయుద్ధం జరిగింది.

ఆ ఘోర యుద్ధంలో మాళవసైన్యంలో మరణించినవారి సంఖ్య

క్షణక్షణానికీ పెరిగిపోయింది. క్రమంగా మాళవ సైన్యాధిపతులందరికీ విజయాశ సన్నగిల్లింది. అయినా అమరుకదేవు డంతటితో నిరుత్సాహపడ లేదు. ముందు వెనకలు చూడకుండా కళ్ళుమూసుకుని శాత్రవసైన్యంలో చొరబడ్డాడు. శత్రుసైనికులా అదను కనిపెట్టి ఒక్కుమ్మడిగా అతనిమీద కురికారు. అమరుకుడు వారిలో చాలామందిని హతమార్చి వేశాడు.

కాని ఆ సంకుల సమరంలో అతని శిరస్సుపై ఒక పెద్ద గదాఘాతం తగిలింది. ఆ ఆఘాతానికి తట్టుకోలేక అత డలాగే తన అశ్వంమీద కూల బడిపోయాడు.

అమరుకదేవుని కా తరవాత బాగా స్పృహ తప్పిపోయింది.

అది కనిపెట్టి మాళవసైన్యాధిపతు లతనికి సహాయం చెయ్యడం కోసం శాయశక్తులా ప్రయత్నించారు.

అమరుకదేవునికి మరి ఆనాటి అర్ధరాత్రి వరకు స్పృహకలగ లేదు. తిరిగి స్పృహ కలిగి కొంచెం కళ్ళు తెరిచి చూసేసరికి ఆతనికి తన పరి సరాలన్నీ అత్యద్భుతంగా కనిపించాయి. కొంతసేపటివరకు అత డని మరి ఒక లోకమేమో అని భ్రమపడ్డాడు. అతని కనతిదూరంలో ఒక సన్నని దీపం వెలుగుతూంది. చుట్టూ యుద్ధకోలాహలం కొంచెమైనా వినబడ లేదు. అంతా ప్రశాంతంగానే కనిపించింది. అత డొకమారు లేచి కూర్చుని నాలుగువైపులా పరకాయించి చూడాలని అనుకున్నాడు. కాని శరీరం స్వాధీనం కాలేదు. తన కేసి చూసుకొన్నాడు. ఒళ్ళంతా గాయాలే! కట్లే! అప్పటి కతనికి తన పరిస్థితి కొంతవరకు బోధపడింది.

అంతలో కింశుకప్రభ గుడ్డ నీరుగుక్కుకుని అతని కెదురుగా వచ్చి నిలబడింది. అమరుకు డామెవైపు చూచి క్షీణస్వరంలో ప్రశ్నించాడు:

"యుద్ధరంగంలోంచి నన్నిక్కడి కెవరు తీసుకు వచ్చారు! మన సైన్యాలేమైపోయాయి?"

కింశుకప్రభ గద్గదస్వరంతో సమాధానం ఇచ్చింది:

"తాము రణరంగంలో మూర్ఛపోయారు! దైవవశాత్తు అప్పటికి సూర్యాస్తమయ మయింది.

"మన సైన్యాధిపతులు మిమ్మల్ని క్షేమంగా శిబిరానికి తీసుకు వచ్చారు."

కింశుకప్రభ సంగ్రహంగా యుద్ధరంగంలో జరిగిన విశేషా లతనికి తెలియజేసింది. శత్రు మధ్యంలో చిక్కుపడి మూర్ఛపోయిన అమరుక దేవుని సంరక్షణ మాళవ సైనికులకు మొట్టమొదట దుష్కరంగానే తోచింది. అయినా అతికష్టంమీద వా రతని నెలాగో అలాగ సంరక్షించి సురక్షితంగా మాళవ సేనాస్కంధావారానికి చేర్చారు.

ఆటుపిమ్మట రెండుమూడు రోజులవరకు మాళవ విదర్భ సైన్యాల మధ్య ప్రచండయుద్ధం చెలరేగింది. అప్పటికి అమరుకదేవునికి కొంత స్వస్థత కలిగింది. కాని రాజ్యవర్ధను డతనిని తిరిగి యుద్ధరంగంలోనికి పోనీయలేదు. సంపూర్ణారోగ్యం కలిగేవరకు మహారాజు మరి యుద్ధరంగం వైపైనా చూడరాదని రాజవైద్యు లాదేశించారు. అమరుకుని కింకా పూర్ణారోగ్యం కలగలేదు. అందుచేత అత నిక రాజవైద్యుల ఆదేశం శిరసావహించక తప్ప లేదు.

అయినా అతడు యుద్ధపరిస్థితులన్నీ అతి జాగరూకతతో గమని స్తూనే ఉన్నాడు. అప్పటికి యుద్ధం ప్రారంభించి అయిదారు రోజు లయింది. క్రమక్రమంగా మాళవ సైన్యం ధైర్యోత్సాహాలు నీరసిం చాయి. మాళవ సైన్యాధిపతులందరు ఏదోవిధంగా సామరస్యమార్గం అవలంబించడమే మంచిదని మహారాజుతో విన్నవించారు. అమరుకుని కది మహావమానంగా తోచింది.

"ఈ పరిస్థితిలో సామరస్య పద్ధతి ఏదీ లేదు! విదర్భాధిపతి కేవలం పగతీర్చుకోవడానికే మనపై దండెత్తి వచ్చాడు. మనంచేసిన దానిలో క్షత్రియ ధర్మవిరుద్ధమయినది అణువంతయినా లేదు. ఇంతకీ మన తప్పే ముంది? సామరస్యమార్గం అవలంబించవలసినది వారే కాని మనం కాదు!"

మంత్రులకు, సైన్యాధిపతులకు అతని మాటలలోని ఔచిత్యం గోచరించకపోలేదు. మహామాత్యుడు రాజ్యవర్ధనుడుకూడా ఆ పరిస్థితిలో అంతకన్న చేయగలిగిందేమీ లేదని అంగీకరించాడు. దానితో సైన్యాధిపతు లందరూ తలలువంచుకొని నిష్క్రమించారు.

తిరిగి మాళవ విదర్భ సైన్యాలమధ్య భీకర సమరం ప్రారంభ మయింది. అమరుకు డనుక్షణము యుద్ధధోరణి జాగ్రత్తగా పరిశీలిస్తూనే ఉన్నాడు. ఆనాడు మాళవసైన్యం చెల్లాచెదరై తిరిగివచ్చింది. ఆ మరు నాటితో మాళవసైన్యానికి సంపూర్ణ పరాజయం తప్పదని అందరూ నిరాశ చేసుకున్నారు.

అమరుకు డానాటి రాత్రి అంతా మేలుకొనే ఉన్నాడు ఆ మరునా డవసరమైతే తానే యుద్ధరంగంలో కురికి వీరస్వర్గం చూరగొనా లని నిశ్చయించాడు.

అప్పటి కర్ధరాత్రి గడచింది. అమరుకుడు తన రాజప్రాసాదంలో పై అంతస్తులో కూర్చుని శత్రుసైనికుల గుడారాలవైపు చూస్తున్నాడు. దూరదూరంగా యుద్ధరంగంలో మరణ శయ్యలపైపడి దీనంగా ఆక్రోశించే సైనికుల దారుణ రోదన ధ్వను లతని కర్ణ కుహరాలలో మారుమోగాయి. ఆ ఆక్రందన ధ్వనులతో జంబుకాక్రందనాలు మరింత విజృంభించాయి. అతనికి జీవితం అంతా కేవలం బీభత్సమయంగా కనిపించింది. అత డా భయంకరార్త నాదాలన్నీ వింటూ కూర్చున్నాడు. ఒక మా రతని హృద యంలో, ప్రశాంతంగా కన్ను మూసిన లీలావతి ముఖం ప్రతిబింబించింది. అమరుకుని నేత్రాంతాలలో కన్నీటి బిందువులు నిలిచాయి.

ప్రపంచంలో అంతటా గాఢాంధకారం! అతని హృదయంలో అంతకన్నా గాఢాంధకారం! అమరుకుని హృదయంలో మళ్ళీ ఆందోళన ప్రారంభమయింది! కాని ఆ భయంకర పరిస్థితిలో అతని కేమీ తోచలేదు. ఆందోళనపూరితమై అలసి సొలసిన అతని హృదయంలో ఒక హెచ్చరిక గంభీరంగా మారుమోగింది. అత డది శ్రద్ధగా ఆలకించాడు:

"తత్త్వమసి!
తత్త్వమసి రాజన్!"
"రాజా! నీవా పరమాత్మ స్వరూపుడవు సుమా!
నీవాపరమాత్మ స్వరూపుడవు సుమా!"

ఆ హెచ్చరిక అర్థం అది! అతడు మళ్ళీ మళ్ళీ ఆ హెచ్చరిక విన్నాడు! అంతటి అర్ధరాత్రి సమయంలో ఆ హెచ్చరిక ఎక్కడి నించి బయలుదేరినదో అతని కంతుబట్టలేదు!

అతడు నాలుగు వైపులా గాలించి చూచాడు. దూర దూరంగా రాజ వీధిలోఅంతటా ఆ హెచ్చరిక మాటిమాటికీ అదే తీరులో ప్రతిధ్వనించింది! అనేక గాత్రా లేకమై ఒకే కంఠస్వరంతో ఉచ్చరించినట్లది మారు మోగింది!

భిక్షుకు లెవరో ఆ విధంగా గొంతెత్తి అరుస్తున్నారని అతని కను మానం వేసింది. కాని ఆ గంభీర నాదంలో అతని కెక్కడా యాచకదైన్యం గోచరించలేదు!

ఆ హెచ్చరిక వినగానే అతని హృదయంలో ఒక మహా సముద్ర మేదో ఉప్పొంగినట్లయింది. హఠాత్తుగా తన్నెవరో వెన్ను చరిచి మేలు కొలిపినటులు విచిత్రానుభూతి కలిగింది. క్రమక్రమంగా అతని హృద యంలో ఒక పెద్ద ఆరాటం ప్రారంభమయింది. కాని ఆ ఆరాటానికి గల మూలకారణ మేమో అతనికే తెలియలేదు!

ఆ హెచ్చరిక సవ్వడు లతని కేవో పూర్వజన్మలో పరిచితమయిన కంఠస్వరాలలాగే వినిపించాయి. కాని అతని కవి స్పష్టంగా గుర్తుకు రాలేదు! అమరుకు డలాగే ఆలోచిస్తూ కూర్చున్నాడు. తెల్ల తెల్లవారే వేళ దగ్గిరపడింది. కాని అంధకారచ్ఛాయ లింకా బాగా విడిపోలేదు.

అంతలో నెమ్మది నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ కింశుకప్రభ అతని దగ్గిరికి వచ్చి నిలబడింది. ఆమె అందెల సవ్వడివిని అమరుకదేవు డామె వైపు చూచి నెమ్మదిగా ప్రశ్నించాడు:

"కింశుకప్రభా! ఆ హెచ్చరిక సవ్వడి విన్నావా? అదిగో విను!"

అతడు తిరిగి ఏకాగ్ర హృదయంతో ఆ సవ్వడి విన్నాడు. కింశుక ప్రభకు కూడా ఆ ధ్వని వినిపించింది.

"అవును! కాషాయాంబరధారు లయిన యతీశ్వరు లెవరో ఆ విధంగా హెచ్చరిస్తూ వెళ్ళిపోతున్నారు! అదుగో!"

కింశుకప్రభ వేలెత్తి వారివైపు చూపించింది. అమరుకుడు లేచి నిలబడి ఆ వైపుగా చూచాడు. మసక మసక చీకటిలో అతనికి వారి ముఖాలేవీ స్పష్టంగా కనిపించలేదు. కంఠధ్వనులు మాత్రం తిరిగీ గంభీరంగా మారుమోగాయి. వారొక గడియ వరకు నిర్విరామంగా అలాగే గొంతెత్తి హెచ్చరించారు. అంతలోనే ఒక వీధి మలుపులో పడి అదృశ్యులయినారు. అమరుకదేవు డెంతో ఆత్రంగా కింశుకప్రభ కేసి చూచాడు:

"వారి నందరినీ ఒక్కమారు కళ్ళారా చూడవలె నని ఉన్నది. వారికి నా విన్నపం తెలియజేసి తెల్లవారగానే ఒక్కమా రిక్కడికి తోడు కొని రాగలవా?"

ఆ ప్రార్థన విని కింశుకప్రభ ఆశ్చర్యపోయింది.

"దీని కంత ప్రాధేయపడవలసిం దేమి ఉంది? తమ సంకల్పం విన గానే వారంతట వారే ఇక్కడికి వస్తారు. తెల్లవారగానే వారినందరినీ తమ సన్నిధికి తీసుకు వస్తాను. సరికదా! ఇదిగో ఇప్పుడే వెళ్ళిపోతు న్నాను."

ఆమె వెంటనే అక్కడి నుంచి వెళ్ళిపోయింది. క్రమక్రమంగా బాగా తెల్లవారింది. రణరంగంలో మళ్ళీ భయంకర భేరీ నినాదా లొక్కొక్కటిగా మారుమోగాయి. అది విని అమరుకు డొక ప్రతిజ్ఞ పట్టాడు:

"ఆ యతీశ్వరుల దర్శనం చేసి వెంటనే రణరంగానికి వెళ్ళి పోతాను! ఈనాటితో ఈ మహాసంగ్రామం అటో ఇటో తేలిపోతుంది! అంతే!"

క్రమక్రమంగా యుద్ధభేరీ ధ్వని భూనభోంతరాళాలు దద్దరిల్లేటట్లతి బీభత్సంగా మారుమోగింది!

# 10

ప్రాతఃకాల సూర్యోదయ కాంతి మాళవ రాజధాని అంతటా బంగారు రంగవల్లులు తీర్చి దిద్దింది. దూర దూరంగా మారుమోగే రణభేరీధ్వని క్రమ క్రమంగా సింహద్వారం సమీపించింది.

అమరుకదేవుడు యోధవేషం ధరించి, ఏ క్షణంలోనైనా యుద్ధరంగంలో కురకడానికి సిద్ధంగా నిలబడ్డాడు. కొలువుకూటంలో ప్రవేశించి, వేగులవారు చెప్పిన యుద్ధవార్త లోకటోకలే శ్రద్ధగా ఆలకించాడు. అతని శరీరంమీది రణవ్రణాలింకా కళుకు కళుకుమని వేధిస్తూనే ఉన్నాయి. కాని యుద్ధ వ్యగ్రమైన అతని హృదయంలో ఆ వేదనే స్ఫురించలేదు!

అనుక్షణమూ వేగులవారతని సన్నిధికివచ్చి మాళవసైన్యాల జయాపజయాలు నివేదిస్తూనే ఉన్నారు. ఒకమారు మాళవసైనికులు శత్రుసైనికులను రాజధాని పొలిమేరవరకు తరిమివేశారు! ఇంకొకమారు విదర్భసైనిక లొక్కుదూకులో శత్రుసైన్యం అంతా మాళవ రాజధాని సింహద్వారంవరకు నెట్టివేశారు. ఇంకొక క్షణంలో శత్రుసైన్యం మాళవ రాజధానిలో ప్రవేశించవలసిందే! కాని అంతలోనే మాళవ సైనికులు తమ ప్రాణా లెదురొడ్డి శత్రుసైన్యాని కడ్డకట్టగా నిలుచున్నారు!

ఇక ఆలస్యం చెయ్యకుండా వెనువెంటనే యుద్ధరంగంలో కురికి తన సేనానాయకులకు, సైనికులకు ప్రోత్సాహం కలిగించాలని అమరుకదేవు డనుక్షణమూ ఉవ్విళ్లూరుతూనే ఉన్నాడు. అయితే ఒక్కమారు యతీశ్వరుల సందర్శనానందము, వారి ఆశీర్వచన భాగ్యము పొంది ఉత్తర క్షణంలో కళ్ళు మూసుకొని రణరంగంలో కురకాలని అతని సంకల్పం!

యతీశ్వరుల నందరినీ వెంటబెట్టుకుని ఒకక్షణంలోనే తిరిగి వస్తానని చెప్పి వెళ్ళిన కింశుకప్రభ ఇంకా అతని సన్నిధికి రాలేదు. అత డామె రాకకోసం ఎంతో ఆత్రంగా ఎదురు చూస్తూ నిలుచున్నాడు. అంతలో రాజ్యవర్ధను డతి వినయంగా అతని సన్నిధికి వచ్చి నిలబడ్డాడు:

“మహాప్రభూ! శత్రు సైనికులు నగరద్వారం సమీపించారు! ఘోరంగా పోరాడుతున్నారు. అయినా మన సైన్య మేమీ తీసిపోలేదు.

చిట్ట చివరికి జయలక్ష్మి మనదే! కనుక తా మిక స్వయంగా యుద్ధరంగంలో కురకవలసిన అవసరం నాకేమీ కనిపించడంలేదు! అదీగాక తమ రింకా కొంచెం విశ్రమించడం అవసరమని రాజ వైద్యులు విన్నవిస్తూనే ఉన్నారు! ఆపైన తమ చిత్తం!"

ఉనూరుమని మహారా జొక నిట్టూర్పు విడిచిపెట్టాడు. అతని సంకల్పం ఆ క్షణానికి కొంతవరకు మారిందని మహామాత్యుడు గ్రహించు కొన్నాడు. మారు మాటాడకుండా నెమ్మదిగా అక్కడినించి వెళ్ళి పోయాడు.

మహారాజు స్వయంగా యుద్ధ రంగంలో కురకడం మహామాత్యునికి మొట్ట మొదటినించి ఇష్టంలేదు. ఇప్పు డది మరింత బలపడింది. రాజ్య వర్ధను డేదో మిష పెట్టి మహారాజు స్వయంగా యుద్ధ రంగంలో కురక కుండా అడుగడుగునా అడ్డు తగులుతూనే ఉన్నాడు!

మొట్టమొదట అమరుకదేవు డది ఆత్మక్షేమంకోసమే జరిగిందని అనుకోకపోలేదు. కాని క్రమక్రమంగా ఆ విషయంలో అతనికేదో సందేహం పట్టుకుని పీడించింది. రాజ్యవర్ధను డిటీవల మంత్ర తంత్ర శాస్త్రజ్ఞులతో జేరి మంతనా లారంభించాడు. అది చూచాయగా అమరుక దేవుని చెవిని పడింది.

అదికూడా తన క్షేమారోగ్యాల కోసమే అయి ఉండవచ్చునని అమరుకదేవు డొకప్పు డనుకున్నాడు. కాని ఆ విషయంలో ఇప్పు డతని కేదో పెద్ద అనుమానమే కలిగింది. అదే ఆలోచిస్తూ అత డొక క్షణం నే పలాగే నిలుచున్నాడు.

మళ్ళీ యుద్ధభేరీ భైరవధ్వని గంభీరంగా అతని కర్ణకుహరాలలో మారు మోగింది. అత డిక కింశుకప్రభకోసం ఎదురు తెన్నులు చూస్తూ నిలబడలేక పోయాడు. వెంటనే రణరంగానికి బయలుదేరి వెళ్ళిపోవాలని అనుకొన్నాడు. అంతలో కింశుకప్రభ తొందర తొందరగా అతని సన్ని ధికి వచ్చి విన్నవించింది:

"మహాప్రభూ! నావల్ల కొంచెం విలంబనమే జరిగింది. మన్నిం

ఉండి! ఆ యతీశ్వరులను వెదికి పట్టుకోవడం కొంచెం కష్టమే అయింది. చిట్టచివరికి ఎలాగో అలాగ వెదికి పట్టుకున్నాను. వారంతా ఇప్పుడే తమ కొలువుకూటానికి విచ్చేయనున్నారు."

యతీశ్వరులంతా అక్కడికి రాగానే కింశుకప్రభ వారికి సవినయంగా నమస్కరించింది. ఎంతో మర్యాదచేసి ఆయా సుఖాసనాలపై కూర్చోవలసిందని ప్రార్థించింది. అమరుకదేవు డత్యంత భక్తిభావంతో వారందరికీ సాష్టాంగ నమస్కారాలు చేసి సవినయంగా చేతులు జోడించి నిలబడ్డాడు. కింశుకప్రభ అతని భక్తిప్రపత్తులు చూచి మొట్టమొదట కొంచెం ఆశ్చర్యపడుతూ నెమ్మదిగా అంతఃపురంలోనికి వెళ్ళిపోయింది.

యతీశ్వరు లెవ్వరూ తమ కేర్పరచిన సుఖాసనాలపై కూర్చోలేదు. అలాగే నిలబడి నిశ్చలదృష్టితో అమరుకుని ముఖవైఖరి పరిశీలించారు:

"తత్త్వమసి!

తత్త్వమసి! రాజన్!"

అందరూ ఒకే గొంతుతో నాలుగైదు మారు లెలుగెత్తి ఘోషించారు! ఆ ఘోష అమరుకదేవుని హృదయ కుహరంలో ప్రళయసాగర ఘోషే రేకెత్తించింది!

అమరుకదేవుడు వారందరి ముఖాలూ అతి జాగరూకతతో పరిశీలిస్తూ నిలబడ్డాడు. అతని హృదయంలో మళ్ళీ ఒక పెద్ద మథన ప్రారంభించింది! అందరూ అతని నుద్దేశించి "రాజా! నీ వా పరమాత్మ స్వరూపుడవే సుమా!" అని ఎలుగెత్తి హెచ్చరించారు!

"నే నెవరిని? నే నెవరిని? నే నమరుకదేవుడను కానా? కాకపోతే నా నిజస్వరూపమేమో! నే నా పరమాత్మస్వరూపుడనా? ఇది నిజమేనా? నే నమరుకుడను కానే కానా? అయితే నే నెవరిని? నే నెవరిని?"

అతని హృదయంలోని మథన క్షణక్షణానికీ ఆ విధంగా హెచ్చు పెరిగింది! మరికొంతసేపటి కమరుకదేవుని కేదో హఠాత్తుగా స్ఫురణకు వచ్చింది. ఇంకా కొంత సేపటి కతని హృదయంలో పూర్వవృత్తాంతం అంతా ఒక మెరుపులా మెరిసింది!

ఆ క్షణంవరకు అతని హృదయంలో ఉవ్వెత్తుగా ఎగిసిన సందేహ తరంగాలన్నీ పూర్తిగా అంతరించాయి. పెదవులపై చిరునవ్వులు పువ్వులు పూశాయి.

"తత్త్వమసి!
తత్త్వమసి! రాజన్!"

మళ్ళీ వారిందరి కంఠాలూ ఒక్కుమ్మడిగా మారుమోగాయి. వెంటనే ఆ యతీశ్వరులందరూ అమరుకదేవుని పాదాలకు ప్రణమిల్లి జయ జయ ధ్వానాలు చేశారు. అమరుకదేవుని పెదవులపై చిరునవ్వులాగే ఆరని తారకలా మెరిసింది. క్రమ క్రమంగా ఆ పూర్వస్మృతి అంతా అతని మనోనేత్రాల కెదురుగా సాక్షాత్కరించింది!

# 11

ఆచార్యశంకరుడు పద్మపాదాది శిష్యులతో కలిసి మాహిష్మతీనగరంలో మండనమిశ్రుని గృహ ప్రాంగణంలో అడుగు పెట్టాడు.

మండన మిశ్రుడు పూర్వ మీమాంసాశాస్త్రవేత్త. మహా విద్వాంసుడు. ప్రపంచలీల యావత్తూ కర్మాధీనమే అని అతని మతం. పూర్వ మీమాంసా శాస్త్ర సిద్ధాంతంకూడా అదే. యజ్ఞయాగాది కర్మలు, నిత్య నైమిత్తిక కర్మలు, పుణ్యకర్మలు ఆచరించేవారికి స్వర్గాదిలోకాలు కరతలామలకాలనీ, ఆ కర్మలే సర్వ శ్రేయోదాయకాలనీ ఆశాస్త్ర సిద్ధాంతం.

ఆచార్యశంకరుడు తన ఆసేతు హిమాచల యాత్రలో మీమాంసా వేత్త మండనమిశ్రుని విఖ్యాతకీర్తి విన్నాడు. తన శిష్యబృందంతో కలిసి స్వయంగా ఆ మహా విద్వాంసుని గృహాంగణంలో నిలుచున్నాడు.

మండనమిశ్రు డంతకు పూర్వమే ఆచార్యశంకరుని అద్వైత వేదాంత వాదం కొంతవరకు కర్ణాకర్ణిగా విన్నాడు. స్వయంగా అంతటి ఆచార్యశంకరుడే తన కతిథి దేవుడై అవతరించాడని విని ఎంతైనా సంతో

షించాడు. యతీశ్వర మర్యాదా గౌరవాదరాలతో ఆచార్యశంకరుని తోశా టలిథులందరినీ తన ఇవంతి కావ్వానించాడు.

శంకరుని అద్వైత వేదాంత వాదానికీ, పూర్వమీమాంసా సిద్ధాంతానికీ కొన్ని ముఖ్యమైన వివాద విషయాలున్నాయనీ, ఆ వివాదస్పష్టితోనే ఆచార్య ఇలిథిగా విచ్చేశాడనీ మండనమిశ్రుడు గ్రహించుకొన్నాడు. తన కింతకాలాని కాచార్య శంకరుని వంటి మహాపురుషునితో వాదించే భాగ్యం కలిగిందని మండనమిశ్రు డుప్పొంగిపోయాడు. తన పూర్వమీమాంసా సిద్ధాంతం ఇక ఆనాటినుంచి విద్వాంసులందరికి శిరోధార్యం కాగలదని ఆనందించాడు.

ఆ సమయంలో మండనమిశ్రుని ధర్మపత్ని ఉభయభారతి అతని దగ్గిరికి వచ్చి నెమ్మదిగా చెవిలో చెప్పింది:

"మీరేమో మీ శాస్త్రవాద బలంతో ఆచార్య శంకరుల నోడించాలని ఉవ్విళ్లూరుతున్నారు! కాని నా కా తేజోమూర్తిని సందర్శిస్తే అంతటి ధైర్యం కలగడంలేదు! ఒకవేళ మీరే ఆ వాదంలో పరాజితులై పోతే?"

మండనమిశ్రు డొక క్షణకాలం తన భార్యవైపు చూచాడు:

"ఒకవేళ నేనే కనక ఆ వివాదంలో పరాజయం పొందితే అద్వైత వేదాంత మార్గమే సర్వులకు శిరోధార్య మన్నమాట! వెంటనే సన్యసించి నే నాయన కంతేవాసినై వెళ్ళిపోతాను! అంతే! దీని కిక తిరుగులేదు!"

ఆ మాట విని ఉభయభారతి బాగా భయపడింది. అయినా పైపైకొక చిరునవ్వు నవ్వింది:

"ఒకవేళ ఆచార్య శంకరులే పరాజితులై పోతేనో?"

"ఆయన తమ సన్యాసాశ్రమం విసర్జించి తిరిగీ పూర్వమీమాంసా కర్మమార్గం చేపట్టి తీరవలసిందే!"

"కానీయండి! ఇంతకీ ఏమి జరగవలసి ఉందో, అదే జరుగుతుంది! బుద్ధిః కర్మానుసారిణీ!"

ఉభయభారతి ఉసూరుమని ఒక వేడి నిట్టూర్పు విడిచిపెట్టింది. మండనమిశ్రుడు మహా విద్వాంసుడు. అంతేకాక మహా సాహసి. ఇది శాస్త్ర సమ్మతమైన మార్గం అని నమ్మిక కలిగితే వెంటనే ఆ మార్గం అనుసరించడాని కాయన వెనకంజ వెయ్యడు! మాటలకు, చేతలకు మధ్య లేశమైనా విభేదం అంగీకరించని కర్మనిష్ఠుడు!

ఉభయభారతి ఆయన సన్నిధిని సర్వశాస్త్రాలు, షడ్దర్శనాలు అధ్యయనం చేసింది. మహా విద్వాంసురాలని అందరిచేతా మన్ననలందుకొంటున్నది. అంతటి విద్వాంసురాలే భర్త కిప్పుడొక మహావేత్తమూలాన పరాజయం రానున్నదని భయపడింది. కాని మండనమిశ్రు డటువంటి పరాజయభయ మేమీ లేదనీ, ఆచార్య శంకరుడే పరాజయం పొందగలడనీ అభయహస్త మిచ్చాడు.

శంకరాచార్య, మండన మిశ్రుల మధ్య శాస్త్రచర్చ జరగనున్నదని విని మాహిష్మతీనగర విద్వాంసులంతా మండనమిశ్రుని భవంతిలో గుమిగూడారు. మధ్యాహ్నం రెండు యామాలవేళ దాటి కొంచెం చల్లబడగానే శాస్త్ర చర్చ ప్రారంభమయింది. ఆచార్య శంకరుని ప్రియాంతేవాసి పద్మపాదాచార్యుడు, ఉభయభారతి, మరికొందరు శాస్త్రవేత్తలూ వారిద్దరి వాదోపవాదాలూ శ్రద్ధగా ఆలకిస్తూ మధ్యస్థ ధర్మం నిర్వహించారు. మొట్టమొదట ఛలోక్తులతోను, చమత్కారములతోను ప్రారంభమైన శాస్త్రచర్చ క్రమక్రమంగా గహనాతిగహనమైన శాస్త్ర విషయాలలోకి వెళ్ళిపోయింది. ఆచార్య శంకరు డత్యంత ప్రసన్నవదనంతో శాస్త్ర చర్చ సాగించాడు. ఆయనముఖంలో లవలేశమైనా విజిగీషాభావం గోచరించలేదు! మండనమిశ్రు డా మహాపురుషుని సౌజన్యము, సౌహార్ద్రము, సత్యనిష్ఠ చూచి నిర్ఘాంతపోయాడు! అత డింతకు పూర్వం ఎన్నెన్నో వాదోపవాదాలు సాగించాడు. ఎందరెందరో విద్వాంసులతో వాదించాడు. ఆ విద్వాంసులలో ఎంతసేపూ ఎదటివారిని ఓడించాలన్న తహ తహేగాని, సరియైన సత్యనిష్ఠ కనబడలేదు! ఆచార్య శంకరుని ధోరణి దానికి కేవలం విభిన్నంగా కనిపించింది!

ఇంచుమించుగా సాయంకాలం గోధూళి వేళ వరకు శాస్త్రచర్చ

కొనసాగింది. అంతవరకు మండనమిశ్రుడు తన శాస్త్ర పాండిత్యంలో స్వయంగా ఆచార్య శంకరుని మన్ననలే అందుకొన్నాడు! కాని క్రమ క్రమంగా మండనమిశ్ర పండితుని వాదబలం క్షీణించింది. చిట్టచివరకు ఉభయభారతితో సహా అందరూ ఆచార్య శంకరుని వాదమే వేదశాస్త్ర సమ్మతమని అంగీకరించారు. కాని మండనమిశ్రు డెక్కడా చలించలేదు! వెనువెంటనే సన్యాసాశ్రమం స్వీకరిస్తున్నానని సదస్యులందరికీ తన అచంచల సంకల్పం తెలియజేశాడు!

అంతలో ఉభయభారతి లేచి నిలబడి ఆచార్య శంకరునికి, మధ్యస్థులకు సవినయంగా నమస్కరించి విన్నవించింది:

“నాదొక్క మనవి! ధర్మపత్ని పురుషుని అర్ధాంగి అని మన శాస్త్రవేత్త లుద్ఘోషిస్తున్నారు. అందుచేత నన్ను కూడా శాస్త్రవాదంలో జయించే వరకు ఈ విజయం సంపూర్ణ విజయం కాజాలదని మనవి! ఆపైన తమ చిత్తం!”

ఆమెవాదం విని ఆచార్య శంకరుడే ఔనానన్నట్టలవోకగా శిరఃకంపం చేశాడు. ఆయనే ఔనని అంగీకరించినప్పు డిక మధ్య విద్వాంసుల కడ్డుచెప్పడానికి మనసొప్పలేదు. అదీగాక వారికికూడా ఆమె ఆశంక న్యాయ్యమేనని తోచింది. మండనమిశ్రుడు మరి సమాధానం చెప్పలేక తల వంచుకొని కూర్చున్నాడు.

మళ్ళీ ఉభయ భారతీ శంకరాచార్యుల మధ్య శాస్త్రవివాదం చెలరేగింది.

ఆమె మండనమిశ్రుడు తొక్కిచూడని నూతన మార్గాలలో మీమాంసా శాస్త్రచర్చ ప్రారంభించింది. క్రమక్రమంగా ఆ చర్చ అనేక శాస్త్ర సంప్రదాయ మార్గాలలో కొనసాగింది. మరి కొంతసేపటి కది గృహస్థధర్మం మీదికి తిరిగింది.

ఉభయ భారతి కంతవరకు ఆచార్య శంకరుని పరాజయం సాధ్యం కాలేదు! ఆచార్య శంకరుడు భారత వర్షంలో అంతటా దిగ్విజయ యాత్ర చేసి అద్వైత మత ప్రతిష్ఠాపనాచార్యుడని ప్రసిద్ధి వహించాడు. మండన

మిశ్రుని వంటి మహా విద్వాంసునికే ఆచార్య శంకరుని పరాజయం సాధ్యం కాకపోతే ఇక ఉభయభారతి మాత్రమేమి చెయ్యగలదు?

కొంతసేపటి కామె కొక ఉపాయం తట్టింది. ఆలోచించి ఆలోచించి తన వాదోపవాద సూళిలో కామశాస్త్ర ప్రస్తావన చొప్పించి దానిపై ఒక వివాదం లేవదీసింది. ఆ వివాదానికి సమాధానం ఇస్తే ఆచార్య శంకరు డాజన్మ బ్రహ్మచారి అన్న ప్రతిష్ఠకే భంగం కలుగుతుంది!

సమాధానమే ఇవ్వకపోతే మధ్యస్థ విద్వాంసు లాచార్యు డా వాదంలో ఓడిపోయినట్లే నిర్ణయిస్తారు! ఆ విషమసంధిలో ఆచార్య శంకరుడు కేవలం మౌనం వహించి మాట్లాడ కూరకున్నాడు. మధ్యస్థ విద్వాంసులు కేమీ పాలు పోలేదు. వారిలో వారు కొంతసేపు గుసగుస లాడుకొన్నారు.

అది కేవలం గృహస్థ ధర్మానికి సంబంధించిన ప్రశ్న. ఆచార్యు డాజన్మ బ్రహ్మచారి. అందుచేతనే ఆచార్యుని పరాజయం నిర్ణయించు డానికి మధ్యవర్తు లంగీకరించలేదు. అయితే ఆరుమాసాల వ్యవధిలో నైనా ఆచార్యు డుభయభారతి ప్రశ్నకు సమాధానం చెప్పాలని అందరూ ఏకగ్రీవంగా నిర్ణయించారు. ఆచార్యుడు పరశరీరప్రవేశవిద్యావేత్త. ఆ విధంగా కొంత అనుభూతిపొంది, ఉభయభారతి ప్రశ్న కుచితమయిన సమాధానం ఇస్తే తన బ్రహ్మచర్య నిష్ఠకే లోపమూ రాదు. ఆ క్షణంలో ఆచార్య శంకరుని కదే సముచితమయిన మార్గమని స్ఫురించింది.

అంతటితో ఆ వాదోపవాదా లలాగే నిలిచిపోయాయి. తాత్కాలికంగా నైనా మండనమిశ్రునికి సన్యాసయోగం తప్పించినందు కుభయ భారతి నందరూ అభినందించారు. ఆచార్యుడు పద్మపాదాది శిష్యులతో కలిసి తిరిగే దిగ్విజయ యాత్ర కుపక్రమించాడు. ఆరుమాసాల అవధికి పూర్వమే మళ్ళీ మాహిష్మతీ నగరం చేరుకోగలనని మండన మిశ్రునికి వాగ్దానం చేశాడు.

"ఆచార్యపాదులు సర్వజ్ఞులు! అంతటి మహామేధావికి తుచ్ఛమయిన కామశాస్త్ర రహస్యం ఒక లెక్కా! అయితే కేవలం లోకధర్మ సంగ్రహం కోసమే ఆచార్యు లీ మార్గం అవలంబించి ఉండవచ్చును!"

ఇది శిష్యులందరూ ఆచార్యుని సంకల్పాని కొనియాడగా భాష్యాలు రచించుకొన్నారు. మారు మాటాడక ఆచార్యుని అడుగు జాడలలో పడి నడిచి వెళ్ళిపోయారు.

పది పదిహేను రోజులలో వారందరూ మాళవరాజ్య సమీపారణ్యం చేరుకొన్నారు.

ఆచార్యుని కా ప్రాంతంలో సింహం పంజాదెబ్బతో నిర్జీవమైపోయిన అమరుక భూపతి శరీరం కనిపించింది. పరశరీర విద్యా ప్రభావం వినియోగించి వెంటనే శంకరుడా శరీరంలో ప్రవేశించాడు. తన శరీరం ఒక గుహలో ఉంచి జాగ్రత్తగా సంరక్షించ వలసిందని శిష్యులందరికీ ఆజ్ఞాపించాడు. ఆ శరీరానికేదైనా మహా ప్రమాదం ఏర్పడితే వెంటనే తనకా విషయం తెలియ జెయ్యవలసిందని పద్మపాదుని అతి రహస్యంగా ఆదేశించాడు. అటుపిమ్మట అమరుకదేవుని శరీరానుభూతిలో లీనమై మూర్ఛలో మునిగిపోయాడు. క్రమక్రమంగా మహాభోగి అయిన అమరుక దేవుని అంతఃపురంలో ప్రవేశించి కామకళా రహస్యాలన్నీ అవలీలగా అవగాహన చేసుకొన్నాడు.

# 12

అమరుకదేవుని శరీరంలో నిలిచిన ఆచార్య శంకరుని హృదయంలో పూర్వస్మృతులన్నీ ఆ విధంగా క్రమక్రమంగా ఒకటొకటిగా పురివిప్పి నృత్యం చేశాయి.

"కొంతకాలంపాటీ శరీరంలో నివసించినంత మాత్రాన నాకే ఇంతటి విస్మృతి విభ్రాంతులు కలిగాయే! ఇక సాధారణ సంసారులకు శరీరాత్మ భ్రాంతి కలగడంలో ఆశ్చర్యమేమి ఉంది!"

శంకరాచార్యుడు కొంతసేపలాగే ఆశ్చర్యముద్రలో మునిగిపోయాడు.

క్రమంగా ఆచార్య శంకరునికి అమరుకదేవుని అంతఃపురాంగనలు, వారితో కలిసి మెలిసి తానను భవించిన మహాభోగాలు, కింశుక ప్రభ

గాఢానురాగము, ఆమె నృత్య హేలావిలాసాలు మొదలైనవన్నీ స్ఫురణకు వచ్చాయి. అంతలోనే "ఆ భోగా లనుభవించిన వ్యక్తి వేరు! నేను వేరు! నేను కేవలం అజరామరమైన పరమాత్మ మూర్తిని! నే నా వ్యక్తిని కాను!" అన్న స్ఫురణ కలిగింది. ఇంకొక క్షణంలో "అందరూ పరమాత్మ స్వరూపులే! కేవలం నా స్వరూపులే! పరమార్థ దృష్టిలో పరిశీలిస్తే నాకు, ఆ అంతఃపురాంగనలకు భేదమేమీ లేదు! లేదు!" అని స్ఫురించింది. ఆచార్య దేవుని హృదయంలో వారందరిపైన అపారమైన కరుణా వాహిని వెల్లివిరిసింది. అంతేకాదు: ఆ క్షణంలో చరాచర ప్రపంచం అంతటిమీదా ఆచార్యుని అపార కరుణావాహిని జాలువారింది. తన చల్లని అద్వైతామృత దృష్టిలో ప్రపంచంలో ప్రాణు లందరికీ ఇంత విజ్ఞాన భిక్ష పెట్టిన వారందరి హృదయవేదనా జ్వాలలు ఒక్కమారుగా చల్లార్చి వేయాలని ఒక మహా సంకల్పం కలిగింది. ఆ భావనతో ఆచార్య శంకరుని చెక్కిళ్ళపై కన్నీటి బిందువులే జాలువారాయి.

అంతలో రాజ్యవర్ధను డక్కడికి వచ్చాడు:

"మహాప్రభూ! యుద్ధంలో మనకే దిగ్విజయ సూచనలు గోచరిస్తున్నాయి. శత్రువులందరు చెల్లాచెదరై పారిపోతున్నారు! తమ కిక ఈ యోధవేషం అనవసరం!"

రాజ్యవర్ధను డలాగే నిలుచున్నాడు.

"మీ వంటి మహామాత్యు లుండగా నాకేమి కొదవ? స్వయంగా మీరే ఇక ఈ రాజ్య సంరక్షణ భారం వహించండి. నా కింకా పూర్తిగా స్వస్థత కలుగలేదు. మన సైన్య సన్నాహభారం కూడా ఇక మీరే వహించండి!"

దానితో తన సంకల్పం పూర్తిగా నెరవేరిన దని రాజ్యవర్ధను డనుకొన్నాడు. ద్విగుణీకృత ధైర్యంతో తిరిగీ యుద్ధ వ్యూహ సన్నాహా లారంభించాడు.

ఆచార్యు డొకమారు మాళవ రాజధానీ నగరంవైపు, అంతఃపురం వైపు చూచాడు. ఒక్క నిట్టూర్పు విడిచిపెట్టాడు. తిరిగి తన పూర్వ దేహంలో ప్రవేశించవలెనని సంకల్పించాడు.

ఆచార్య శంకరుని దగ్గర సెలవు తీసుకొన్న యతీశ్వరు లంతకు పూర్వమే మాళవారణ్యానికి ప్రయాణమైనారు.

వా రరణ్యంలో ప్రవేశించేసరికి, పర్వతగుహలో ఆచార్య శంకరుని శరీరం భద్రంగా సంరక్షిస్తున్న యతీశ్వరు డొకడు తొందర తొందరగా వారి సన్నిధికి వచ్చాడు :

"మాళవ రాజాధికారులు కొందరు గురుపాదుల శరీరానికి బలాత్కారంగా దహన సంస్కారం చేస్తున్నారు! రండి! రండి! గురుదేవుని శరీరం చితిపాలు కాకుండా సంరక్షించండి!"

అది వినగానే పద్మపాదాది శిష్యులంతా పర్వతగుహ దగ్గిరకి పరుగులు పెట్టారు. ఆ పైన మరి ఆచార్య శరీరానికి దహనసంస్కారం జరగకుండా, సరిగా సమయంలో అడ్డుపడ్డారు. పద్మపాదుడు మాళవ రాజాధికారు లెవరూ ఆ గుహ సమీపానికి కూడా రావడానికి వీలులేదని గట్టిగా కట్టడిచేశాడు. మాళవాధికారు లిక గత్యంతరంలేక తలలు వంచుకుని తిరిగి వెళ్ళిపోయారు.

పద్మపాదునికి మాళవ రాజాధికారుల చర్యల కంతరార్థం అంతా విస్పష్టంగా బోధపడింది. రాజ్యవర్ధనుడు కొంతమంది మంత్ర తంత్ర శాస్త్రజ్ఞులతో సంప్రదించి అమరుకదేవుని శరీరంలో పరశరీర ప్రవేశ విద్యావేత్త ఎవరో ప్రవేశించి ఉండవచ్చునని గ్రహించాడు. రాజ్య సంరక్షణ కే విధంగానై నా అమరుకదేవుని జీవితం అత్యవసరమని అతనికి స్ఫురించింది. వెంటనే మాళవరాజ్య పరిసరాలలో ఉన్న మృతశరీరాలన్నిటికి దహనసంస్కారం చేసి తీరాలని ఆజ్ఞాపించాడు. గుప్తంగా సంరక్షించిన మృతశరీరాలు కూడా కనిపెట్టి బలాత్కారంగా నైనా అవి దహించి వెయ్యవలసిందే అని గట్టిగా కట్టడిచేశాడు. అందువల్లనే యతీశ్వరు లక్కడలేని అదను కనిపెట్టి రాజాధికారు లాచార్యుని శరీరం బలాత్కారంగా దహించి వెయ్యాలని సంకల్పించారు. కాని, తరుణంలో అది చూచిన పద్మపాదాది శిష్యులు రాజాధికారుల ఆటలు సాగనీయలేదు. వా రంతకుపూర్వమే అమరుక శరీరంలో ప్రవేశించిన ఆచార్యుని కాత్మ విస్మృతి కలిగి ఉండవచ్చునని భయపడ్డారు. రాజధానీ నగరంలో ప్రవేశించి వారందరూ ఉచ్చైస్స్వరాలతో హెచ్చరిక లుచ్చరించడానికి అసలు

కారణం అదే! కాని వా రెంత జాగరూకత వహించినా చిట్టచివరి కాచా ర్యుని శిరోభాగం కొంతవరకు అగ్నిజ్వాల కాహుతి కాక తప్పలేదు! పద్మపాదాది శిష్యు లా అగ్నిజ్వాలలు చల్లార్చి ఆచార్యుని శిరోభాగానికి శాయశక్తులా చికిత్సలు చేశారు. ఆచార్యుని పార్శ్వంలో నిలిచి అత్యంత భక్తిభావంతో అగ్నిసూక్త పారాయణ ప్రారంభించారు. కొంతసేపటి కాచార్యుని శరీరంలో తిరిగి దివ్య చైతన్య జ్వాల వికసించింది.

మరి కొంతసేపటి కాచార్యుని ముఖంలో చిరున వ్వుదయించింది! శిష్యు లదిచూచి అత్యంత భక్తిభావంతో ఆచార్యునికి జయజయధ్వానాలు చేశారు.

ఆచార్య శంకరుడు నెమ్మదిగా కళ్ళు తెరిచి నాలుగువైపులా పరిశీ లించి చూచాడు. పద్మపాదాది యతీశ్వరులందరూ తిరిగి జయజయధ్వానాలు చేశారు.

కాని ఆచార్యుని శిరోవేదన వేయి శూలాలై వేధించింది. ఆ వేద నానుభూతి పొందిన ఆ అద్వైతాచార్యుని హృదయంలో విశాల ప్రపంచ ప్రాణికోటి వేదన మరింత తీవ్రంగా వేధించింది. ఆ ప్రాణు లందరిమీదా ఆచార్యుని అపార కారుణ్యదృష్టి ప్రసరించింది. మండన మిశ్రునికే కాక ప్రపంచ ప్రాణు లందరికీ తన అద్వైతామృతం చవిచూపించాలనీ, వారి నందరినీ సంసార జటిల దుఃఖాల సుడిగుండాల లోంచి తరింపజేయాలనీ ఆ మహా పురుషుని కొక దివ్య సంకల్పం కలిగింది.

ఆచార్యు డిక తన శిరోవేదన లక్ష్యపెట్టనే లేదు! వెనువెంటనే లేచి మాహిష్మతీ నగరానికి బయలుదేరాలని సంకల్పించాడు. పద్మపాదు డది గ్రహించి ఆచార్యునికి తన చేయి అందిచ్చాడు. అతని భుజంమీద చేయివేసి ఆచార్యుడు నెమ్మదిగా లేచి నిలుచున్నాడు. వారందరు వెంటనే మాహిష్మతికి ప్రయాణమయ్యారు. ప్రపంచ ప్రాణి సముద్ధరణ దృష్టితో తన శరీర స్వస్థత లవలేశమైనా గమనించకుండా బయలుదేరిన ఆచార్యునివైపు చూడగానే పద్మపాదాది శిష్యుల నేత్రాలలో బాష్ప మాలికలు తోరణాలై నిలిచాయి!

వారందరు ముక్త కంఠాలతో మళ్ళీ జయజయధ్వానాలు చేశారు. ఆ ధ్వను లా గుహాముఖంలో మరింత గంభీరంగా మారుమోగాయి!

# చూడామణి

అర్ధరాత్రివేళ హాయిగా గుండెలమీద చేతులు వేసుకుని అమాయకంగా నిద్రపోతున్న తన కుమారుల నందరినీ అశ్వత్థామ ఘోరంగా సంహరించివేశాడన్న వార్త చెవిని పడగానే ద్రౌపది వలవలా వాపోయింది. ఏ పాపమూ ఎరగని ఆ పసివాళ్లలాంటి అపమృత్యువు వాత పడిన దుర్వార్త తలుచుకుని ఆమె మాటిమాటికీ కుమిలి కుమిలి ఏడ్చింది.

భీమసేను డనేక సాంత్వనవచనాలతో ఆమె నోదార్చాడు. అయినా ఆ వీరమాత హృదయశోకం అలాగే కట్టలు తెంచుకుని ప్రవహించింది. భీమసేనుడంతటివానికి కూడా తన కుమారుల ఘోర దుర్మరణం నివారించే అవకాశమైనా కలగలేదే అని ఆమె తన దురదృష్టాని కెంతో విచారించింది. బాష్ప పూరిత రూక్షదృష్టితో భీమసేనునివైపు చూచింది.

ఆ మహా పాపాత్ముడు అశ్వత్థామను సంహరించి అతని శిరోభూషణమైన చూడామణి తనకు కానుకగా తీసుకొని రావలసిందనీ, అది కళ్లారా చూచేవరకు తన ప్రాణా లిక నిలవవని ఆక్రోశించింది.

ధర్మరాజుకు కూడా అశ్వత్థామను కఠినంగా దండించవలెననే సంకల్పం కలిగిందని భీమసేను డంతకు పూర్వమే గ్రహించుకొన్నాడు. అందుచేత ద్రౌపది ఆ విధంగా ఆక్రోశించిన ఉత్తర క్షణంలోనే అశ్వత్థామ మీదికి బయలుదేరాడు. అన్నగారి సంకల్పం గ్రహించిన నకులుడు వెంటనే ఒక రథం ఆయత్తంచేసి తీసుకువచ్చి అతని ఎదుట నిలబెట్టాడు. స్వయంగా రథసారథ్యం నిర్వహించాడు. అయితే వారిద్దరికీ కూడా అశ్వత్థామ ఎక్కడ ఉన్నాడో తెలియదు. కురుక్షేత్ర ప్రాంతాలలో సంచరించేవారిని కొందరిని "అశ్వత్థామ జాడ ఎరుగుదురా?" అని ప్రశ్నించారు.

వారిలో కొందరతడు కృప, కృతవర్మలతో కలిసి భాగీరథీ తీరం వరకు ప్రయాణం చేశాడనీ, పిమ్మట కృప, కృతవర్మ లిద్దరూ విడిపోయి వేరొక్కచోటికి వెళ్ళిపోయారనీ, అశ్వత్థామ ఒక్కడూ కృష్ణ ద్వైపాయన

ముని ఆశ్రమ సమీపానికి వెళ్ళిపోయాడనీ, అతడా ప్రాంతంలోనే నివసిస్తున్నాడనీ అన్నారు. భీమసేను డామాట వింటూనే అటువైపు రథం నడిపించవలసిందని నకులుని కాజ్ఞాపించాడు.

భీము డావిధంగా కళ్ళుమూసుకొని అశ్వత్థామ మీదికి బయలుదేరాడన్న వార్త వాసుదేవుని చెవిని పడింది. అత డెంతో ఆత్రంగా ధర్మరాజుతో ఆ విషయం ప్రస్తావించాడు.

"భీమసేను డొక్కడూ అశ్వత్థామతో యుద్ధం చెయ్యడానికి బయలుదేరినట్లున్నాడు. దీనివల్ల ఏదైనా పెద్ద ప్రమాదమే సంభవించవచ్చును. కనుక వెంటనే మనం అంపరం బయలుదేరివెళ్ళి అతనికి తోడు పడడం అత్యావశ్యకం!" తరవాత శ్రీకృష్ణు డొక్కక్షణం సేపాగి ఆ ప్రమాద విషయం అతనికి విస్పష్టంగా వివరించాడు:

"ధర్మరాజా! అశ్వత్థామ తనవద్ద బ్రహ్మశిరో నామకాస్త్రం ఉన్నదనే అహంకారం కొద్దీ కన్నూమిన్నూ కానకుండా మిడిసిపడుతున్నాడు. అది ప్రపంచం అంతా దహించజాలిన దివ్యాస్త్రం. ఆచార్యుడు శిష్యవాత్సల్యం కొద్దీ అర్జునునికి కూడా ఆ అస్త్రం ప్రసాదించాడు. అయితే అశ్వత్థామ అర్జునునిమీది మాత్సర్యంకొద్దీ ఆ అస్త్రం ఎప్పుడైనా ప్రయోగింప వచ్చుననే భయంతో మానవులమీద ఆ అస్త్రం ప్రయోగింప కూడదని కట్టడి చేశాడు. కాని అశ్వత్థామ తండ్రి ఆ విధంగా కట్టడిచేయడానికి గల కారణం వేరువిధంగా గ్రహించుకొన్నాడు. అదీగాక తను చిరంజీవిననే అహంకారంకూడా దానికి తోడైంది. అశ్వత్థామ బ్రహ్మశిరోనామకాస్త్రంవల్ల భీమసేనుని కేవిధమైన ఆపత్తూ రాకుండా మనం అతని నిప్పుడు సంరక్షించుకోవాలి."

అని చెప్పి శ్రీకృష్ణుడు సాత్యకి సహదేవు లిద్దరిని పాండవ శిబిర సంరక్షణకోసం అక్కడనే నిలిపి రథం అధిరోహించి ధర్మరాజుతోను, అర్జునునితోను కలిసి భీమసేనుడు వెళ్ళినదారినే రథం నడిపించాడు. క్షణంలో ఆ రథం భాగీరథీ తీరానికి వెళ్ళిపోయింది.

మరి కొంతసేపటికి వారందరికీ వాయువేగంతో మున్ముందుకు సాగిపోతున్న భీమసేనుని రథం కనిపించింది.

శ్రీకృష్ణుడు తన రథం మరింత వేగంగా ముమ్ముందుకు నడిపించుకు పోయాడు. కాని అంతలోనే భీముడు రథం దిగి ఆ ప్రాంతంలో మునివేషం ధరించి ముక్కుమూసుకుని కూర్చున్న అశ్వత్థామ దగ్గిరికి వెళ్ళిపోయాడు.

అలోగా ధర్మరాజు, వాసుదేవుడు, అర్జునుడు అతన్ని ఎలుగెత్తి గట్టిగా పిలిచారు. తొందరపడవద్దని హెచ్చరికలు చేస్తూనే ఉన్నారు. కాని భీమసేనుడు వారి హెచ్చరికలు పెడచెవిని పెట్టాడు.

తన కెదురుగా ఆశ్రమంలో మునివేషంతో ఉన్న అశ్వత్థామను చూడగానే భీముని హృదయం క్రోధావేశంతో ఘూర్ణిల్లింది:

"బ్రాహ్మణాధమా! ఎంతటి పాపకార్యాని కొడిగట్టి చిట్టచివరి కెలాంటి కపటనాటకం అభినయిస్తున్నావు! చూస్తూండగానే నీవొక మహా ఋషీశ్వరుడవై పోయావే! ఇలాంటి మాయా నాటకం అభినయిస్తే చావు తప్పిపోతుందని భ్రమిస్తున్నావేమో! చాలు చాలులే! ఈ నాటకం ఈపాటికి కట్టిపెట్టు! యుద్ధానికి సిద్ధంగా నిలబడు!"

అశ్వత్థామ అలాగే నిశ్చల దృష్టితో భీముని ఉద్ధతధోరణి అంతా జాగ్రత్తగా గమనించాడు. అనతి దూరంలో అతని కెదురుగా ధర్మజ వాసుదేవార్జునులు ముగ్గురూ ప్రత్యక్షమైనారు. వారందరూ రథం దిగి తొందర తొందరగా అశ్వత్థామ వైపే నడిచి వస్తున్నారు.

అశ్వత్థామకు వారంతా దివ్యాస్త్ర రహస్యవేత్తలన్న విషయం తటాలున స్ఫురణకు వచ్చింది. అర్జునునివద్దకూడా బ్రహ్మశిరోనామకాస్త్రం ఉన్న సంగతి అతన్ని మరింత వేధించింది. ఇక ఆ మహాపత్సమయంలో తన బ్రహ్మశిరోనామకాస్త్రం తప్ప మరి వేరే దిక్కేమీ లేదని అత డొక్క త్రుటిలో గ్రహించివేశాడు. వెంటనే ప్రక్కనే ఉన్న గడ్డిపోచ తుంచి దానిపై బ్రహ్మశిరోనామకాస్త్రం అభిమంత్రించాడు. క్రోధావేశంతో అతనిముఖం మెలికలు తిరిగి చింతనిప్పులు చెరిగింది:

"అపాండవ మగుగాక!"

అని ఆ అస్త్రం భీమసేనుని మీదికి ప్రయోగించాడు.

ఆ గడ్డిపోచలోనించి భయంకరాగ్నిజ్వాలలు పైపైకి లేచాయి. ఆ అగ్నిజ్వాల లొక్క-క్షణంలో ఆకాశం అంతా దహించి వేసేట ట్లువ్వె త్తుగా విజృంభించాయి. ఇంకొక్క క్షణంలో భీమసేను డా జ్వాలలో శలభమై భస్మీపటలమై పోవలసిందే!

కాని క్షణంలో వాసుదేవు డర్జునుణ్ణి హెచ్చరించాడు:

"అర్జునా! అర్జునా! ఇది బ్రహ్మశిరోనామకాస్త్రం. దీనిమీద ఏ అస్త్రం ప్రయోగించినా, అది ఎందుకూ కొరగాదు! కనక నీవుకూడా నీ దగ్గర ఉన్న బ్రహ్మశిరోనామకాస్త్రం దీనిమీద ప్రయోగించు! అది ఒక్కటే దీనిని అడ్డగించగల మహాస్త్రం! నీ సోదరులను, నిన్ను సంరక్షించు కోవాలంటే ఇంతకన్న గత్యంతరంలేదు! త్వరపడు! త్వరపడు!"

క్షణంలో వారుముగ్గురూ రథంమీదినించి కిందికి దిగారు. అర్జునుడు వింట బాణం సంధించాడు. మనస్సులో ద్రోణాచార్యునికి నమస్కారం చేసి బ్రహ్మశిరోనామకాస్త్రం అభిమంత్రించాడు. తన అస్త్రంవల్ల అశ్వత్థామ కే విధమైన అపకారమూ కలగకూడదని సంకల్పించాడు. తనకు, తన సోదరులకు శుభపరంపరలు కలగవలెనని ప్రార్థించి అశ్వత్థామ అస్త్రానికి ప్రతిగా తన అస్త్రం విడిచిపెట్టాడు.

తన అస్త్రం వల్ల అశ్వత్థామ అస్త్రం ఉపశమించవలెనని, అనంతరం తన అస్త్రం కూడా ఉపశమించ వలెనని అతని అభిలాష.

కాని ఆ అస్త్రం వల్ల అశ్వత్థామ అస్త్రం ఉపశమించలేదు. ఆ రెండు అస్త్రాలూ ఆకాశంలో కల్పాంతజ్వాలలవలె బీభత్సంగా ప్రజ్వలించాయి. ఆకాశం అంతటా అత్యంత భయంకరంగా పిడుగులు పడుతున్న సవ్వడి వినబడింది. శరపరంపరగా తోకచుక్కలు నేలమీద విరుచు పడ్డాయి. దూరదూరంగా హస్తినాపురంలో ఉన్న జనం అందరూ ఆ నాటితో మరి మహాప్రళయమే ప్రారంభమైందని భయపడ్డారు!

అంతలో నారదుడు, వ్యాసమహర్షి వారి కట్టెదుట సాక్షాత్కరించారు. అంతలోనే వారిద్దరు తొందర తొందరగా నడిచివచ్చి అశ్వత్థామార్జునుల మధ్య నిలబడ్డారు:

"అస్త్రరహస్యవేత్తలైన మహావీరు లెందరెందరో ఈ ప్రపంచంలో ఉద్భవించారు. వారెన్నడైనా ఈ బ్రహ్మశిరోనామకాస్త్రం ఇలాగ మానవులమీద ప్రయోగించారా? ఇది న్యాయమేనా?"

అని ఎలుగెత్తి హెచ్చరించారు.

అర్జునుడు వారిద్దరికీ సవినయంగా నమస్కరించాడు:

"ఈ అస్త్రాలు రెండూ ఉపశమించవలెననే సంకల్పంతోనే నేనీ అస్త్రం ప్రయోగించాను. అంతేగాని నాకు మరి ఒక దుష్ట సంకల్పమేమీ లేదు." అని వెంటనే తన అస్త్రం ఉపసంహరించి వేశాడు.

ఆ విధంగా ఆ అస్త్రం ఉపసంహరించివెయ్యడం సామాన్యుల కసాధ్యం! మహా ధర్మాత్ముడైన అర్జునునికే అది సాధ్యపడింది. అన్యు లెవరైనా తొందరపడి బ్రహ్మశిరోనామకాస్త్రం ఉపసంహరిస్తే అది వెనువెంటనే వారినే అణిచివేస్తుంది. అర్జునుని శక్తిసామర్థ్యాలవలోకించిన మహా మునులిద్దరూ అతని ననేక విధాల అభినందించారు.

అశ్వత్థామ తాను ప్రయోగించిన బ్రహ్మశిరోనామకాస్త్రం ఉపసంహరించవలెనని ప్రయత్నించాడు. ఎంతగా ప్రయత్నించినా అతని కది సాధ్యపడలేదు. దానితో అతని ముఖం వెలవెలబోయింది. వెనువెంటనే వ్యాసమహర్షి వైపుచూచి సవినయంగా విన్నవించుకొన్నాడు:

"మహర్షీ! భీమసేను డన్యాయ్యంగా నా తండ్రిమృతికి కారణ భూతుడైనాడు. అంతటితో ఊరుకోక నన్నుకూడా సంహరించి వెయ్య వలెననే దురుద్దేశంతో నామీదికి విరుచుకుపడ్డాడు. కేవలం ప్రాణభయం వల్లనే నే నీ అస్త్రం ప్రయోగించాను. ఇక వెనకముందు లాలోచించ కుండా నేను సంకల్పించిన ట్టిది పాండురాజకుమారులందరినీ సంహరించి తీరవలసిందే! దీని కిక తిరుగులేదు. నాకిక దీనివల్లవచ్చే మహాపాతకానికి ఒడిగట్టక తప్పడం లేదు! నేనేమి చెయ్యను?"

ఆ ప్రత్యుత్తరం విని వ్యాసమహర్షి కొంచెంసే పాలోచించి అశ్వత్థామ కొక చక్కని సదుపదేశం చేశాడు:

"అశ్వత్థామా! ద్రోణాచార్యుడు శిష్యునిమీది వాత్సల్యం కొద్దీ అర్జునుని కీ అస్త్రం ప్రసాదించాడు.

"కనకనే నీవెంతటి ద్రోహాని కొడిగట్టినా అతడు నీకెటువంటి అపకారమూ సంకల్పించి ఉండడంలేదు. నీ అస్త్రానికి మారుగా తన అస్త్రం ప్రయోగించాడు. అంతేగాని తానై మొట్టమొదటగా ఆ అస్త్ర ప్రయోగాని కుపక్రమించలేదు.

"మేము వలదన్న వెంటనే అది ఉపసంహరించివేశాడు. ఇటు వంటి ధర్మాత్ముని సంహరించ వలెనని సంకల్పించడం నీకు న్యాయం కాదు.

"ఇంకొక విషయం: ఈ మహాస్త్రం మనుష్యుల మీద ప్రయోగించేవారికి తప్పక అశుభం కలుగుతుంది. అదిన్నీ గాక, నీ అస్త్రం చిట్ట చివరికి తని అస్త్రంచేత ఎలాగైనా ఉపసంహరించబడి తీరుతుంది. కాని ఆ విధంగా నీ అస్త్రం ఇంకొకరి అస్త్రం చేత ఉపసంహరించబడడం మంచిదిగాదు. అలాగ ఉపసంహరించబడినట్లయితే ఈ దేశంలో పంద్రెండేళ్ళపాటనావృష్టిదోషం కలుగుతుంది.

"ఇది నేను నీకూ, ఈ దేశానికీ క్షేమం కోరి, చాలా దూరం ఆలోచించి చెబుతున్నాను. జాగ్రత్తగా విను నాయనా! ఈ అస్త్రం ఉపసంహరించివెయ్యి. ఇక వెనకముందు లాలోచించకు! నా మాట విను!--

"అదీగాక నీ కొక సామరస్య మార్గం కూడా ఉపదేశిస్తున్నాను. అది కూడా శ్రద్ధగా విని నా సంధిమార్గాని కంగీకరించు.

"నాయనా! నీవు తపస్సు చేసుకోవాలని సంకల్పించావు! అటు వంటి వాడికి నీ కీ రోష ద్వేషా లెందుకయ్యా! నీకూ, అర్జునునికీ అంగీకార యోగ్యమైన మార్గం ఒకటి ఆలోచించి చెబుతున్నాను. అన్నీ నీ వన్నట్లే సాగిపోవా లనడం న్యాయ్యం కాదు గదా! సామరస్య మార్గం అర్జునునికీ నీకూ ఉభయతారకంగా ఉండడం ధర్మం!

"నీ చూడామణి అర్జునుని కిచ్చివెయ్యి. దానితో అర్జునుడే కాక పాండవు లందరూ నీ ప్రాణం అపహరించినంతగా సంతోషిస్తారు. అపైన

నీవు సుఖంగా తపస్సు చేసుకోవచ్చును. కనుక వెంటనే నీ అస్త్రం ఉప సంహరించి వేసి నీ చూడామణి వీరి కర్పించు. ఇది చక్కని సామరస్య మార్గం! ఇల్లాగ చెయ్యి నాయనా! నా మాట విను!"

ఆ మాటలన్నీ అశ్వత్థామ అతిశ్రద్ధగా విన్నాడు. కొంత వరకూ వ్యాస మహర్షి చెప్పిన సంధిమార్గం అతనికి సమంజసంగానే స్ఫురించింది. కాని అతని అంతరాంతరాలలో పాండవులపై బయలుదేరిన అక్కస్సింకా అలాగే రాజుకుంది:

"మహర్షీ! పాండవేయులకు రత్నాల కేమైనా కొదవా! వారు నా చూడామణి కాశపడడం ఎందుకు? ఇది ధరించిన వారికి సర్వభయము, తస్కర భయము, దేవరాక్షస భయము, క్షుద్బాధ, తృష్ణ మొదలైన వేవీ ఉండవు! నా మట్టుకు నాకు వీరికీ చూడామణి సమర్పించడం సుతరామూ ఇష్టం లేదు. కాని నీ మాట తీసివేయలేక నీకీ రత్నం సమర్పిస్తున్నాను. ఇక నా అస్త్ర లక్ష్యం మాట! ఇది పాండవేయ పత్నీ గర్భా లన్నీ దహించివేసి వెంటనే ఉపశమిస్తుంది. అంతవరకూ దీని కిక తిరుగులేదు. అంతే!"

అతని ప్రత్యుత్తరం వింటూనే వ్యాసమహర్షి తటాలున ప్రత్యుత్తరం ఇచ్చాడు:

"సరే! అలాగే చేద్దువుగాని! అంతేగాని ఇక వేరే ఆశ పెట్టుకోకు నాయనా!" అని ఎంతో ఆప్యాయంగా అతన్ని బతిమాలు కొన్నాడు.

కాని ఆ మాటలో ఏదో మెలత ఉన్న ట్టశ్వత్థామకు స్ఫురించింది.

"మునీంద్రా! నీవు పాండవ పత్నీగర్భాల ధ్వంసంతోనే న న్నూరట పొందవలసిందని ఆజ్ఞాపిస్తున్నావుగాని నా సంకల్పం అంతటితో ఆగిపోయేదికాదు. ఇది పాండవ కుమారుల పత్నీగర్భాలను కూడా దహించి తీరుతుంది. నీ సంకల్పం నేను గ్రహించలేదనుకున్నా వేమో! గ్రహించివేశాను. నా సంకల్పాని కిక తిరుగులేదు!"

అని బింకంగా మూతి ముడుచుకుని కూర్చున్నాడు.

# 4

శ్రీకృష్ణు డశ్వత్థామకు, వ్యాసమహర్షికి మధ్య నడిచిన ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ అతిశ్రద్ధగా ఆలకించాడు. అశ్వత్థామ క్రూర ప్రవృత్తి అంతా అతనికి అవగాహన అయిపోయింది. ఒక్క చిరునవ్వు నవ్వాడు.

"అశ్వత్థామా! నీ అస్త్రాగ్నితో పాండు మహారాజు పౌత్రుల నందరినీ సంహరించి వేశావు. అంతటితో ఊరుకోక వారి పత్నుల గర్భాలన్నిటిలో చిచ్చుపెట్ట వలె నని నిశ్చయించావు! నే నా గర్భాలలో ఉన్న ఒకే ఒక్క శిశువును సంరక్షించవలె నని నిశ్చయించాను. అతడు మహా ధర్మాత్ముడై పృథివి అంతా పరిపాలించవలె నని అభిలషిస్తున్నాను! నీవు కూడా నా సంకల్పానికి తోడు పడవలసింది!"

అని అశ్వత్థామను సగౌరవంగా ప్రార్థించాడు. ఆ ప్రార్థన విని అశ్వత్థామ ఒక విషపు నవ్వు నవ్వాడు.

"వాసుదేవా! నీ వేదో పక్షపాతంకొద్దీ ప్రసంగిస్తే నేను దాని కంగీకరిస్తా నని అనుకొన్నావా? నీవు అభిమన్యుని పత్ని ఉత్తరగర్భం సంరక్షింపవలె నని సంకల్పించావు! నే నాగర్భం కూడా భస్మంచేసి వేస్తు న్నాను: దీని కిక తిరుగులేదు!"

అని ఆ అస్త్రమంత్రం తిరిగీ ఇంకొకమారు పునశ్చరణ చేశాడు.

అంతలోనే కృష్ణు డొక్క నవ్వు నవ్వాడు:

"వెర్రివాడా! నీ అస్త్రం కాల్చివేసినంతమాత్రాన ఆ శిశువలాగే మరణిస్తా డని అనుకొన్నావా? నీ అస్త్రదగ్ధుడై మరణించిన వెంటనే నే నాశిశువును బ్రతికిస్తాను! ఆ పసివానితో పాండవవంశం తామర తంపరగా వర్ధిల్లగలదు. అదిన్నీ గాక అతడు చిరకాలం పూర్ణాయూ ర్దాయంతో జీవించగలడు. త్రికాలవేది అయిన బ్రాహ్మణు డొకడు

ఉత్తరా గర్భంలోనించి మృతశిశు వుద్భవించగల డని ఆదేశించాడు. అందుచేత అతనికి పరీక్షిత్తనే నామధేయం ఏర్పడగల దని కూడా అన్నాడు. ఇంతా చేస్తే దీనిలో నీవు చేసిన దేమి ఉంది?''

అని చెప్పి నిశ్చల దృష్టితో అశ్వత్థామ వైపు చూచాడు. ఆ పరమ పాపాత్ముని ముఖం చూడగానే వాసుదేవు డంతటి వానికి క్రోధజ్వాల నఖ శిఖపర్యంతమూ దహించి వేసింది:

''నీవు శిశుహంతవు! ఇందువల్ల నీ కిక అన్నపానాలు కూడా కరువై పోతాయి. 'నా' అన్నవారు లేకుండా నీ విల్లాగే ఇంకా మూడు వేలేళ్ళ వరకూ జీవచ్ఛవంలా జీవించగలవు!

''నేను రక్షించిన పరీక్షిత్కుమారుడు నీ కళ్ళ ఎదుటే పెరిగి పెద్దవా డౌతాడు. కృపాచార్యు డతనికి ధనుర్వేద రహస్యా లన్నీ అనుగ్రహించగలడు. పరీక్షిత్తంతో కాలం ఈ భూమి పాలించగలడు. ఆ పరీక్షిత్తుకు జనమేజయు డనే కుమారు డుద్భవింపగలడు. అతడు నీవు చూస్తూండగానే ఈ పృథివి అంతా ఏకచ్ఛత్రాధిపత్యంతో పరిపాలించ గలడు! తెలిసిందా! అప్పటికి నీకు నా ప్రభావం ఎటువంటిదో తెలిసి వస్తుందిలే!''

వ్యాసమహర్షి కూడా పాపకర్ముడైన అశ్వత్థామ ముఖం చూచి తన క్రోధం నిగ్రహించుకోలేక పోయాడు:

''నీ వెత్తినది బ్రాహ్మణజన్మ! ఆ పైన నే నెన్నో విధాలుగా నీ కుపదేశించాను! నా మాట లన్నీ పెడచెవిని పెట్టావు! ఇందుచేత వాసుదేవుని వాక్యా లక్షరశః సత్యము లగుగాక!''

అని అశ్వత్థామను మళ్ళీ శపించాడు. ఆ పైన అశ్వత్థామ ముఖం మరి చూడలేక పోయాడు:

"నీచుడా! నా ఎదట మరి నిలబడకు! పో!" అని కసిరి వేశాడు. అయినా అశ్వత్థామ అక్కసింకా పూర్తిగా సమసి పోలేదు:

"వ్యాసా! నీ వెంతటి బ్రహ్మజ్ఞుడ వయినా నీ కిక మానవ జన్మ విముక్తి లేదు! నీ వెప్పటికీ మానవులలోనే ఉండిపోదువుగాక! నే నెక్కడికీ వెళ్ళిపోవడం లేదు!మీ ఇద్దరి శాపాలూ అనుభవిస్తూ నీ సన్నిధినే ఉండి పోతున్నాను!"

అని వ్యాసమహర్షి కి ప్రతిశాపం ఇచ్చాడు. వెంటనే పాండవులకు తన శిరోమణి సమర్పించి తపోవనంలోనికి తరలిపోయాడు.

పాండవులు, కృష్ణుడు వ్యాసమహర్షి కి సవినయంగా నమస్కరించి, సెలవు తీసుకొని తిరిగి తమ శిబిరానికి మరలిపోయారు.

ధర్మరాజు చూడామణి భీమసేనుని కిచ్చి అది ద్రౌపదీ దేవి కీయ వలసిందని పంపించాడు.

ఆ చూడామణి కళ్లారా చూచి ద్రౌపదీదేవి ఊనూరుమని ఒక నిట్టూర్పు విడిచిపెట్టింది.

# బంగారు ముంగిస

కౌరవ పాండవ యుద్ధం ముగిసిపోయిన పిమ్మట ధర్మరాజు చేసిన ఆ మహాశ్వమేధ యాగానికి నేల నాలుగు చెరగులనించి రాజులు, సామంతులు, మహీసురులు, ఋషీశ్వరులు, ఋత్విక్కులు మొదలైన వారంతా వచ్చి ఆ యజ్ఞం యావత్తూ కళ్లారా చూచి ఆనందించారు. అవభృథ స్నానం జరిగిన పిమ్మట వారంతా మంగళ తూర్యాల ఘోషలో ధర్మపుత్రుని శిరస్సుమీద ఆశీస్సులతోబాటు అక్షతల వర్షం కూడా కురిపించారు!

సభా మండపంలో సింహాసనాసీనుడై ఉన్న ఆ ధర్మమూర్తి నందరూ అనేక విధాలుగా ప్రశంసించారు. అంతటి మహాశ్వమేధయాగము, అంతటి వితరణ, అలాంటి బ్రాహ్మణ సమారాధన ఎన్నడూ కని విని ఎరగమన్నారు వారంతా! ఆ విధంగా దిగ్విజయంచేసి ఆ ధనరాసులన్నీ ఆ రీతిగా ఆ యజ్ఞంలో నిశ్శేషంగా వితరణ చెయ్యడమనేది ఆ ఒక్క ధర్మమూర్తికే చెల్లిందనీ, బలి, దధీచి మొదలైనవారి దానతత్పరత కూడా ఆ వితరణ ముందు ఎందుకూ కొరగాదనీ వారంతా ముక్తకంఠాలతో ఉద్ఘోషించారు! పిమ్మట మంగళతూర్యాలు దిక్కులు పిక్కటిల్లేటట్లు భోరుమని మారు మోగాయి!

ఇంతలో ఆ సభా మధ్యంలో ఒక్క సారిగా ఉవ్వెత్తుగా కలకల హాసం చెలరేగింది! ఆ నవ్వు మానవుని నవ్వులా వినిపించలేదు! అది ఏదో విచిత్రమైన కల కల నవ్వు. సభలోని వారంతా నిర్ఘాంతపోయి సభామధ్య వేదికకేసి రెప్పపాటు లేకుండా చూచారు. ఆ నవ్వు అంతకంతకూ శ్రుతి మించిపోయింది. నిశ్చలంగా, నిశ్శబ్దంగా ఉన్న సభలో ఆ కల కల హాసం తప్ప మరేవిధమైన ధ్వనీ వినిపించలేదు!

ఆ సభా మధ్యలో ఒక ముంగిస వెనక కాళ్ళమీద నిలబడి అదే పనిగా నవ్వుతూంది! దాని శరీరం, శిరస్సు మొదలు నడుంవరకూ, అంతా బంగారమే! మిగిలిన సగమూ సామాన్యంగానే ఉంది! ఆ విచిత్రం చూచి

అందరూ ఆశ్చర్యపోయారు! దాని బంగారు శరీరం కాంతులు సభా మండపంలో అంతటా అగ్నిజ్వాలల్లా వ్యాపిస్తున్నాయి. ఆ ముంగిస గుక్క తిప్పుకోకుండా ఇంకా అలాగే నవ్వుతూంది!

ఆ సభలో కొంద రది ఏదో మహాప్రళయ సూచనేమో అనుకున్నారు. మరికొంద రది గొప్ప అరిష్టసూచకమని, వెంటనే ఆ అరిష్టశాంతి చేయించాలని అన్నారు. ఇంతలో ఆ బంగారు ముంగిసే ఆ సభాస్తారుల నుద్దేశించి అలా అన్నది:

"ఆహా! ఏమి మీ పొగడ్తలు! ఈ పొగడ్త లాలకిస్తూంటే నోరూ వాయీ లేని నాకు కూడా లోలోపల నవ్వు, మాటలు పొంగి పొంగి పైకి వస్తున్నాయి!" అని ఆ ముంగిస మళ్ళీ కలకలా నవ్వింది! సభ్యు లెవరికీ ఊపిరి కూడా ఆడడంలేదు! ఆ ముంగిస తన నవ్వంతా అతి కష్టంమీద తమాయించుకుని తిరిగీ ఇలాగన్నది:

"మీరంతా ఈ యాగము, ఈ దాన ధర్మాలు చూచి కేవలం వందిమాగధుల లాగ కైవారాలు చేస్తున్నారు! కాని ఒక్క బక్కచిక్కిన బీద బ్రాహ్మణుని వితరణ కాలి గోటికి కూడా ఇది సరిపోలదు! ధర్మరాజు బ్రహ్మణ్యుడే! ఆయన అశ్వమేధయాగము అంతటిదే! కాని ఆ బ్రాహ్మణుని వితరణకు, దీనికి హస్తిమశకాంతరం! కొంచెం ఆలకిస్తే ఆ విషయం మీకే విశదం కాగలదు. దయచేసి సావధాన చిత్తాలతో చిత్తగించండి!"

పిమ్మట ఆ ముంగిస ఆ బ్రాహ్మణుని త్యాగవృత్తాంతం అంతా చెప్పింది. సభాస్తారులంతా చిత్రప్రతిమల్లా నిశ్చేష్టులై అది విన్నారు.

"ఆహా! కురుక్షేత్రంలో ఆ సక్తుప్రస్థు డెంతటి మహానుభావుడు! ఆ బ్రాహ్మణుడు వరిచేలల్లో రాలిన ధాన్యంగింజ లేరుకుని అవి దంపించి ఆ వరిపిండితోనే జీవితం గడుపుకొనేవాడు. ఆయన భార్య, కుమారుడు, కోడలు కూడా అన్ని విధాలా ఆయనకు తలలో నాలుకలా మసులుకొనేవారు. ఒక నాటికి సరిపడిన ధాన్యంగింజల కంటె వారు ఒక్క గింజకూడా ఎక్కువగా తెచ్చేవారు కారు! ఆ సక్తుప్రస్థుడు మహా తపశ్శాలి. తనకు కలిగిన దానితోనే తన కుటీరానికి వచ్చిన అతిథులను అభ్యాగతులను ఎంతో ఆప్యాయంగా సంతృప్తి పొందించేవాడు!

ఇలాగ ఉండగా కొంత కాలాని కొక ద్వాదశవర్ష క్షామం వచ్చింది. ఆ క్షామంలో ఎన్నెన్నో జీవరాసు లన్నంలేక హాహా కారాలు చేశాయి. ఒక సంవత్సరమా, రెండు సంవత్సరాలా! అది పన్నెండేళ్ళ కరువు! ఆ కరువులో ఎందరెందరో 'అన్నమో రామచంద్రా' అని ఆక్రందిస్తూ అలాగే ప్రాణాలు విడిచారు!

పాపం! ఆ క్షామంలో ఆ సక్తుప్రస్థుడు, ఆయనకుటుంబము ధాన్యం గింజలు దొరకక ఎన్నెన్నో కటికి ఉపవాసాలు చేసేవారు. అయినా ఒక్కనాడూ వారు రేపటికని చెప్పి ఒక్క గుప్పెడు ధాన్యం గింజలు కూడా నిలవచెయ్యలేదు! ఆ బ్రాహ్మణుడు ఆ ఉంఛవృత్తి అలాగే అని ధారావ్రతంగా పాలించేవాడు! ఆహా! ఏమి ఆ మహానుభావుని ధర్మనిరతి!

ఆ కరు వలాగే పెద్ద వడగాలుపులాగ ప్రాణులన్నిటిని మలమల మాడ్చివేసింది. ఆ సక్తుప్రస్థుని కుటుంబం వారంతా చాలాకాలం ఆహారంలేక బక్కచిక్కి పోయారు! అయినా వా రెవరినీ నోరు తెరిచి అన్నం అర్థించలేదు! అలాగే పొలాల్లో రాలిన ధాన్యం గింజ లేరుకుంటూ వాటితోనే జీవించేవారు. అలాగ కొన్నాళ్ళపాటు ఒకొక్కటిగా ధాన్యం గింజలు సేకరించగా సేకరించగా కొంతకాలాని కవి మానెడు గింజ లైనాయి. వా రొకనాడు ఆ గింజలన్నీ దంచి పిండిచేసుకున్నారు. ఆ పిండి నలుగురూ నాలుగు సమానభాగాలు చేసుకున్నారు. సక్తుప్రస్థుడు స్నాన సంధ్యాదులు నిర్వర్తించుకొని తన భాగం ఆరగించవలెనని అనుకొన్నాడు.

అంతలో ఆయన కనతిదూరంలో ఒక అతిథి కనిపించాడు. అప్పటి కప్పుడే రెండు యామాల కాలం గడిచిపోయింది! ఎండ వేడిమికి తాళలేని కాళులు కావు కావని అరవడానికి కూడా శక్తిలేక సన్నంగా దీనంగా అరుస్తున్నాయి.

ఆ అతిథి కుటీరాని కల్లంత దూరంలో ఉండగానే సక్తుప్రస్థు డాతని కెదురేగి ఎంతో ఆప్యాయంగా లోపలికి తీసుకు వచ్చాడు. అర్ఘ్య పాద్యాదులతో అనేక విధాలుగా సత్కరించి ఆయనకు తన భాగం వడ్డించవలసిం దని గృహిణితో అన్నాడు.

ఆ అతిథి అది ఆరగిస్తూంటే ఆ సక్తుప్రస్థు డెంత బ్రహ్మానందభరితు డైనాడు! ఆ అతిథి ఆ సక్తుప్రస్థుని భాగం ఆరగించి వేసినాడు. అయినా అతిథి ముఖంలో ఆకలి తీరిన కళ లేమీ కనబడలేదు! పాపం! సక్తుప్రస్థు డది చూచి కొంచెం దిగులు పడ్డాడు.

అంతలో ఆయనభార్య సక్తుప్రస్థుని లోపలికి పిలిచి తన భాగం కూడా ఆ అతిథి దేవుని కర్పించవలసిందని కోరింది!

ఆయన దాని కంగీకరించలేదు.

"నిన్ను పోషించవలసినది నేనేగదా! మరి నీ ఆహారం నేనెలాగ స్వీకరించగలను!" అన్నాడు.

"మీ అర్ధాంగి కీ ఆతిధ్యధర్మంలో పాలు పంచకపోవడం ధర్మం కాదు!" అన్నది ఆ బ్రాహ్మణుని ధర్మపత్ని!

సక్తుప్రస్థుడు దాని కేమీ సమాధానం చెప్పలేక పోయినాడు. ఆమెభాగం కూడా ఆ అతిథికి అర్పించివేశాడు. తిరిగీ ఆ అతిథి ఆ భాగం కూడా తినివేశాడు. కాని అతనికి ఆకలి తీరలేదు! సక్తుప్రస్థునికి ఏమి చెయ్యడానికీ పాలుపోలేదు! అయ్యో! ఒక్క క్షుధార్తునికి కడుపు నిండా ఇంత అన్నం కూడా పెట్టలేక పోయానే! అని లోలోపల ఎంతో బాధ పడ్డాడు.

అంతలో ఆ బ్రాహ్మణుని కుమారుడు తన భాగం కూడా ఆ అతిథికి వడ్డించవలసిందని తల్లితో చెప్పాడు. తల్లి ఒక్క క్షణం కూడా ఆలస్యం కాకుండా ఆ పిండి అతనికి వడ్డించింది. అది తిన్న తరవాత ఆ బ్రాహ్మణుడు కొంత సేదదేరినట్లు కనిపించాడు! సక్తుప్రస్థుడు అది చూచి కొంచెం సంతోషించాడు.

సక్తుప్రస్థుని భార్య ఎంతో ఆప్యాయంగా ఆ అతిథితో 'బాబూ!' ఇంకా కొంచెం తీసుకోండి!" అన్నది. అతిథి అంటీ అంటనట్టుగా అక్క ర్లేదనబోయి ఇంకా కొంచెం కావా లన్నాడు.

ఆమె తన అలవాటు ప్రకారం అన్నదేగాని కుటీరంలో ఇక ఒక్క కోడలు భాగం తప్ప మరి వేరే ఆహార మేమీ లేదని ఆమెకు తెలియదు! కాని ఏమి చెయ్యడానికీ పాలుపోక లోపలికి వెళ్ళిపోయింది! ఆ గృహస్థు

కూడా లోపలికి వెళ్లాడు! అంతలోనే కోడలు తన భాగం కూడా తీసుకు వచ్చి అత్తగారి కందీయ బోయింది! ఆమె కొంతసేపు అది వద్దనడానికి గాని, స్వీకరించడానికి గాని శక్తిలేక అల్లాగే కొయ్య బొమ్మలా నిలబడి పోయింది!లోపలికి వచ్చిన సక్తుప్రస్థుని కా సంఘటన చూచేసరికి కళ్ళనీళ్ళు తిరిగాయి. పాపం, కోడలు ఆకలితో నీరసపడి ఉన్నా తన భాగం కూడా అతిథి కీయవలసిందని అత్తగారిని అనేక విధాలుగా ప్రాధేయపడింది! మరి గత్యంతరం లేక ఆమె ఆ భాగం కూడా అతిథికి అర్పించి వేసింది! ఆ బ్రాహ్మణుడు ఆ భాగంలో కూడా చాలా వరకు ఆరగించి వేశాడు! తృప్తిగా మంచి తీర్థం లోపలికి పుచ్చుకుని గర్రున తేన్చాడు. ఎంత బల వంతం చేసినా ఇక మిగిలిన ఆహారం అక్కర లేదని పరిహరించి వేశాడు!

అతిథి కా విధంగా తృప్తి కలిగిందిగదా అని ఆ సక్తుప్రస్థు డానా డెంతగా సంతోషించాడు! ఆ అతిథి బ్రహ్మానందపడి వారందరినీ ఆశీర్వ దించి ప్రశాంతంగా ఇలాగన్నాడు:

“సక్తుప్రస్థా! నీ వంటి మహానుభావు డీలోకంలో అవతరించడం వల్లనే సూర్య చంద్రాదులు గతి తప్పకుండా తమ తమ మార్గాల్లో సంచ రిస్తున్నారు! మీ వితరణ చూచి మిమ్మల్ని అందరినీ విమానంలో దివ్య లోకానికి తీసుకుపోవాలనే తహతహతో దేవత లాకాశంలో వేచి ఉన్నారు! అదిగో! ఆకాశంలో ఎంతమంది దేవతలు ఆశ్చర్యమగ్నులై నిశ్చలంగా నీకోసం నిరీక్షిస్తున్నారో చూడు!”

నేనా సంఘటన అంతా చూస్తూ ఆ ప్రాంతాల్లో సంచరిస్తు న్నాను. ఆనందం పట్టలేక ఆ అతిధికి కాళ్ళు కడిగిన నీటిలో అటూ ఇటూ తిరిగాను! చిత్రంగా నా శరీరంలో సగం భాగం సువర్ణమయమై తళ తళా మెరిసింది. ఆహా!ఆ సక్తుప్రస్థుని త్యాగము, ఆ కుటుంబం ధర్మనిరతి తలుచుకుంటూంటే నా కిప్పటికీ శరీరం గగుర్పొడుస్తూనే ఉంది! అప్పటి నించీ నా మిగిలిన శరీరం అంతా సువర్ణమయమై పోగల దనే ఆశతో ఎన్నెన్నో యజ్ఞయాగాలు సందర్శించాను. ఆయా మహారాజులు, చక్ర వర్తులు అవభృథ స్నానాలు, దానాలు చేసిన నీటిలో నా శరీరం తడి పాను! కాని నా ప్రయాస ఫలించలేదు.

పిమ్మట కొంతకాలానికి ధర్మదేవత మూర్తీభవించిన ధర్మరాజే అశ్వమేధ యాగం చేస్తున్నా డనే శుభవార్త నా చెవులబడింది. నే నెంతో ఆనందించాను! నా ప్రయాస ఈనాటికి ఫలించగలదని అను కున్నాను.

ధర్మరాజు మహానుభావుడు. ఆయన చేసిన అశ్వమేధ యాగం వంటి మహత్తర యాగం నే నెన్నడూ దర్శించలేదు! ఈ యాగంలో ఏ విధమైన లోపమూ లేకుండా సమస్తమూ సలక్షణంగా జరిగిపోయింది! బ్రాహ్మణు లన్న మాటేమిటి? సమస్త ప్రాణులూ ఈ యజ్ఞంలో తృప్తి దీరా భుజించారు! ఈ మహాయాగంలో వేలెత్తి చూపడాని కేలోపమూ లేదు! ఇంతమంది మహా తపస్సంపన్ను లీ విధంగా స్తోత్రం చేసిన ఈ యజ్ఞము, ఈ వితరణ నిశ్చయంగా మహత్తరమైనవనే నని నేను విశ్వ సించాను.

ఆ విశ్వాసంతోనే ఈ యజ్ఞశాల అంతటా తిరిగాను. కాని ఎంత తిరిగినా మిగిలిన శరీరం బంగారం కాలేదు! పైగా ధూళిధూసరితమై పోయింది! అంతే! అవభృథస్నానం చేసిన ఈ మహారాజు అడుగు జాడల్లో సంచరిస్తే నా శరీరం అంతా బంగారం కాగల దేమో అని చాలా చాలా ఆశించాను. ఇంకా యజ్ఞశాలలో అనేక విధాలుగా ప్రయత్నించాను. కాని నా కోరిక సఫలం కాలేదు!

అప్పటినించీ ఆ సక్తుప్రస్థుని చరిత్ర నా హృదయంలో అలాగే మెరుస్తూంది! ఆ మహాత్యాగం ముందీయుధిష్ఠిరుని దానధర్మా లేపాటివి? కనుకనే ఇక్కడ నా శరీరం మరి సువర్ణం కాలేదు. అయ్యో! ఈ మిగిలిన శరీరం బంగారం కాలేదే అని నే నెంతో కించపడుతూంటే మీమీ కైవారాలు వినిపించాయి. అవి వింటూంటే పెద్ద నవ్వు వచ్చింది. ఆ లోలోపలి నవ్వాగక నిండు సభలో మీ అందరి ఎదట ఆ విధంగా నవ్వాను! మరి నాకు సెలవు దయచేయించండి!"

ముంగిస ఆవిధంగా అనర్గళంగా ప్రసంగిస్తున్నంతసేపూ సభ సభ అంతా చిత్రప్రతిమలా మారిపోయింది. ఆ ముంగిస ఆ విధంగా ప్రసం గించిన తరవాత మరి ఎవరు మాత్రం ఏమనగలరు!

అది అలాగని వెళ్ళబోతూంటే ఒక వృద్ధసదస్యుడు లేచి నిలబడి దానితో ఇలాగన్నాడు:

"ధర్మపుత్రుని అశ్వమేధయాగం అన్ని విధాలా సలక్షణంగా జరిగిపోయిందని నీవే అన్నావు గదా! అయితే సక్తుప్రస్థుని వితరణముందు ఈ యాగము, ఈ వితరణ - నీ వింతగా కించపరచడానికి హేతు వేమిటి?"

దానిమీద ఆ ముంగిస మళ్ళీ ఒక్కసారి కలకల నవ్వింది:

"ఈ సభలో ఇంతమంది బ్రహ్మణ్యులైన ధర్మవేత్త లున్నా - ఈ చిన్న ధర్మసందేహం కూడా నేనే తీర్చవలెనా?" అన్నది.

సభలోని వారంతా తిరిగి ఏమనడానికీ పాలుపోక అలాగే నిర్ఘాంత పోయారు. మరి కొందరు తలలే వంచేసుకున్నారు! ధర్మరాజాదు లందరూ ఖిన్నులై దిగాలుపడిపోయారు! కొంద రొకరి మొహా లొకరు చూచు కొన్నారు!

ఆ ముంగిస ఒక్క నిమిషం ఊరుకుని తిరిగీ ఇలాగన్నది!

"శత్రువులను సంహరించి, ఈ ధర్మప్రభువు దిగ్విజయం చేసి, ఆ హింసార్జితమైనద్రవ్యంతో ఈ అశ్వమేధయాగం జరిపించాడు. యజ్ఞంఎంత సలక్షణంగా జరిగినా హింసాద్రవ్యం హింసాద్రవ్యమే కదా! ఆసక్తుప్రస్థుని ఐహికచర్య సమస్తమూ అహింసామయంగానే సాగిపోయింది! అందువల్లనే ఆయనవితరణ యజ్ఞంముందు ఈ అశ్వమేధయాగం ఎందుకూ కొరగాకుండా వెలవెల బోయింది! ఇంతటి అల్ప విషయం కూడా ఈ ధర్మ సంస్థానం లోని ధర్మవేత్త లెవరికీ స్ఫురించలేదంటే నాకు మళ్ళీ ఉవ్వెత్తుగా నవ్వు వస్తూంది!" అని చెప్పి ఆ ముంగిస తిరిగీ అదే పనిగా కలకలా నవ్వడం మొదలు పెట్టింది! ఈసారి ముంగిస శరీర కాంతులేకాక, నవ్వు వెలుగులు కూడా ఆ సభాస్తంభాల మీద చిత్ర చిత్రంగా ప్రతిఫలించాయి. అందరూ శిల్పప్రతిమల లాగా ఆ నవ్వుల సవ్వడులు విన్నారు.

ఆ వింత వింత వెలుగులలో ఏకమైపోతూ ఆ ముంగిస అలాగే, అక్కడే అదృశ్యమై మాయమైపోయింది!

# సామర్థ్య పరీక్ష

శ్రవము మేనత్త కాశ్మీర మహారాజ్ఞి దిద్దాదేవి ఆనతి ఆలకించిన మరు నిమేషంలోనే ఉదయరాజు కుమారులు ముగ్గురూ ఆమె సమక్షాని కతి త్వరితంగా చేరుకోవలెనని మహారాజ మంత్రభవనంవైపు సాగి పోయారు.

వారిలో మొదటివాడు విజయసింహుడు. రెండవవాడు పరాక్రమ వర్మ. మూడవవాడు సంగ్రామరాజు. మహారాజ్ఞి అంత త్వరితంగా, నిలు చున్నపాటుగా పిలిపించడాని కేమి కారణమో వారెవ్వరికీ అంతు పట్టలేదు.

ఆ రాజ్ఞి రెండు మాసాల క్రితం షష్టిపూర్తి జన్మ దినోత్సవం జేగీయమానంగా జరిగిపోయింది. ఆపైన అకస్మాత్తుగా ఆమె శరీరంలో మహారాజ వైద్యు లెవ్వరికీ తిన్నగా అవగాహనకాని రుగ్మత ఏదో ప్రవేశించింది. క్రమక్రమంగా దిద్దాదేవి బాగా నీరసించింది.

అయినా ఆ మహారాజ్ఞి కాశ్మీర రాజ్య పరిపాలనలో, పర్యవేక్ష ణలో ఏ మాత్రమూ ఏమరలేదు. రాజకార్య నిర్వహణలో ఒక్క క్షణ మయినా తామసించలేదు. అంతగా వృద్ధురాలయినా, అనూహ్యమయిన వ్యాధివల్ల నీరసించినా ప్రధానామాత్యుడాదిగా గల సచివులందరూ ఆమె మాట చెబితేనే గజ గజ వణికిపోయేవారు. ప్రజానీకంలో ఆమె అంటే భక్తి గౌరవాలకన్న, భయాందోళనలే ఎక్కువగా వ్యాపించాయి. ఎప్పు డే దారుణశిక్ష తమ తలలపై విరుచుకుపడగలదో అన్న నిరంతర భీతితో ప్రధానామాత్యుడు మొదలుకొని సామాన్య రాజోద్యోగులవరకు గల అధికారులందరూ ఆమె ఆజ్ఞలన్నీ శిరసావహిస్తూ అనుక్షణమే అక్షరశః నిర్వర్తించారు.

ఆ సహోదరులు ముప్పురూ సువిశాలమయిన మహారాజ మంత్రా గారంలో ప్రవేశించారు. అప్పటికప్పుడే మధ్యాహ్నం రెండు జాముల

పొద్దు తిరిగింది. స్వచ్ఛమయిన పాలరాతితో నిర్మించిన ఆ సభాగారంలో అన్నివైపులా పైడిపూత పూసిన సన్నని స్తంభాల కాంతులు ప్రతిఫలించి కన్నులకు మిరుమిట్లు కలిగించాయి.

కొంత సమున్నతంగా అమర్చిన పగడపు వేదికపై సింహాసనాసీను రాలైన మహారాజ్ఞి పార్శ్వంలో నిలిచిన తుంగ ప్రధానసేనాని ఆమెతో అతి రహస్యంగా ఏదో రాజ్యకార్య పర్యాలోచన కొనసాగించి, తన సుఖాసనంపై కూర్చున్నాడు. ఉదయరాజకుమారులు ముగ్గురూ లోపల ప్రవేశించి శిరస్సు లల్లన సవినయంగా వంచి, మహారాజ్ఞికి నమస్కరించి తుంగసేనాని నిర్దేశించిన తమ సుఖాసనాలలో విశ్రమించారు.

మహారాజ్ఞి కనతిదూరంలో వారికి పెద్ద బంగారు పాత్ర ఒకటి కానుపించింది. దాని చుట్టు మూడు చిన్న చిన్న పైడిపాత్రికలు సన్నని మాతులతో మెడలు పైకెత్తినట్టు సాక్షాత్కరించాయి. అవి అలాగ అక్కడ పదిలపరచడాని కేమి కారణమని రాజకుమారుల కెంతో జిజ్ఞాస కలిగింది.

ఆ మూడు చిన్న బిందెలలోను వస్తువులేవీ లేవు. కాని పెద్దబింద నిండా ఎర్రని, పసుపుపచ్చని పాలేవతఫలాలు (ఆపిల్ పళ్ళు) ఉన్నాయి. దిద్దాదేవి తన రతనాల సింహపీఠికమీద ఒకింత ఓరగా వెనకవైపుగా ఒరిగి హేలగా ప్రధాన సేనానివైపు, ఆ ఫలాలున్న పాత్రవైపు చూచి ఉసూరుమని నిట్టూర్చింది.

వెనువెంటనే సేనాని లేచి నిలిచి రాజకుమారుల నుద్దేశించి ప్రసంగించాడు:

"ఇటీవల, ఎడతెగని రుగ్మతవల్ల, మహారాజ్ఞి కిక రాజకిరీటం సమర్థులయిన తమ సహోదరుల కుమారుల కెవ్వరికయినా ప్రసాదించవలెనన్న ఉదార సంకల్పం కలిగింది. అయితే మీరు ముగ్గురూ ఏకగ్రీవంగా మహారాజ్ఞి నిర్ణయాని కంగీకరించినప్పుడే కాశ్మీరంలో అల్లకల్లోలా లుద్భవించబోవన్న అభిప్రాయ మొకటి ఆమెలో స్థిరపడింది. జ్యేష్ఠులకు రాజ్య ప్రదానం సంప్రదాయ సిద్ధమయినా, సమర్థులయినవారు దానికి వ్యతిరేకించి కాశ్మీర రాజ్యం పరిపాలించవలెనని భావించడంలో తప్పిదమేమీ లేదు.

జ్యేష్ఠుల నుజ్జగించి సమర్థులయిన కుమారులకు కాశ్మీర రాజన్యు లింతకు మునుపు అనేక పర్యాయాలు రాజ్యప్రదానం చేసివున్నారన్న విషయం మీారెరిగి వున్నదే కదా! ఇప్పు డింత త్వరితంగా మిమ్మల్ని ఇక్కడికి ఆహ్వానించడాని కీ వ్యవహార నిర్ణయమే ప్రధాన హేతువు."

ఆ ప్రసంగం వినగానే విజయసింహుని కొక్కుమారుగా ముచ్చెమటలు పోశాయి! తమ మేనత్త ఇంత త్వరితంగా రాజ్య పరిత్యాగం చెయ్యగలరని ఆత డూహించలేదు. రాజ్య పరిత్యాగం చెయ్యదలిచి నప్పుడు న్యాయంగా, సంప్రదాయాన్ని అనుసరించి, తనకే కాశ్మీర రాజ్యాధికారం సంక్రమించవలెను గదా! ఇంతకన్న అర్హులైన వారసు లెవ్వరూ లేరు గదా! దీనిలో తన తమ్ముల అంగీకారా నంగీకారాల ప్రసక్తి ఏమున్నది? మహారాజ్ఞి చేసిన ఈ నిర్ణయంలో పరమార్థమేమిటి? ఒకవేళ తమ్ము లిద్దరూ రాజ్యాధికారం తన కియ్యరాదని ప్రతిఘటించిన పక్షంలో, సాంప్రదాయికమైన తన అర్హత వ్యర్థమయిపోవలసినదేనా? ఇదెక్కడి దారుణ న్యాయము? ఇంతకీ నాలో లోపమేమి ఉన్నది?

అత డా విధంగా మథనపడడాని కెన్నో ముఖ్య కారణాలున్నాయి.

విజయసింహుడు ఉదయరాజు కుమారు లందరిలోనూ జ్యేష్ఠుడే కాక మహా బలిష్ఠుడు. అతని కిటీవలే పంచవింశతి వర్షాల ప్రాయం నిండింది. కత్తిసాము, అశ్వారోహణము, సేనావ్యూహ నిర్మాణము మొదలయిన యుద్ధ విద్యలలో ఓహో అనిపించుకున్న గట్టిదిట్ట. ఎంతమంది ఎదట నిలిచి పోరాడినా అసహాయశూరుడై గెలిచిన మల్ల విద్యావేత్త. అయితే అతనికి కాశ్మీర రాజకుమారుల కుచితములయిన ఇతర శాస్త్రాల వ్యాసంగంలో అంతగా అభిరుచి కలగలేదు. అంటీ అంటనట్టుగా అవి అభ్యసించాడు. 'వీరభోజ్యమయిన రాజ్యాని కీ చదువుసంధ్యలతో పని ఏమిటి?' అని తనలో తాను సంతృప్తి పడ్డాడు.

ఇక రెండవవాడు పరాక్రమవర్మ బలిమిలోగాని, శౌర్యంలోగాని, తదితర విషయాలలోగాని అన్న నతిక్రమించలేడుగాని, అన్ని విషయాల లోనూ అతనితో తులతూగ దగిన అసహాయశూరుడే. కాని అత డెన్నడూ కాశ్మీర రాజ్యాధికారం మాటే తలపెట్టలేదు. కాని ఇప్పుడు ప్రధాన

సేనాని తుంగుడు ఆ విధంగా ప్రసంగించిన పిమ్మట శక్తి సామర్థ్యాలలో అన్నింటిలోను అన్నకన్న తానే మిన్న అని అహంకరించాడు. కనక సామర్థ్యాన్నిబట్టి కాశ్మీరాధికారం తనకే సంక్రమించవలెనని, సంక్రమించగలదని నిశ్చయించుకున్నాడు. అగ్రజుని అసమర్థత గ్రహించి తన కివ్వడానికే మహారాజ్ఞి ఆ విధంగా నిర్ణయించి ప్రధాన సేనాని ముఖతః ఆ నిర్ణయం వెల్లడించిందని ఊహించాడు. అంతేకాదు. తలవనితలంపుగా లభించిన ఈ సదవకాశం జారవిడవ కూడదని నిశ్చయించుకున్నాడు.

ఇక మూడవవాడు సంగ్రామరాజు. అతని కిటీవలే ఇరవై ఏళ్ళు నిండాయి. అయితే సహోదరులతో సరిపోల్చినప్పుడు అతడు అంతగా బలిష్ఠుడనిగాని, అశ్వారోహణాది క్షాత్ర విద్యలలో అంతగా నేర్పరి అనిగాని చెప్పడానికి వీలులేదు. కాని చాణక్యుని అర్థశాస్త్రము, కామందకుని నీతిశాస్త్రము, ఇంకా ఇతర శాస్త్రాలూ ఆమూలాగ్రంగా మథించిన మనిషి. అన్నలిద్దరికన్న మిక్కిలి లోకజ్ఞుడు. బహు మితభాషి.

దిద్దాదేవి రాజ్య పరిత్యాగం చెయ్యగలదని ప్రధాన సేనాని ప్రకటించినప్పుడు అతని కేమాత్రమూ నమ్మిక కలగలేదు. ఆమె చండశాసనురాలు! భర్త క్షేమగుప్తుని కాలంలోనే తన చాకచక్యంవల్ల అధికారం సమస్తమూ చేజిక్కించుకున్నది. ఆ విధమయిన అస్వతంత్రతవల్లనే అతనికి దిద్దాక్షేముడన్న పేరేర్పడింది. క్షేమగుప్తుని అనంతరం అతని కుమారుడు నందిగుప్తుడు రాజయినా, క్షయరోగంవల్ల అత డనతికాలంలోనే పరమపదించాడు. అతని కాలంలో కూడా దిద్దాదేవి తన అధికారప్రాభవమే మాత్రమూ సడలనియ్యలేదు! అటుపిమ్మట క్రమక్రమంగా మిక్కిలి పసివారయిన త్రిభువన, భీమగుప్తు లన్న పౌత్రుల నిరువురిని దిద్దాదేవి నామకః మాత్రమే రాజ్యసింహాసనంపై కూర్చుండజేసింది. కాని వారు పసివారయినందువల్ల ఆమె తన హస్తాలనుండి రాజ్యాధికార మే మాత్రము సడలనియ్యలేదు. ఆ పైన ఆ పసివారిద్దరు అనతికాలంలోనే పరమపదించారు. అనంతరం దిద్దాదేవి స్వయంగానే కాశ్మీర సింహాసనంపై పట్టాభిషిక్తురాలయింది. మరి వారసు లెవ్వరూ లేనందువల్ల ఆమె కావిధంగా రాజ్యాధికారం స్వీకరించక తప్పలేదని ప్రధానమంత్రి ప్రధానాధికారుల సమక్షంలో వెల్లడించాడు.

కాని ఆమె మొదటి పౌత్రునికి విషం ఇప్పించి చంపించిందని, రెండవవానిని రహస్యంగా కారాగారంలో ఉంచి వధింపజేయించిందని వదంతి వ్యాపించింది. సంగ్రామ రాజది అతి రహస్యంగా తన కాప్తులయిన చారులవల్ల ఆకళించుకున్నాడు.

తన అన్నలిద్దరికి ఈ రహస్య వృత్తాంతాలేవీ తెలియలేదని సంగ్రామునికెరుకపడింది. కనకనే వారంతగా రాజ్యాధికార స్వీకరణ కోసం మిక్కిలి ఉబలాట పడుతున్నారని ఆతడెరుగును. అయితే అంతటి అధికార తృష్ణ కలిగిన తమ మేనత్త నిజంగానే రాజ్యాధికారం యావత్తూ విసర్జించబోతున్నదా? ఒకవేళ వార్ధక్యంవల్ల, అంతుదొరకని రుగ్మతవల్ల ఆమె ఆ విధంగా సంకల్పించిందేమో! ఏది ఏమయినా తానీ మహనీయావకాశమే మాత్రమూ జారవిడవకూడదని సంగ్రామరాజు నిశ్చయించుకున్నాడు.

ఆ తీరులో ఆ సహోదరులు ముగ్గురూ తమలో తాము మథనపడుతున్న సమయంలో దిద్దాదేవితో రహస్యంగా సంప్రతించిన తుంగసేనాని తటాలున లేచి నిలుచున్నాడు.

"తమ అనంతరం మీలో మీకు కలతలవల్ల చల్లగా సాగిపోతున్న తమ ఏలుబడిలో అనావశ్యకమయిన కల్లోలాలేర్పడగలవేమో అన్న భీతితోనే మహారాజ్ఞి ఈ ప్రకారంగా నిర్ణయించారు. మీ ముగ్గురిలోనూ ఏ ఇద్దరయినా ఏకీభవించి మూడవవారిని పేర్కొన్న యెడల మహారాజ్ఞి వారికే రాజ్యాధికారం ప్రసాదించవలెనని నిశ్చయించుకున్నారు."

అయినా వారిలో ఎవ్వరిలోనూ కదలిక కానరాలేదు. మరికొంతసేపటికి వారిలో ఏ ఇరువురికీ ఏకాభిప్రాయం కుదరలేదని తుంగసేనాని నిర్ణయించుకున్నాడు. తిరిగి అదే అభిప్రాయం సూచించి 'మీ అభిప్రాయమే' మన్నట్టు విజయసింహునివైపు అవలోకించాడు.

అతడు రవంతసేపు తటపటాయించి నెమ్మదిగా లేచి నిలుచుని విన్నవించాడు:

"మహారాజ్ఞీ! ఎన్నడో సకృత్తుగా గాని జ్యేష్ఠుల నుజ్జగించి పిన్నవారికి రాజ్యాధికార ప్రదానం కాశ్మీర రాజవంశంలో సంఘటిల్లలేదు.

నా శక్తిసామర్థ్యాలను గురించి నేనే ప్రశంసించుకోవడం న్యాయం కాదుగదా! నా విషయం తమ్ముల కిద్దరికీ చిరకాలంనుండి అవగతమే. కనక వారిరువురూ నా ఎడల తమ అంగీకృతి విస్పష్టంగా వెల్లడించగలరని నా నమ్మిక. ఆ విధంగా వారు నిర్ణయించిన పక్షంలో వారిరువురికి సముచితములయిన రాజ్యాధికార పదవులు ప్రసాదించి వారి తోడ్పాటుతోనే ప్రజాపరిపాలనం కొనసాగించగలను. ఇంతే కాదు. పట్టాభిషిక్తుడనయినా నే ననుక్షణమూ మహారాజ్ఞి కనుసన్నలలో మసులుకోగలను. ఇంతే కాదు. చిట్టచివరి కేవిధంగా నిర్ణయం జరిగినా నేనెల్లప్పుడు మహారాజ్ఞి కన్నివిధాలా తోడునీడనై, నా సహోదరులలో ఎవ్వరు కాశ్మీరా ధీశ్వరులయినా వారి కండగా నిలిచి సాహాయ్యపడగలను."

ఆ ప్రసంగం విని దిద్దాదేవి రవంత అభినందన పూర్వకంగా శిరఃకంపం చేసి తుంగసేనానివైపు తిరిగి చిరునవ్వు చిలకరించింది.

పరాక్రమవర్మ దానిలో గల పరమార్థం క్షణంలో ఆకళించుకున్నాడు. తుంగసేనాని చూపాకించుక తనపై నిలిచినంతలోనే ఒరలోనించి దూసిన కరవాలంలా తటాలున లేచి నిలుచున్నాడు.

"మహారాజ్ఞీ! తాము తుంగసేనానుల ముఖతః సెలవిచ్చినట్లు మాలో అధమం ఏ ఇరువురయినా ఆమోదించినప్పుడే కాశ్మీరాని కనాయాసంగా భద్రత ఏర్పడగలదు; యథార్థమే. కాని రాజ్యం వీరభోజ్యం కనక మా ముగ్గురికీ ఏదయినా వీర యుద్ధవిద్యలో పరీక్ష ఏర్పరిచి ఉత్తము లెవ్వరో నిర్ణయించినపిమ్మట వారికే రాజ్యాధికారం ప్రసాదించవలెనని ప్రార్థిస్తున్నాను. ఆ పరీక్షలో ఎవ్వ రారితేరినా వారికి నేననుక్షణము అనుచరుడనై సేవించుకోగలను. ఇందువల్ల కాశ్మీరాని కన్నివిధాలా అర్హులయినవారే అధీశ్వరులు కాగలరని, తద్ద్వారా సుస్థిర భద్రత ఏర్పడగలదని భావిస్తున్నాను."

ఆ విధంగా ప్రసంగించినపిదప అతడావేశంతో రవంత వణికిపోతూ తన సింహాసనంపై చతికిలబడ్డాడు. వెనువెంటనే తుంగసేనాని దృష్టి కనిష్ఠుడు సంగ్రామరాజుపై పడింది.

అతడోకించుకసేపు తటపటాయించి, సేనాని కెదురుచెప్పలే

నట్టుగా రవంత తటస్థదృష్టితో లేచి నిలుచున్నాడు. అత్యంత వినయంతో దోసిలికట్టి తన కసలు కాశ్మీరాధిపతి కావలెనన్న అభిలాషే లేదన్నాడు. అయితే మహారాజ్ఞి ఆజ్ఞ అతిక్రమించ నేరక తానక్కడికి వచ్చినట్టు విన్నవించాడు. సాంప్రదాయికంగా రాజ్యాభిషేకం జరిపించినా, లేక సామర్థ్య పరీక్ష చేసి అర్హులయినవారిని అభిషేకించినా తానిక అన్నలిద్దరిలోనూ ఎవ్వరికయినా తోడు నీడగా మసులుకోగలనని మాట ఇచ్చాడు. ఒకవేళ పరీక్ష ఏర్పరిచినపక్షంలో తన్ను ఆ పరీక్షనుండి తప్పించి అన్నలిద్దరికే అది ఏర్పరచవలిసిందనికూడా వేడుకున్నాడు. అయితే పరీక్షలో పాల్గొనవలిసిందని మహారాజ్ఞి ఆజ్ఞాపించిన పక్షంలో తా నామె ఆజ్ఞ శిరసావహించగలనని విన్నవించాడు. కేవలం కాశ్మీరరాజ్య సంరక్షణంకన్న, అగ్రజుల పరిచర్యకన్న తన కిక వేరొక కోరిక ఏదీ లేదని విజ్ఞప్తిచేసి తిరిగి వినమ్రుడై కూర్చున్నాడు.

అన్నదమ్ములు ముగ్గురూ ప్రసంగించిన పిదప తుంగసేనాధిపతి మహారాజ్ఞి మనోగతం గుర్తించి లేచి నిలిచి తదనంతర కర్తవ్యం నిర్దేశించాడు.

"ఉదయరాజ తనూజులారా! మీరు ముగ్వురూ పాలవంటి సుక్షత్రియ వంశంలో ప్రభవించిన మహావీరులు! కనకనే క్షత్రియ మర్యాద ఏమాత్రమూ అతిక్రమించక మీమీ మనోగతా లెరిగించారు. దీనికి మహారాజ్ఞి మిక్కిలి ఆనందించారు. అయితే మీ ముగ్వురిలోనూ ఏ ఇద్దరూ ఏకీభవించి మూడవవారి నెన్నుకోవడం సంఘటిల్లలేదు. ఇది మహారాజ్ఞి మీ పొరుపొటిరేకతకే తార్కాణమని భావిస్తున్నారు. అయితే ఏ ఇరువురికయినా ఏకాభిప్రాయం కలిగినపక్షంలో ఆమె ఇనుమిక్కిలిగా ఆనందించి ఉండేవారు! సరే, దానికేమి! ఒకవేళ ఇది ఈ విధంగా సంభవించవచ్చునన్న అభిప్రాయంతో మహారాజ్ఞి మీకొక పరీక్ష ఏర్పరచవలెనని నిర్ణయించుకున్నారు. దీనిలో మీరు ముగ్వురూ పాల్గొనవలెనని దిద్దాదేవి నిర్ణయము. దీనికి మీ రంగీకరిస్తున్నారా?"

ఆ ప్రసంగం విన్నపిదప ముగ్గు రన్నదమ్ములూ సవినయంగా లేచి నిలిచి దానికి తమ అంగీకృతి వ్యక్తీకరించారు. వారిలో జ్యేష్ఠుడు, తనకది అంతగా అభిమతం కాకపోయినా మరి గత్యంతరంలేక, సరే కానున్న

దేదో కాకమానదని, తనకిక భుజబలమే దిక్కని నమ్ముకుని పైపైకి పరిపూర్ణాంగీకారం ప్రకటించాడు. రెండవవాడు తన పంతం నెగ్గినందుకు ఉబ్బి తబ్బిబ్బయి ఇక విజయం తనదే అనుకుని లోలోపల ఉప్పొంగిపోయాడు. మూడవవాడు సంగ్రామరాజు తన కది ఇష్టంలేకపోయినా మహారాజ్ఞి అనుమతి తిరస్కరించలేక ఆ పరీక్షలో పాల్గొంటున్నట్టు తన అభిమతం వెల్లడించాడు.

వారి అం      లభించినంతలోనే సేనాని తిరిగి అందుకున్నాడు.

"ఇదిగో, ఈ పెద్ద బంగారుపాత్రిక పరిశీలించారా? దీనిలో మూడు నూరులు పాలేవత ఫలాలున్నాయి. ఇవి నేను మీ ముగ్గురిమధ్య క్రమక్రమంగా విసిరివెయ్యగలను. మీ ముగ్గురిలోను అత్యధిక సంఖ్యలో ఈ ఫలాలు చేజిక్కించుకున్నవారికే పట్టాభిషేకం జరిపించవలెనని మహారాజ్ఞి నిర్ణయించుకున్నారు. ఒకవేళ ముగ్గురికీ సరిసమానంగా ఫలాలు లభించినప్పుడు మహారాజ్ఞి జ్యేష్ఠులకే రాజకిరీటం ప్రసాదించగలరు. ఇవిగో, ఈ మూడు చిన్న చిన్న పైడిపాత్రికలు మీ రొకొక్కరూ చేతబుచ్చుకుని, దక్కించుకున్న ఫలాలు వానిలో భద్రపరుచుకోవలెను. ఈ సమయంలో మీ రేమాత్రమూ ఆయుధాలు ఉపయోగించరాదు. దీనిలో శరీరశక్తి పరీక్షతోబాటు హస్తలాఘవ బుద్ధిచాకచక్యాల పరిశీలన కూడా జరగగలదు. అయితే మొత్తంమీద అత్యధిక ఫలా లెలాగయినా సేకరించుకున్నవారికే కాశ్మీరరాజ్య కాంచనకిరీటం లభించగలదు. మీరు ముగ్గురు సర్వసంసిద్ధులయిన తరువాత మహారాజ్ఞి తమ హస్తం పైకెత్తిన మరుక్షణంలోనే పరీక్ష ప్రారంభం కాగలదు."

దానికి మహోదరులు ముగ్గురూ అనుమతించి సర్వసంసిద్ధులయి రవంత దూరంలో ఒక క్రమంలో నిలుచున్నారు.

విజయసింహుని కది ఒక పెద్ద పరీక్షగా భాసించలేదు. కాని పరాక్రమవర్మ తనతో మల్లయుద్ధం కొనసాగించి అయినా పళ్ళు ఎక్కువగా కాజెయ్యగలడని గ్రహించుకున్నాడు. అయితే ఆతని నిట్టే నెట్టివేసి సేనాని విసిరిన ఫలాలన్నీ స్వాధీనం చేసుకోవడం చాలా తేలిక అని నిర్ణయించుకున్నాడు.

పరాక్రమవర్మ అన్నకన్న మిన్నగానే అహంకరించాడు. అతనికి ఈ పరీక్షలో అఖండవిజయం తథ్యమన్న దృఢనిశ్చయం కలిగింది. తన శిరస్సుపై కాశ్మీరరాజ్య కిరీటం తళతళలాడినట్లు స్ఫురించింది. శరీరం గగుర్పొడిచింది! ఎదురుగా సింహాసనంపై సమాసీనురాలయిన మహారాజ్ఞి తనకే రాజ్యప్రదానం చెయ్యదలిచి ఈ మిష ఒకటి కల్పించినట్టు అత డను క్షణమే నిర్ణయించుకున్నాడు. ఆ సమయంలో ఆమె ప్రసన్న వీక్షణం తనపై ప్రసరించడాని కదే కారణమని ఆనందావేశంతో తలమునక లయి నాడు!

ఇక సంగ్రామరాజు తన అన్నలిద్దరూ తనకన్న మిక్కిలి బలిష్ఠులని అంతకుమునుపే గ్రహించుకున్నాడు. అందుచేత వారిరువురిలో ఎవరో ఒకరికి విజయం తథ్యమని నిశ్చయించుకున్నాడు. అయితే అంతమాత్రం చేత అత డోకించుకయినా నిరుత్సాహపడలేదు. తన యావచ్ఛక్తి, మల్ల విద్యా పాండిత్య, చాకచక్యము వినియోగించి ఆ పరీక్షలో పాల్గొని అంతిమ విజయం ఆ దైవానికే విడిచివేయవలెనని నిశ్చయించి ఇనుమడించిన ఉల్లా సంతో సర్వసన్నద్ధుడైనాడు.

తుంగ సేనాని జ్యేష్ఠానుక్రమంలో వారి ముగ్గురికి బంగారుపాత్ర లందించాడు. తా నా పెద్ద పాత్రపక్కనే నిలిచి "మీరందరు సంసిద్ధు లేనా?" అని ప్రశ్నించాడు. చిరునగవులతో, శిరఃకంపాలతో వారందరు తమ సన్నద్ధత వెల్లడింపగానే సేనాని మహారాజ్ఞి హస్తసంజ్ఞకో: నిరీ క్షించాడు.

ఆమె "విజయీభవ!" అని వారొక్కొక్కరివైపూ చూచి ఆశీర్వ దించింది. పరాక్రమవర్మ ఆమె తన వైపవలోకించినప్పుడు ఎంతో ఆత్మీ యత అభివ్యక్తమయిందని అనుకున్నాడు. విజయసింహు డది ఒకకంట గమనించాడు. సంగ్రామరాజు విషయం గ్రహించినా గ్రహించనట్టే నటించాడు.

మరుక్షణంలోనే దిద్దాదేవి వికసించిన ఎర్రతామరవంటి తన దక్షిణ హస్తం పైకెత్తింది. తుంగసేనాని ఒక్కమారుగా నిండుదోసిలితో అయి దారు పాలేవత ఫలాలెత్తి పట్టుకుని వారివైపు చూచి చిరునవ్వు నవ్వి,

క్షణంలో నేలమీదికి విసిరివేశాడు! ఉత్తరనిమేషంలోనే వారు ముగ్గురూ అవి చేజిక్కించుకోవడంకోసం పెనుగులాట లారంభించారు. విజయ సింహుడు డొక్కతోపుతో తమ్ముల నిద్దరిని ఆ సభాగారాని కొక్కమూలగా నెట్టి ఆ పాలేవత ఫలాలలో నాలుగైదు తన పాత్రికలో భద్రపరుచు కున్నాడు. పరాక్రమవర్మ ఆ పరాభవంతో భగ్గుమని మండిపడి అన్నతో తలపడి మల్లయుద్ధం ప్రారంభించాడు. అదేక్షణంలో తుంగసేనాని మరి కొన్ని పాలేవత ఫలాలు నేలమీదికి విసిరివేశాడు. రంగురంగుల స్వచ్ఛ చంద్రకాంతశిలలతో తాపటంచేసిన ఆ మంత్రాగారం నేలపై పడి అవి ప్రతిఫలిస్తున్న స్వరూపాలతో వివిధవర్ణాల కందుకాలవలె నలువైపులా దొర్లిపోయాయి. అంతలోనే పరాక్రమవర్మ అన్నతో కొనసాగిస్తున్న ద్వంద్వయుద్ధం మానేటే తలపెట్టక వెనుదిరిగి ఆ ఫలాలు కొన్నింటిని పట్టు కుని, చేజిక్కించుకోవలెనని శాయశక్తులా ప్రయత్నించాడు. కాని అంత లోనే వానిలో కొన్నింటిని సంగ్రామరాజు తన పాత్రికలో జాగ్రత్త చేసుకున్నాడు.

వారిలో ఏ ఇరువురు పళ్ళకోసం పెనుగులాట ప్రారంభించినా వెనువెంటనే తుంగసేనాధిపతి మరికొన్ని ఫలాలు దోసిళ్ళతో తీసి నేల మీదికి విద్యుద్వేగంతో విసిరివేసేవాడు. అందువల్ల వారిలోవారికి ద్వంద్వ యుద్ధాలు త్తర క్షణంలోనే నిలిచిపోయాయి. కాని ఆ పళ్ళకోసం పెనుగు లాట మాత్రం మరింత భీషణంగా కొనసాగుతూనే ఉన్నది. ఒకటి రెండు మారులు పరాక్రమవర్మ తనకన్న ఎంతో బలిష్ఠుడయిన అన్నతో తలపడి ఇట్టే నేలమీద పడగొట్టినప్పుడు మహారాజ్ఞి, సేనాని ఎంతగా నిగ్రహించు కున్నా అతని నభినందించకుండా ఉండలేకపోయారు! అయినా విజయ సింహుడు నిరుత్సాహపడక ఇనుమడించిన వీరావేశంతో అత న్నిట్టే చిత్తు చేసి తుంగసేనాని జయజయాభినందన లందుకున్నాడు.

అంతలోనే ఆ సేనాని మాటిమాటికి ఫలాలెత్తి వేగంగా నేల మీదికి విసిరివేశాడు. అన్నదమ్ములు ముగ్గురిమధ్య వాటికోసం సంకుల సమరం నిరవధికంగా కొనసాగింది. మరికొన్ని నిమిషాలలోనే తుంగ సేనాని పరీక్ష ముగిసిందని ప్రకటించాడు. అదేసమయంలో మహారాజ్ఞి కవంత చెయ్యెత్తి వారి పోరాటం విరమించవలసిందని ఆదేశించింది. అంత

వరకు పరాక్రమవర్మ అన్న విజయసింహునితో తలపడి పోరాడుతూనే ఉన్నాడు. కాని అటుపిమ్మట అన్నదమ్ములు ముగ్గురూ పాలేవత ఫలాలతో నించిన తమతమ సువర్ణపాత్రికలు పరిశీలనార్థం తుంగసేనాని ముందుంచి ఒగర్చుకుంటూ తమతమ సుఖాసనా లలంకరించారు.

వెనువెంటనే తుంగసేనాని ఆ ముప్వు రన్నదమ్ములఎదుట వారివారి పాత్రికలలో గల ఫలాల పరిగణనం ప్రారంభించాడు. మరికొంతసేపటికి జ్యేష్ఠుడు విజయసింహుని పాత్రికలో గల ఫలాల పరిగణనం ముగిసింది.

అందరికన్న బలిష్ఠుడయిన అతని పాత్రలో గల ఫలాలన్నీ తొమ్మిది పదులుమాత్రమే. అయినా అత డుదాత్త వైఖరితో చిరునవ్వు చిందించి మౌనం వహించాడు. తుంగసేనాని పైపైకి నిష్పక్షపాతవైఖరి అవలంబించినా అందరికన్న పెద్దవాడు కనక అతనికే రాజ్యాధికార ప్రదానం న్యాయమని భావించాడు. అయితే దైవానుకూల్యం లేకపోవడం వల్ల అతని కా పరాజయం సంఘటిల్లినదని, ఇక పరాక్రమవర్మకే రాజ్యాధికారం సంక్రమించగలదని నిశ్చయించుకున్నాడు.

మరికొంతసేపటికి పరాక్రమవర్మ పాత్రికలో గల పాలేవతాల లెక్క ప్రారంభమయింది. కాని అది అతిత్వరితంగానే ముగిసింది. అతని పాత్రికలోగల ఫలాలన్నీ కలిసి మొత్తం తొమ్మిదిపదులపై నాలుగు మాత్రమే! ఇక మిగిలిన సంగ్రామరాజు పాత్రికలోగల ఫలాలన్నీ కలిసి నూటపదారని తేలిపోయింది!

దిద్దాదేవీ, తుంగసేనానీ అది గమనించి నిలువునా నిర్ఘాంత పడ్డారు! తా నేమయినా పొరబడ్డానేమో అని తుంగసేనాని సంగ్రామరాజు చేజిక్కించుకున్న పళ్ళని జాగ్రత్తగా ఇంకొకమారు లెక్కించాడు. అదే సంఖ్య వచ్చింది! అదే విషయం మహారాజ్ఞి కెరిగించి సంగ్రామరాజువైపు తిరిగి సగౌరవంగా శిర స్సల్లన వంచి అభినందించాడు.

పరాక్రమవర్మ ఆ పరీక్షలో తప్పక జయించగలడని దిద్దాదేవి నిశ్చయించింది. కాని ఫలితం ఆవిధంగా అ స్తవ్య స్తమయినందుకు ఆమె మరి తన కన్నులే నమ్మలేక, సంగ్రామరాజువైపు చూచి చిరునగవుతో అభినందించి "ఇన్ని పాలేవతా లెలాగ సంపాదించుకున్నావు? అన్న లిద్దరూ గాయపడినంతగా నీవేమీ గాయపడలేదే?" అని ప్రశ్నించింది.

ఆత డత్యంత వినయంతో లేచి నిలుచుని నివేదించాడు:

"మహారాజ్ఞీ! ఒకే ఫలితం అర్థించి ఇరువురు హోరా హోరీగా పోరాడుతున్నప్పుడు అదేఫలం అర్థించిన మూడవవాని కది అవలీలగా లభించగలదు. అయితే ఇటువంటప్పుడు మిక్కిలి మెలకువ అవసరం. అన్న లిద్దరూ ఎడతెగని ద్వంద్వ యుద్ధాలు కొనసాగిస్తున్నప్పుడు నేను నేలమీద పడి దొర్లుతున్న పాలేవతాలే కాక, పోరాటంలో వారి గుప్పిళ్ళనుండి జారిపడిన ఫలాలెన్నో అవలీలగా సంగ్రహించి నా పాత్రలో భద్రపరుచుకున్నాను. వారితో చిన్న చిన్న పోరాటాలు కొనసాగించి మరికొన్ని చేజిక్కించుకున్నాను. ప్రత్యక్షంగా వారితో పోరాడక పార్శ్వాలలోనే నిలిచి అఘాతా లెక్కువగా తగలకుండా తప్పించుకున్నాను. నా విజయంలో గల చాకచక్య రహస్య మింతే!"

ఆ వివరణ విని క్షణకాలం నిర్ఘాంతపడిన మహారాజ్ఞి తిరిగి ఆతని నభినందించి అనతికాలంలోనే రాజ్యాధికారం ప్రసాదించనున్నట్టు విస్పష్టంగా వెల్లడించింది.

అది విని అన్న లిద్దరూ రవంత సేపు తటపటాయించి ఒకరి తరవాత ఇంకొకరు "జయ! జయ! కాశ్మీరాధీశ్వరా! జయ!" అని ఆతని నభినందించి తా మాతనికి తోడునీడలు కాగలమని వ్యక్తీకరించారు.

అంతలోనే సంగ్రామరాజు లేచి నిలిచి వారి కిద్దరికీ అతి వినతుడై వంగి నమస్కరించి "నా పట్టాభిషేకం జరిగే పర్యంతమూ నేను కేవలం మహారాజ్ఞి చరణ సేవకుడనే! అంతవరకూ కాశ్మీరాధీశ్వరి దిద్దాదేవి మాత్రమే! ఇందువల్ల ఈ విజయం మహారాజ్ఞిదే!" అని "జయ! కాశ్మీరాధీశ్వరీ, జయ!" అని ఆమె నభినందించాడు. ఆమె ఆతని మహారాజ మర్యాదాభిజ్ఞత కెంతో ఆనందించింది. తుంగసేనాని ఆతని లోకజ్ఞత గమనించి, లోలోపల తన కంతగా ఇష్టంలేకపోయినా, ఆతడే అన్ని విధాలా రాజ్యాధికారాని కర్హుడని నిశ్చయించి, "సాధు! రాజకుమారా! సాధు!" అని ప్రశంసించాడు. నిజానికి అతనికి దిద్దాదేవి కౌటిల్యనీతి సరిపడలేదు. కాని మారాడలేక అంగీకరించి అభినందించాడు.

ఆ మరునాడే సంగ్రామరాజు యథావిధిగా పట్టాభిషిక్తుడై కాశ్మీరాధీశ్వరుడయి ప్రజానీకం ప్రశంస లందుకున్నాడు.

# నిశిత ధర్మదృష్టి

యశస్కర మహారాజు ప్రాసాదంముందు ఘోరమని పెద్ద కల కలం చెలరేగింది. జనం గుంపులు గుంపులుగా చేరి ముమ్మొందుకు తోసుకువస్తున్నారు. రాజభటులు వారిలో జొరబడి కొందరిని వెను వెంటనే వెనక్కి నెట్టివేస్తున్నారు.

మహారాజ సౌధానికి ఎదురుగా ఉన్న సువిశాల ప్రాంగణంలో బక్క చిక్కిన బ్రాహ్మణు డొకడు ఆమరణాంత ప్రాయోపవేశ దీక్ష ప్రారంభించాడు. కాశ్మీరంలో తమ కేదైనా అన్యాయం జరిగినప్పుడు ఒక్కొక్కప్పుడు ఆయా వ్యక్తులు అన్నపానా లుజ్జగించి ఆమరణాంత నిరాహారదీక్ష లారంభిస్తారు. రాజ్య పరిపాలనలో దురన్యాయా లేవయినా జరుగుతున్నప్పుడు బ్రాహ్మణుల పరిషత్తే స్వయంగా కల్పించుకుని ప్రాయోపవేశాలు ప్రారంభింప జేయిస్తూంటుంది.

అయితే గుమ్మపాలవంటి కాశ్మీర బ్రాహ్మణుల వంశంలో ప్రాదుర్భవించిన యశస్కర మహీపతి ధర్మపరిపాలనలో అటువంటి విడ్డూరాలు ఎప్పుడో సకృత్తుగా గాని సంఘటిల్ల లేదు. కనకనే ఆనాడు కాశ్మీర రాజధాని శ్రీనగరి పౌరు లంతగా ఆశ్చర్యపడుతూ అదే విషయం తమలో తా మనేకవిధాలుగా ముచ్చటించుకుంటున్నారు.

అంతలోనే పెద్ద నీలి తలపాగాతో ఒక రాజాధికారి మిక్కిలి అడకువతో ప్రాయోపవేశం ప్రారంభించిన వ్యక్తిని సమీపించి ఆ దీక్ష విరమించవలసిందని పరిపరివిధాల వేడుకున్నాడు. ఆ పైన నయానా భయానా బాగా బెదిరించి చూశాడు. అయినా ఆ బ్రాహ్మణుడు ఆ అధి కారి మాట ఆవంతయినా చెవి కెక్కనియ్యలేదు. అతని పేరు క్షీరేశ్వర భట్టారకుడు. ఆ మంకుపట్టు, గట్టి పట్టుదల, పౌరుషము ఆ నామధేయానికి తగ్గట్టుగానే ఉన్నాయని ఆ మహాధికారి విసుక్కున్నాడు. అతడు ఆ రోజులలో ఇటువంటి ప్రాయోపవేశ దీక్షల వ్యవహారాలు పర్యవేక్షించే

పరిపాలక వ్యవస్థ పరమాధికారి. అయినా వీరేశ్వరభట్టారకుడు అతని మాట వట్టి ఎండు గడ్డిపోచ అన్నట్టు కొట్టి పారేశాడు!

పురాతన కాలంనించి ఎంతటి పరమ బ్రహ్మణ్యులయినా కాశ్మీర విప్రులు ఎముకలు కొరికివేసే చలి భరించలేక సామవేద పారాయణ సమయంలో ద్రాక్షామదిర సేవించేవారు. అయితే యశస్కరమహారాజు అది కేవలం దురాచారమని నిర్ణయించి పూర్తిగా నిర్మూలించివేశాడు. ఇంకా అటువంటి దురాచారాలెన్నో ఆ ధర్మమూర్తి చల్లని ఏలుబడిలో నిశ్శేషంగా రూపుమాసిపోయాయి. ఎక్కడా ఏ విధమయిన అలజడీ, ఆందోళనా లేక ప్రజానీకం హాయిగా తన మనుగడ కొనసాగించుకొంటున్నది.

మరి ఈ వీరేశ్వరభట్టారకుడీ విధంగా ప్రాయోపవేశం కొనసాగించడాని కేమిటి కారణము? పోనీ అనుకుంటే ఇతగాడు దీనికి గల అసలు కారణమేమో మహారాజుతో తక్క తదితరుల కెవ్వరికీ వెల్లడించనంటున్నాడు. వెల్లడించినా ప్రయోజనం లేదని శరిస్తున్నాడు.

మహాధికారి కొక్కమారుగా దురహంకారావేశం తలకెక్కింది. ఆ మూర్ఖ విప్రుణ్ని రాజప్రాసాదం ప్రాంగణంనించి దూర దూరంగా తొలగించి వెయ్యాలని నిర్ణయించుకున్నాడు. మరుక్షణంలోనే అతని కనుసన్న గ్రహించి రాజభటు లిద్దరుముగ్గురు అతణ్ని అక్కడినించి వేరొకచోటికి తీసుకుపోవాలని శాయశక్తులా ప్రయత్నించి బలవంతంగా తమ సందిట ఇరికించుకున్నారు.

వీరేశ్వరభట్టారకుడు కాళ్ళతో, చేతులతో వారి నొక్కుమ్మడిగా విదిలించివేశాడు! ఆ విధంగా బలాత్కరిస్తే అక్కడే ఉరిపోసుకొని మరణించగలనని భుజంమీది అంగవస్త్రం మెడచుట్టూ బిగించుకుని దాని కొసలు రెండూ రెండు చేతులతోనూ గట్టిగా పట్టుకున్నాడు.

అది గమనించి ప్రజలొక్కుమ్మడిగా రాజభటులపై విరుచుకుపడి వారి నక్కడినించి తరిమివేసి ప్రాయోపవేశాధికారి మీదికి లంఘించారు! దానితో అతని కిక కాలికి బుద్ధి చెప్పక తప్పలేదు!

అప్పటికప్పుడే కొంచెం చీకటిపడింది. మహారాజ ప్రాసాదం పైఅంతస్తులపై కాచగోళాలలో దీపికలు జాజ్వల్యమానంగా వెలుగు

తున్నాయి. పలచని లేతవెన్నెల రాజవీథిలో చీకటి నొరుసుకుని చిన్న సెలయేరులా ప్రవహిస్తున్నది. క్రమక్రమంగా ఆ చీకటిలో జనసందోహం కొద్దికొద్దిగా పలచబడుతున్నది. రాజవీథిలో వాహ్యాళినుండి మరలివస్తున్న క్షత్రియ యోధుల ఉత్తమాశ్వాల డెక్కల సవ్వడులు అప్పుడప్పుడు మృదంగ ధ్వనులన్న విభ్రాంతి కలిగిస్తున్నాయి.

మహారాజు ఆ సమయానికి సాయంకాల సంధ్యాదికం ముగించుకుని భోజనాత్పూర్వం రవంత విశ్రమించే అలవాటు కనక మహాప్రాయోప వేశాధికారి బాగా జంకుతూనే ద్వారాధికారి ముఖతః తన రాక నివేదించాడు. అతికష్టంమీద దర్శనం లభించగానే వీరేశ్వరభట్టారకుని ప్రాయోపవేశ వ్యవహారం తనచెయ్యి దాటిపోయిన వృత్తాంతం తడబడుతున్న పలుకులతో సంగ్రహంగా విన్నవించాడు.

యశస్కరుడది ఆలకించి రవంతసే పాలోచించి వెంటనే వీరేశ్వర భట్టారకుని తన సమక్షానికి తోడుకొని రావలిసిందని కనుసన్నతో ఆజ్ఞాపించి పూజాభవనంలో చిత్రాసనంపై సమాసీనుడయినాడు. అంతగా ఆమరణాంతం ప్రాయోపవేశదీక్ష స్వీకరించవలసివచ్చిన ఆతనికి జరిగిన దురన్యాయం ఏమయి ఉంటుందా అని ఆలోచించడం ప్రారంభించాడు. అదే సమయంలో యశస్కరునికి తన పిన్ననాటి దుర్భర దారిద్ర్యము, ఇరుగు పొరుగుల ఈసడింపులు, తలవని తలంపుగా కాశ్మీర సింహాసనాధిపత్య ప్రాప్తి ఆదిగాగల పూర్వగాథలు కొన్ని స్మృతిపీథిలో క్రమక్రమంగా సాక్షాత్కరించాయి.

క్రీస్తుశకం 939 తరవాత కాశ్మీరంలో ఉత్పల రాజవంశం పరిపాలన పరిసమాప్తమయింది. ఆ వంశీయులలో చిట్టచివరివాడు ఉన్మత్తావంతి కన్నతండ్రినే రహస్యంగా సంహరింపజేయించిన పరమ పాపి. అయితే చిట్టచివరి కతనికి అనేకమయిన దుస్సహావ్యాధులతో, వ్యథలతో అంత్యదశ సంప్రాప్తించింది. అప్పటి కతనికి సంతతిలేదు. అయితే అంతకు మునుపే ఎవరో ఒక పసివాణ్ణి అతి రహస్యంగా అంతఃపురంలో చేర్పించి

అతడే తన కుమారుడయినట్లు ప్రకటింపజేయించి మరణించాడు. కాని ఆ పరమ రహస్యం కొంతవరకు శ్రీనగరిలో నలుగురి నోటా పడి పాక్కింది.

అదే తరుణంలో సర్వసైన్యాధిపతి కమలవర్ధనునికి కాశ్మీరరాజ్యం చేజిక్కించుకోవాలన్న తహతహ కలిగింది. రాజధాని కెంతో దూరంలో ఉన్న ఆ సేనాని తన సైన్యాలతో తక్షణమే ప్రయాణమై శ్రీనగరం చుట్టు ముట్టి అచిరకాలంలోనే రాజభవనంలో ప్రవేశించాడు. ఆ దుర్వార్త మున్ముందుగానే పసికట్టిన ఉన్మత్తావంతి పట్టపురాణి తన దత్తపుత్రునితో బాటు వేరొక సురక్షిత ప్రదేశానికి తొలగిపోయి తలదాచుకున్నది.

ఇటువంటి అల్లకల్లోలా లేర్పడి, రాజ్యం అరాజక మయిపోతున్నప్పుడు కాశ్మీర బ్రాహ్మణ పరిషత్తు సమావిష్టమై సమర్థుల నెన్నుకుని వారికే రాజ్యాధికారం సంక్రమింపజేస్తూంటుంది. ఆ కాలంలో ప్రముఖులే కాక ప్రజలందరూ ఆ పరిషత్తు అంతిమ నిర్ణయాని కిక తిరుగులేదని శిరసావహించి అనుసరిస్తారు. ఇప్పు డా పరిషత్తు సమావేశం ప్రారంభమయింది.

అయిదారు దివసాలవరకు దాని తర్జనభర్జన లెటూ తెగలేదు. అది గ్రహించిన సర్వసేనాని కమలవర్ధనుడు పరిషత్తు మధ్యలో దోసిలికట్టి నిలిచి పట్టపురాణి పెంపకంలో ఉన్న కుమారుడు ఉన్మత్తావంతి ఔరసుడు కానే కాడన్న పరమరహస్యం నెమ్మదిగా బయటపెట్టాడు. నీళ్ళు నము లుతూ, రాజ్యాధికారం తన కప్పగించినపక్షంలో ప్రజల అలజడి క్షణంలో పటాపంచ లయిపోగలదని శపథంపట్టి వాగ్దానం చేశాడు. కాని పరి షత్తులో బ్రాహ్మణుల కెవ్వరికీ అతనిపై సద్భావం కలగలేదు. పైగా ప్రస్తుత రాజ్య కల్లోలాని కతడే ప్రధానకారణమని వారందరూ ఒక్క మారుగా గొంతులెత్తి దూషించి దుమ్మెత్తిపోశారు. ఇటుకరాళ్ళు రువ్వి మరి తమ దరిమానానికయినా రాకుండా దూరదూరంగా తరిమివేశారు! ఆ మరునాడు పట్టపురాణి తన కుమారునికే రాజ్యాధికారం సంక్రమింప జేయించవలసిందని యశస్కరుని ముఖతః బ్రాహ్మణ పరిషత్తు కొక విజ్ఞప్తి పంపించింది.

యశస్కరుడు కాశ్మీర విప్రులలో అంతగా ఉత్తమ వంశీయుడు కాడు. కాని అతని తండ్రి, తాత కాశ్మీర రాజన్యుల కోశాగారాగలయి

సముచిత గౌరవం సంపాదించుకున్నారు. యశస్కరుడు కొంచెం పెరిగి పెద్దవాడయిన తరవాత తాత, తండ్రి సంపాదించిన సంపత్తి అంతా అప్పులపాలయి పూర్తిగా తుడిచిపెట్టుకు పోయింది. అతని కిక ఆ పూట యినా గడవని దుర్భర పరిస్థితి తటస్థించింది. అయినా యశస్కరు డధైర్యపడలేదు. నిరంతర శ్రమకోర్చి, చిరకాలం గురుకుల వాసంచేసి మహా విద్వాంసు డనిపించుకున్నాడు. అంతేకాక వాదోపవాదాలలో దిగ్దంతులయిన అనేక మహా విద్వాంసుల నోడించి గొప్ప మేధావి, వక్త, వాదోపవాద-చతురుడు అన్న ఘనకీర్తి గడించుకున్నాడు. అందువల్లనే తన కుమారుని పక్షం వహించి వాదించి, అతనికి రాజ్యాధికారం హస్తగతం చేయించవలిసిందని పట్టపురాణి అమూల్య బహుమతు లందించి ఆ మనీషిని ప్రార్థించింది.

యశస్కరుడు వర్చస్వి. స్ఫురద్రూపి. కొంచెం పొడగరి. సూదివలె కొనదేరిన నాసికతో, రవంత దీర్ఘమయిన ముఖంతో, సహజ సరళ వాక్చాతుర్యంతో, సుప్రసన్న హసితంతో అత డెంతెంతటివారినయినా ఇట్టే ఆకట్టుకోగలడు. ఆనా డతని అనర్గళ వాగ్ధోరణి విని బ్రాహ్మణ పరిషత్తులో గల విద్వాంసులందరు ముగ్ధులయి వట్టి చిత్రప్రతిమలే అయి నారు! అయితే తన యావచ్ఛక్తి వినియోగించి ఎంతగా ప్రయత్నించినా యశస్కరుడు పట్టపురాణి కుమారుడు ఉన్మత్తావంతి ఔరసుడే అన్న విషయం మాత్రం తగినన్ని యుక్తులతో ఋజువుపరిచి అందరిచేత ఔనౌనని ఒప్పించలేకపోయాడు.

ఇక గత్యంతరం కానలేక ఉసూరుమని నిట్టూర్చి వెనకడుగువేసి మరలిపోయే సమయంలో బ్రాహ్మణ పరిషత్తు అధిపతి అతనిని తిరిగి తన సన్నిధికి పిలిపించి కాశ్మీర రాజ్యాధికారం స్వీకరించి, ప్రజానీకంలో చెల రేగిన అలజడి తొలగించవలసిందని దోసిలికట్టి బ్రతిమాలుకున్నాడు!

యశస్కరు డా ప్రార్థన విని అత డొకవేళ వ్యంగ్యంగా వేళా కోళం చేస్తున్నాడేమో అని అనుమానించాడు. కాని ఆ ప్రార్థన యథార్థమే అని స్పష్టపడిపోయింది. మహారాజ్ఞి పక్షం వహించి వాదించడానికి వచ్చిన తా నా విధంగా రాజ్యాధికారం స్వీకరించడం న్యాయంకాదని

యశస్కరుడాపైన బహువిధాల వేడుకున్నాడు. కాని పరిషత్తు అధిపతి దాని కంగీకరించలేదు. బ్రాహ్మణ పారిషదులందరు అధిపతి నిర్ణయం ఘనంగా ఉన్నదని ముక్తకంఠాలతో అంగీకరించి జయజయ ధ్వానాలతో అభినందించారు. ఆ మరునాడే యశస్కరుని రాజ్య పట్టాభిషేక మహోత్సవం యధావిధిగా జేగీయమానంగా జరిగిపోయింది.

అప్పటినించి యశస్కరు డొక్క నిమేషమయినా విశ్రమించక కాశ్మీర రాజ్య వ్యవహారాలన్నీ వెయ్యి కళ్ళతో పరిశీలించాడు. ఒక్కొక్కప్పుడు బ్రాహ్మణ పరిషత్తులో సదస్యులెవరయినా ఎంతెంతటి వారయినా తన పరిపాలనలో అన్యాయ్యంగా జోక్యం కలగజేసుకోవడానికి ప్రయత్నిస్తే వారి మాట లేమాత్రమూ లక్ష్య పెట్టలేదు. "తామే కదా, నన్నీ రాజ్యధర్మ నిర్వహణలో నియమించిన మహనీయులు! అటువంటి మీరే నన్నీవిధంగా పెడదారి పట్టించడం న్యాయం కాదు!" అని నిష్కర్షగా మందలించి, మరి వారిని మహారాజ భవనం పరిసరాలలో నయినా అడుగుపెట్ట నియ్యవద్దని సింహ ద్వారాధికారిని గట్టిగా హెచ్చరించాడు.

ఆ తీరులో నిరంతర జాగరూకతతో తన రాజధర్మం యథావిధిగా నిర్వహిస్తున్న యశస్కరునికి ఆనాడు వీరేశ్వరభట్టారకుని ప్రాయోపవేశ దీక్ష ఒక పెద్ద విడ్డూరంగా, బెడదగా, దుస్సహమయిన తలవంపుగా తోచింది. ఆనాటి రాజ్యకార్య నిర్వహణలో ఇను మిక్కిలిగా అలిసిన అతడు ఉసూరుమని నిట్టూర్చి "పరమేశ్వరా! కలలోనయినా ఊహించని ఈ మహా రాజ్యాధిపత్యము, అపారసంపత్తి అనాయాసంగా సంప్రాప్తించినా నేనేమి సుఖించాను! నా కొక్క లిప్త అయినా విశ్రాంతి లేదే! దీనికన్నా యాయవారమయినా మేలే!" అనుకున్నాడు.

ఆ విధమయిన అతని ఆలోచన ఏడెనిమిది నిమిషాలకన్న ఎక్కువ కాలం కొనసాగలేదు. అంతలోనే ప్రాయోపవేశాధికారి వీరేశ్వరభట్టారకుని ప్రభువు సమక్షానికి తోడుకువచ్చి, వెనుదిరగకుండానే సవినయంగా వెనక అడుగులు వేసుకుంటూ నెమ్మదిగా నిష్క్రమించాడు.

భట్టారకు డా పూజా భవనంలో ప్రవేశించి చిరుదీపికల కాంతిలో

జాజ్జ్వల్యమానంగా వెలిగిపోతున్న పైడి పాత్రలవైపు, పూజా ద్రవ్యాల వైపు, ప్రభువువైపు చూచి క్షణకాలం నోట మాటలేక నిశ్చేష్టితు డయినాడు. ఎంతో అడకువతో సాగిలపడి నమస్కరించి మహారాజు ప్రశ్నించకుండానే తన గోడు ప్రారంభించాడు. చిట్ట చివరికి శ్రీనగర మహత్తర స్థేయాంసుని సమక్షంలో కూడా తన కన్యాయ్యమే జరిగిందని మొరపెట్టుకున్నాడు. మహాస్థేయాంసుడంటే కాశ్మీర దేశానికంతటికీ గొప్ప న్యాయాధికారి. ఆవిధంగా క్రమక్రమంగా ముగ్గురు ధర్మ సంరక్షకులు తన కన్యాయం చేసిన పిమ్మటే, మరి గత్యంతరంలేక, ప్రాయోపవేశం ప్రారంభించవలసి వచ్చిందని స్వకీయదీక్ష సమర్థించుకున్నాడు.

ఆ మాటల ధోరణినిబట్టి వీరేశ్వరభట్టారకుడు వేదవేత్త అయినా వట్టి అమాయకుడని, అయితే మొండి పట్టుదలగల శిఖండి అని యశస్కర భూపతి క్షణంలో పసికట్టివేశాడు. అందువల్ల చల్లగా అనునయ ధోరణిలో తన ప్రసంగం ప్రారంభించాడు.

"తమవంటి వేదమూర్తులు ఈ రాత్రివేళ అతిథులుగా విచ్చేయ్యడం నా మహాభాగ్యం. దయతలిచి నాతోపాటు విందారగిస్తే అంత కన్న మరి కోరుకోవలసిన దేదీ లేదు."

"తమవంటి ధర్మప్రభువుల కటాక్షం ప్రసరిస్తే నా భుక్తికేమి కొదవ! అయితే నా వ్యవహారం రవంత సావకాశంగా చిత్తగించ వలసిందని మనవి."

"తెల్లవారిన పిమ్మట, అధికరణ స్థానంలో, శ్రీనగర న్యాయాధీశ్వరుల సమక్షంలో మీ వ్యవహారం అంతా ఆమూలాగ్రంగా పరిశీలిస్తున్నాము గదా! దానికింత తొందరపాటేమి వచ్చింది?"

అతని వ్యవహారం వినడానికి కాశ్మీరాధిపతి రవంతయినా అంగీకృతి వ్యక్తీకరించలేదు! కాని ఆతిథ్య మర్యాదప్రకారం తనతో విందారగించక పోవడం కేవలం తన కవమానమే కాగలదని వ్యంగ్యంగా సూచించాడు. వీరేశ్వరభట్టారకుని కేమనడానికీ పాలుపోలేదు! నిజాని కతనికి తన ప్రాయోపవేశం విరమించడాని కిష్టంలేదు. కాని మహారాజ ప్రార్థన తిరస్కరించడానికి ధైర్యం చాలలేదు. రవంతసే పాలోచించాడు.

"మహాప్రభూ! తమవంటివారి సరసన కూర్చుని విందారగించడంకన్న నావంటి నిరుపేద కింకేమి ఘనగౌరవమున్నది? అయితే తమ సమక్షంలో కూడా న్యాయం జరగని పక్షంలో తిరిగి నే నిదేవిధంగా ప్రాయోపవేశం ప్రారంభించక తప్పదు."

"దానికేమి! మహా ధర్మాధికరణంలో నావల్ల కూడా న్యాయం జరగలేదని తోచినప్పుడు మీరు తప్పక తిరిగి ప్రాయోపవేశం ప్రారంభించ వచ్చును. కాని ఆ దీక్ష ప్రారంభించడానికి కూడా ఒక ధర్మమన్నది ఉన్నది కదా! నేనుగాని, మీరుగాని అణువంతయినా ధర్మాతిక్రమణం చెయ్యరాదు కదా!"

భట్టారకునికి యశస్కరుని చిట్టచివరి వాక్యంలో గల అంతరార్థం బోధపడకపోలేదు. అయినా ఆ మహారాజుపై గల గౌరవం కొద్ది ఆత డా రాత్రి ప్రభువు సరసన తృప్తిగా విందారగించాడు. లోలోపల అనుమాన మేదో కొంచెం వేధిస్తున్నా, మహారాజ భవనంలో హంసతూలికా తల్పంపై పవ్వళించిన మరికొంతసేపటికి గుండెలపై చెయ్యి పెట్టుకుని గుర్రుపట్టి హాయిగా నిద్రించాడు.

ఆ మరునాడు మధ్యాహ్నం మూడు ఝాముల వేళ శ్రీనగర మహా న్యాయ భవనంలో యథావిధిగా వీరేశ్వరభట్టారకుని వ్యవహార పరిశీలనం ప్రారంభమయింది. యశస్కర మహీపతి సమున్నత వేదికపై స్వర్ణ సింహాసనం అధిష్ఠించగానే వందిమాగధులు గభీర స్వరాలతో కైవారా లారంభించారు. చామరగ్రాహిణులు రవంత శిరస్సు లల్లన వంచుకుని వింజామర లటు ఇటు లీలగా కదిలించారు. మహా న్యాయభవనం వెను గవాక్షాలనుండి వెలువడిన హేమంతకాలం నీరెండ మహాధికరణంలో కొందరి శిరోవేష్టనాలపై ప్రసరించింది. వీరేశ్వరభట్టారకుని వ్యవహారం చిట్టచివరి కేవిధంగా పరిణమించగలదో అన్న ఆత్రత మహా న్యాయభవనం లోనే కాక, దాని పరిసరాలలో నలువైపులా వ్యాపించింది. ఆ భవనం చుట్టు జనం గుంపులు గుంపులుగా గుమిగూడి అదే వ్యవహారాన్ని గురించి మాట్లాడుకుంటున్నారు.

శ్రీనగర మహా న్యాయాధికారితోబాటు అతనికి తక్కువ స్థాయిలో ఆ వ్యవహారం పరిశీలించిన గ్రామ న్యాయాధిపతి, మండల న్యాయాధిపతి కూడా ఆ భవనంలో సమాసీనులయినారు. వీరేశ్వరభట్టారకుడు, అతని సాక్షులు, అతడు నిర్దేశించిన దోషి, అతని సాక్షులు అందరు తమ తమ కేర్పరచిన వేర్వేరు స్థానాలలో సంసిద్ధులయినారు.

ముమ్ముందుగా తన వ్యవహారం అంతా కొంత ఆవేశంతో నివేదించడం ప్రారంభించాడు. మొట్టమొదట మహారాజు తన్నెంతో ఆదరించి ఆతిథ్య మర్యాద నెరపినా, ఆ సమయంలో తన గోడు సంగ్రహంగానయినా ఆలకించలేదని భట్టారకుడు మనస్సులో బాగా మథనపడ్డాడు. అయితే నిష్పక్షపాత దృష్టితో వ్యవహారం పరిశీలించే సంకల్పంతోనే మహారాజు ఆవిధంగా చేసి ఉండవచ్చునని సరిపెట్టుకున్నాడు. ఆపైన అతనికి రాజసమక్షంలో కూడా తన కన్యాయం జరగగలదేమో అన్న అనుమానము, భయము కలగకపోలేదు. అయినా ఆ దైవేచ్ఛ ఏ విధంగా ఉంటే అలాగే జరగగలదని గుండె రాయి చేసుకుని, మధ్య మధ్య ఇనుమడిస్తున్న గద్గదికతో తన సంగతి నివేదించాడు. అతడు వివరించిన వృత్తాంతం అంతా ఇది.

భట్టారకుడు చాలా సామాన్య సంసారి. దున్నుకోవడాని కేదో కొంత కొంత్ర ఉన్నది గాని దానితో పట్టుమని పదిమాసాలపాటయినా అతని సంసారయాత్ర సాగదు. తన కుటుంబంలో అనుక్రమంగా వస్తున్న సామవేదమే కాక అతడు మిగిలిన వేదాలు మూడూ పదంతో, క్రమంతో, జటతో అధ్యయనంచేసి జటాంత స్వాధ్యాయి అన్న ఘనకీర్తి గడించుకున్నాడు. కాని ఏమి లాభం? సంపన్నులెవరో ఇద్దరు ముగ్గురు సంపత్సరాని కింత అని ముట్టజెప్పే స్వల్ప వార్షికాలతో అతని దైనందిన జీవితం గడవడమే దినదిన గండంగా తయారయింది.

అతనిది శ్రీనగరాని కనతిదూరంలో గల చిన్న పల్లెటూరు. గంపెడు పిల్లలతో సంసారం గడవడమే కష్టమై తండ్రి సంపాదించిన కొండ్ర కాస్తా తెగనమ్మివేశాడు. అయినా సంసారయాత్ర సాగలేదు. అడుగడుగునా ఆ జటాంత స్వాధ్యాయిని దుర్భర దారిద్ర్యం వెంటాడింది.

ఇక గత్యంతరం కానలేక ఏడెనిమిది నెలలపాటు కాశ్మీరంలో అంతటా పర్యటనం ప్రారంభించి వేదాభిమానులను కొందరిని సందర్శించి, వారి నాశ్రయించి ఒక నూరు బంగారు దీనారాల సొమ్ము కూడబెట్టు కున్నాడు. దానితో తన కుటుంబాని కంతటికి ఒక ఏడాదికాలం అన్న వస్త్రాల కే కొదవా ఉండదని బ్రహ్మానంద పడ్డాడు.

కాని అంతలోనే దురదృష్టదేవత తిరిగి అతనిని వెన్నాడింది. తన గ్రామానికి మరలిపోతూ మార్గ మధ్యంలో లవణోత్స గ్రామంలో ఒక ధర్మ సత్రంలో విశ్రమించాడు.

ఆ నూరు సువర్ణ దీనారాలూ ఒక రాగి చెంబులో పోసుకుని, మూతి గట్టిగా అతికించి దాన్ని తన ఉత్తరీయం కొసకి ముడివేసి వెంటబెట్టుకు పోవడం ప్రయాణంలో అతని కలవాటు. ఆ ధర్మ సత్రంలో మరునాడు ఉదయమే, స్నానంచేసే సమయంలో, రాగి చెంబు బిగించిన ఉత్తరీయం బావి అంచుమీద అతి భద్రంగా ఉంచి స్నానం ప్రారంభించాడు. అంత లోనే పెనుగాలి వీచింది. ఆ ఉత్తరీయం రాగి చెంబుతోబాటు జారి నూతిలో పడిపోయింది!

అది ఏడెనిమిది నిలువుల లోతున్న పెద్ద బావి. పాపం, వీరేశ్వర భట్టారకుడు ఆ హఠాత్ప్రమాదం గమనించి పెద్ద పెట్టున గొంతెత్తి ఆక్రోశిస్తూ ఇరుగు పొరుగు గ్రామస్థుల ఎదట తన విషాదగాథ వెల్లడించు కున్నాడు.

ఏడెనిమిది నిలువుల నూతిలో దిగి బాగా ఊపిరి బిగబట్టి అట్టడుగున గాలిస్తేగాని ఆ ఉత్తరీయం చేజిక్కించుకోవడం సాధ్యపడదు. అందుచేత అక్కడ ఉన్న ఆ గ్రామస్థు లెవ్వరూ నూతిలో దిగడానికి సాహసించలేక పోయారు.

ఏడెనిమిది మాసాలపాటు అష్టకష్టాలుపడి ఆర్జించుకున్న ద్రవ్యం అంతా ఆ విధంగా హరించుకుపోయే సరికి భట్టారకు డిక ఆ దుర్భర దైన్యం భరించలేక అంగవస్త్రంతో మెడకు ఉరిపోసుకుని అక్కడే మరణించవలెనని నిశ్చయించుకున్నాడు.

అంగవస్త్రం కంఠానికి చుట్టబెట్టుకుంటున్న తరుణంలో అంతకు మునుపు అతని దుస్సహాక్రోశం విన్న మారుతి అన్న మహా బలశాలి

అక్కడికి చేరుకున్నాడు. అత డొక కూలివాడు. మారుతి తొందర తొందరగా భట్టారకుని సమీపించాడు.

"ప్రాణాపాయమయినా లక్ష్యపెట్టక ఆ నూతిలో దూకి ఆ నూరు బంగారు దీనారాలూ అప్పగిస్తే మీరు నాకేమి ఇస్తారు?" అతనివైపు నిశితంగా చూసి ప్రశ్నించాడు.

దానితో భట్టారకుని ప్రాణాలు లేచివచ్చాయి. పరమానంద భరితుడై మెడ ఉరి తొలగించుకున్నాడు.

"నాయనా! ఇంతటి ఉపకారం చేస్తే నేను నీకేమి ఇవ్వగలను? న్యాయ్యంగా నీకు తోచినదేదో నీవే తీసుకుని మిగిలినదే నా కియ్యి!"

అంతకుమునుపే నలుగురైదుగురు గ్రామస్థు లక్కడ పోగుపడ్డారు. మారుతి వారందరి సమక్షంలోను భట్టారకునివైపు చూసి, "మీరు మాట తప్పకూడదు మరి!" అని రెట్టించాడు.

"నాయనా, ఎంతమాట! నిత్యము వేదవాణి వినవచ్చే నా నోట అనృతం వెలువడగలదనుకున్నావా?"

వీరేశ్వరుడు జంధెం చేతబట్టి మాట ఇచ్చాడు.

మారుతి వెనువెంటనే ఒకే ఒక్క గంతుతో నూతిలో దూకి, ఇంచుమించుగా ఒక గడియకాలంలో ఆ ఉత్తరీయానికి కట్టిన మూటతో బయటపడ్డాడు. ఆ రాగిపాత్ర మూతి తొలగించి, దానిలో తొంభై ఎనిమిది సువర్ణ దీనారాలు తాను తీసుకుని, రెండే రెండు భట్టారకుని కందించాడు. దానితో అతడు అది కేవలం ఘోర దురన్యాయమని ఘోష పెట్టాడు. కాని అక్కడ ఉన్న సాక్షు లెవ్వరూ అతణ్ని సమర్థించలేదు. ఆపైన క్రమక్రమంగా గ్రామ న్యాయాధిపతివద్ద, మండల న్యాయాధీశుని వద్ద తన వ్యవహారం నివేదించుకున్నాడు. వారిద్దరు కూడా మారుతిదే న్యాయమని తీర్పులిచ్చారు. అయినా అధైర్యపడక శ్రీనగర మహా న్యాయాధీశుని సమక్షంలో తన వ్యవహారం నడిపించాడు. అక్కడ కూడా మారుతి పక్షమే న్యాయమని తీర్పుపుట్టగానే మరి వేరే దిక్కులేక ఆమరణాంత ప్రాయోపవేశదీక్ష ప్రారంభించాడు.

ఆ తీరులో భట్టారకుడు తన వ్యవహారం నివేదించగానే శ్రీనగర న్యాయాధిపతి సవినయంగా లేచి యశస్కర మహీజానికి నమస్కరించి, భట్టారకునివైపు తిరిగి కొన్ని ప్రశ్న లడిగి అతడు చెప్పినదంతా యథా

ర్థమే అని ఋజువుపరిచాడు. అనుపిమ్మట మారుతివైపు తిరిగి "వీరేశ్వరుల కథనంలో అసత్యమేమయినా ఉన్నదా?" అని ప్రశ్నించాడు. అత డది అంతా యధార్థమే అని అంగీకరించాడు. ఆపైన సాక్షుల విచారణ జరిగింది. దానిలో కూడా వీరేశ్వరభట్టారకుని కథనంలోగాని, మారుతి కథనంలోగాని వ్యత్యాసమేమీ గోచరించలేదు.

సాక్షుల పరీక్షలోగాని, వాది ప్రతివాదుల వాఙ్మూలాలలోగాని, వివరణలోగాని వ్యత్యాసమేమయినా బయటపడితే జాగ్రత్తగా పర్యాలోచించి న్యాయ నిర్ణయం చెయ్యవచ్చునని యశస్కరు డాలోచించాడు. ఎక్కడా అవంతయినా తేడా కనబడలేదు! 'మరి దీనిలో ఇంత రభస చెలరేగడాని కవకాశమేమున్నది?' అని క్షణకాలం వితర్కించుకున్నాడు. అంతలోనే అతనికి భట్టారకునికి జరిగిన దురన్యాయమేమో క్షణంలో అవగతమయింది!

అదేక్షణంలో శ్రీనగర న్యాయాధిపతి తటాలున లేచి నిలిచి, రెల్లు పూలవలె నెరిసిన తన కనుబొమ్మ లల్లన వంచి బొమముడి విరిచి ప్రశ్నించాడు.

"భట్టారకా! మరి మీ కీ వ్యవహారంలో జరిగిన దురన్యాయ మేమి ఉన్నది?"

"మహాప్రభూ! మారుతితో నేను 'నాయనా! నీవు న్యాయంగా తోచినదేదో తీసుకుని మిగిలినదే నాకియ్యి' అని చెప్పిన మాట అక్షరశః యథార్థమే! అయితే నేనది పరమానందం పట్టలేక ఉబ్బి తబ్బిబ్బయి చెప్పిన మాట! అంతేకాని నే నతనికి అంత సొమ్ము ఇవ్వదలుచుకోలేదు. అంత పెద్ద నూతిలో దిగి మూట బయటికి తీసినప్పుడు న్యాయ్యంగా రెండు మూడు వెండి దీనారాలకన్న ప్రతిఫలం ఇవ్వనక్కరలేదు గదా! పోనీ, అంతగా శ్రమించినందుకు ఒక పైడి దీనారం తీసుకుని మిగిలినది తిరిగి నా కిచ్చివెయ్యగలడని ఆశించాను. నిజానికి అదే చాలా పెద్ద ప్రతిఫలం! కాని మారుతి దురాశాపరుడై..."

"మహాప్రభూ! అధికరణం సమక్షంలో ప్రతివాది మారుతికి దురాశ ఆరోపించడం న్యాయ్యం కాదు!"

శ్రీనగర ప్రధాన న్యాయాధికారి తటాలున లేచినిలిచి ఆ మాట కడ్డుపడి తన అధిక్షేపం వెల్లడించాడు.

యశస్కర మహారాజు దానిని అంగీకరిస్తున్నట్టు నెమ్మదిగా, హేలగా శిరస్సు పంకించాడు.

వీరేశ్వరుడు తిరిగి ప్రారంభించాడు: "ధర్మమూర్తీ! నా దురాశా లోపణ అపరాధమే. అంగీకరిస్తున్నాను. ఇక నా కథ. ఆపైన మారుతి రెండే రెండు కాంచన దీనారాలు నా చేతికిచ్చి, మిగిలిన దీనారాలన్నీ స్వాయత్తం చేసుకున్నాడు. ఏదో మర్యాదకోసం మాటవరసకని అన్న మాట అక్షరాలా అలాగే జరిగితీరాలని భీష్మించుకుని కూర్చున్నాడు."

"అన్నమాట తప్పరాదు సుమా! అని మిమ్మల్ని నేనప్పుడు రెట్టించి ప్రశ్నించానా, లేదా? మీరప్పుడు జందెం పట్టుకుని అలాగే అని అంగీకరించారా, లేదా? ధర్మస్వరూపులయిన ప్రభువుల ముఖం చూసి నిజం చెప్పండి!"

మారుతి తటాలున సూటిగా ప్రశ్నించాడు.

ఆ ప్రశ్న విని భట్టారకుడు మరి మాట్లాడలేక క్షణకాలం మౌనం వహించి, "అది అంతా యథార్థమే" అని అంగీకరించి శిరస్సు వంచుకున్నాడు.

వెనువెంటనే మారుతి అందుకున్నాడు: "మహారాజా! నా కుటుంబంలో అన్నదమ్ములతో, అక్క చెల్లెళ్ళతో, తలిదండ్రులతో, నా భార్యతో, పిల్లలతో కలిసి మొత్తం పదహారుగురున్నారు! మా సంసారానికంతటికి సంరక్షకుడను నేనే! మా గ్రామం నెనుబావిలో పడినవారిని బయటికి తియ్యడంకోసం లోపలికి దిగిన జమాజెట్టీ లెవ్వరూ మరి ప్రాణాలతో బయట పడలేదు! అటువంటి నూతిలో దిగి బయటపడిన నా పంచ ప్రాణాలు నూరు బంగారు దీనారాలకన్న బాగా విలువైనవే అని విన్నవించుకుంటున్నాను. తమ రీ విషయం రవంత దివ్యచిత్తానికి తేవాలని నా ప్రత్యేక విజ్ఞప్తి."

మారుతి విన్నపంతో అధికరణం అంతా రెండు మూడు క్షణాల పాటు స్తబ్ధమయినట్టు పొడకట్టింది. శ్రీనగర న్యాయాధిపతి అది ప్రస్తుత వ్యవహార పరిశీలనకు కొంత అనవసర ప్రసంగమయినట్టు రూక్షంగా అతని వైపు చూశాడు. అయినా మారుతి అదేవిధంగా విన్నవిస్తున్నట్టు మహారాజు కట్టెదుట దోసిలి కట్టుకుని నిలుచున్నాడు.

ఆపైన శ్రీనగర న్యాయాధిపతి లేచి నిలిచి గౌరవ సూచకంగా శిరస్సు వంచి మహారాజు నుద్దేశించి ప్రసంగించాడు.

"ప్రభువర్యుల కీవిషయం సమగ్రంగా అవగతమే. అయినా తిరిగి దివ్యచిత్తాని కొకమారు తేవాలని నివేదించుకుంటున్నాను. ప్రాచీనకాలం నించి మన పవిత్ర భూమిలో కేవలం మాట కట్టడివల్లనే వ్యవహారాలన్నీ పరిపూర్ణ ధర్మపద్ధతిలో నడుస్తున్నాయన్న విషయం తామెరిగినదే. తను మనుష్యుల సమక్షంలో జరిగిన ఒప్పందాలన్నీ తామ్రశాసనాలవలె, శిలాక్షరాల వలె సర్వులూ మన్నించి శిరసావహిస్తున్నారు!

"ఎక్కడో సకృత్తుగాగాని భూర్జపత్రాలలో లిఖించడ మన్నది జరగడంలేదు. అదీగాక వాది ప్రతివాదుల సాక్ష్యాలలోగాని, వాఙ్మూలాలలోగాని ఎక్కడా రవంతయినా వ్యత్యాసం కానరాలేదు. ఇందువల్లనే నాకు గ్రామ మండల న్యాయాధిపతు లిద్దరితోనూ ఏకీభవించడం తక్క వేరొక్క గత్యంతరం కానరాలేదు."

"అది యథార్థమే. అయితే ఆయా ఒప్పందాల పదాలలో గల పరమార్థమేమో పరిశీలించనక్కరలేదా?"

ప్రభువు మంద్రస్వరంతో ప్రశ్నించాడు. శ్రీనగర న్యాయాధీశ్వరుని కా ప్రశ్నతో పచ్చి వెలక్కాయ గొంతున చిక్కుపడ్డట్టయింది. క్షణ కాలం నిరుత్తరుడై తిరిగి తన చర్య సమర్థించుకున్నాడు.

"మహారాజా, కాశ్మీరంలో అనూచానమయిన ధర్మపద్ధతి ప్రకారం మాకు ఆయా వాగ్దానాల ఒప్పందాలన్నీ కేవలం వాచ్యంగానే సమన్వయించే అధికారం మాత్రమే ఉన్నది. అంతేగాని అంతకన్న మా కధికారం లేదు. అదీగాక కేవలం వాగ్దానాలవల్ల ఏర్పడిన కట్టడులకు తాత్పర్యార్థాలు పరిశీలించడం ప్రారంభిస్తే ధర్మాధర్మాలే తారుమారై పోగల వేమో అని భయపడుతున్నాం. ఆపైన దేవరవారి చిత్తం."

యశస్కరుని కంతకుమునుపు ఎప్పుడోగాని, ధర్మాసనంపై అధిష్ఠించి న్యాయం నిర్ణయించే ఆవశ్యకత కలగలేదు. ఆ వ్యవహారం అంతా జటిలమయిన ఒక పెద్ద బెడదలా తోచింది. శ్రీనగర న్యాయాధిపతి తానీ క్లిష్ట పరిస్థితిలోనించి తప్పించుకోడానికే కేవలం సంప్రదాయ పద్ధతి అవలంబించి గ్రామ మండల న్యాయాధీశ్వరుల తీర్పులకే ఆమోదముద్ర

ముద్రించినట్టు గ్రహించుకున్నాడు. మరికొంతసేపటివరకు యశస్కరుని కేమని తీర్పు ఇవ్వడానికీ పాలుపోలేదు.

కాశ్మీరాధీశ్వరుని అంతిమ నిర్ణయంకోసం అధికరణం అంతా ఊపిరి బిగబట్టి ఎదురుచూస్తున్నది. మరికొన్ని నిమేషాలలో యశస్కరభూపతి ముఖతః మంద్ర గంభీరస్వరంతో తుదితీర్పు క్రమ క్రమంగా వెలువడింది.

"కేవలం పురాతన సంప్రదాయం ప్రకారం పరిశీలిస్తే మారుతి చేసినదానిలోగాని శ్రీనగర న్యాయాధీశ్వరుల తీర్పులోగాని తప్పిదమేమీ లేదు."

అది వినగానే వీరేశ్వరునికి ముఖం వెలవెలబోయింది. శ్రీనగర న్యాయాధిపతి ముఖం వికసించింది.

అంతలోనే యశస్కరుని ఉదాత్త ప్రసంగం తిరిగి న్యాయభవనంలో ప్రతిధ్వనించింది.

"అయితే పంచమవేదమయిన మహాభారత సంహిత ప్రవచించిన శ్రీకృష్ణద్వైపాయనులు ధర్మ నిర్ణయం ఒక్కొక్కప్పుడు అసిధారావ్రతం వంటిదని, బహు క్లిష్టమని అనేక పర్యాయాలు తమ సంహితలో నొక్కి వక్కాణించారు. ఒక్కొక్కప్పుడు అధర్మమే ధర్మస్వరూపంతో లోకం కన్ను కప్పివేస్తున్నది! ధర్మాన్ని కాలరాచి మట్టివేస్తున్నది! ఒక్కొక్కప్పుడు పరమధర్మమే వట్టి అధర్మంలా పరిణమిస్తున్నది!"

యశస్కరభూజాని వ్యక్తీకరించిన ఆ సునిశిత ధర్మదృష్టికి న్యాయాధీశ్వరులేకాక వాది ప్రతివాదు లిరువురు, వారివైపు సాక్షులూ మిక్కిలి ఆనందించారు.

అంతలోనే యశస్కరుడు తిరిగి వివరించాడు.

ఇందువల్ల వీరేశ్వరభట్టారకుల మాటలు కేవలం మర్యాదతో, ఆదరంతో అన్నట్టుగానే స్వీకరించాలి. అంతేగాని వాటికి వట్టి వాచ్యార్థం స్వీకరించరాదు. ఇందుచేత మారుతికి ఆయన ఇవ్వాలని సంకల్పించుకున్న ఒకేఒక పైడి దీనారమే బాగా ఎక్కువ. అయినా అదే మారుతికి చెందాలని నిర్ణయిస్తున్నాము. మిగిలిన తొంభయితొమ్మిది దీనారాలు వీరేశ్వర భట్టారకులకే చెందాలని శాసిస్తున్నాము."

సూక్ష్మ ధర్మ పరిశీలనంతో వెలువడిన ఆ నిర్ణయానికి న్యాయాధీశ్వరులందరు ఔనౌనని హర్షించారు. అంతలోనే శ్రీనగర న్యాయాధిపతి లేచి ప్రభువు నభినందించాడు.

"న్యాయస్వరూపులయిన ఏలిక నిర్ణయం సర్వులకు బ్రహ్మానందం కలిగించింది. నా మట్టుకు నా కిదే విధమైన నిర్ణయం న్యాయ్యం కాగల దేమో అని స్ఫురించకపోలేదు. అయితే నాకున్న అధికార పరిమితి ననుసరించి తోచిన తీర్పు ఇవ్వక తప్పలేదు! ఈ సూక్ష్మ ధర్మం పరిశీంచవలసినది తాముకాని మేము కాదు గదా!"

ఆ ప్రసంగం మిగిలిన న్యాయాధిపతులకు, వెలుపల వేచిఉన్న జనానికి మరింతగామహోల్లాసం కలిగించింది. వీరేశ్వరభట్టారకుడు తన కా తీర్పులో సంపూర్ణ న్యాయం లభించగలదని కలలోకూడా ఊహించలేదు. తిరిగి ఆనందా వేశంతో తలమునకలయి కాశ్మీరాధిపతి కెంతో అడకువతో నివేదించాడు:

"ప్రభూ! మహావిద్వాంసులు, ధర్మరహస్యవేత్తలు అయిన తమ వల్ల కాశ్మీరంలో ధర్మదేవత సుఖంగా నాలుగు పాదాలతోను పోరాడు తున్నప్పు డిక ఆశ్చర్యమేమి ఉన్నది? ఇక ఒక చిన్న విజ్ఞప్తి. మారుతి దారుణ మరణమయినా లక్ష్యపెట్టక నా దీనారాలన్నీ భద్రంగా వెలువరించాడు. ఇందువల్ల నేనాతనికి ఇంకొక్క బంగారు దీనారం కూడా బహూకరిస్తున్నాను!"

ఆ అమాయిక వేదనిధి ఔదార్యం కాశ్మీర మహీపతికే కాక మారుతితోబాటు అందరికి మైమరుపు కలిగించింది!

.:o:.

# వ్యామోహజ్వాల

తన కత్యంత ప్రియమయిన పంచకల్యాణి శరీరం మీది విచిత్ర మయిన ఆ హస్తచిహ్నంమీద నిశ్చలదృష్టి ప్రసరింపజేసిన కాశ్మీరాధిపతి కిన్నర మహీపతి మరి తన కన్నులే నమ్మలేకపోయాడు!

అది ఎంత మనోజ్ఞమయిన హస్తముద్రిక! మధుర మద్యరసంలా తళతళలాడుతున్న ఆ ఉత్తమాశ్వం నెమ్మేనిమీద ఆ చేతిగుర్తు అమృత సరస్సులో అప్పుడప్పుడే వికసించిన బంగారు కలవపువ్వులా జాజ్వల్యమానంగా వెలిగిపోతూంది! అంతలోనే అది మాణిక్య మద్యపాత్రిక రూపంలో సాక్షాత్కరించింది!

వసంత ప్రాదుర్భావ సమయంలో సాయంకాలం తన అంతఃపురాని కనతిదూరంలో ఉద్యానవాటికలో హంసతూలికాతల్పం వంటి సుఖాసనంమీద ఓరగా ఒరిగిన కిన్నర భూజాని ఇంగితం గమనించిన అంతఃపుర పరిచారిక ఒక పైడిపాత్రలో ద్రాక్షమద్యం మిక్కిలి అడకువతో అందించబోయింది. కాని, ప్రభుదృష్టి అది గమనించినా గమనించనట్లే పంచ కల్యాణి శరీరం మీది బంగారు కలవరేకులలోనే చిక్కుపడిపోయింది!

'మద్యసేవలో ప్రభువర్యులు రవంత పరాకు చిత్తగిస్తున్నారేమో! ఆ విషయం జ్ఞప్తికి తీసుకురాకపోతే అదేమి మహాపరాధమో!' అని భయపడి ఆ పరిచారిక ఆ పాత్రిక ఆయన పార్శ్వంలోనే ఉంచి, నెన్నుదుటిమీద దోసిలికట్టి రవంత సమక్షానికి వచ్చి ఎంతో ఒయ్యారంగా ఒదిగి నిలుచున్నది.

పిల్ల తెమ్మెరలో అలవోకగా రాలిన నాలుగయిదు శిరీష పుష్పాలు సాయంకాలం నీరెండలో మెరిసిపోతూ, ఆ పరిచారిక శిరస్సుమీద, పరిసరాలలోను నెమ్మది నెమ్మదిగా తూలుతూ రాలాయి. అంతలోనే ఆ ఉద్యానవనంలో ఒక పెంపుడు నెమలి టపటప రెక్కలాడిస్తూ కెవ్వుమన్నట్టు ఒక పెద్దకేక పెట్టింది. దానితో మహారాజు తిరిగి ఈ లోకంలో పడ్డాడు. ఎంతో భయభక్తులతో పరిచారిక తిరిగి అందించిన మదిరాపాత్ర స్వీకరించాడు.

దానిలో కూడా ఆయనకు ఆ పంచకల్యాణి శరీరం మీద ముద్రిత మయిన చేతి గుర్తే పైడి కలవపువ్వులా ప్రతిఫలిస్తూ సాక్షాత్కరించింది! నిశ్చల దృష్టితో దాని సౌందర్యం ఆకళించుకుంటూ ఆ మద్యరసం అంతా నెమ్మది నెమ్మదిగా ఆరగించాడు.

మరికొన్ని క్షణాలలో కిన్నర మహారాజు ఫాలతలి మీద సన్నని బొమముడి విరిగింది. తానెంతో ఆప్యాయంగా కళ్ళకద్దుకుంటున్న ఆ పంచ కల్యాణిని ఆ విధంగా అరచేతితో గట్టిగా కొట్టి అదిలించడాని కెవ్వరికి గుండెలున్నాయి? అశ్వపరిరక్షకుడయినా దానిమీద కోపగించడానికే గజగజ వణికిపోతున్నాడే! అత డెన్నెన్నో విధాల బతిమాలుకున్నాక గాని అది పసిరి పచ్చిక చివుళ్ళయినా మూచూడదే! ఎవ్వ రా దుర్మదాంధులు! చూడగా చూడగా అది పురుష హస్తముద్రిక అయినట్టు కనబడడం లేదు! మరి ఎవ రా విధంగా దానిని ఆ తీరులో కఠిన ప్రహారంతో అదిలించారు? తన అంతఃపుర రాణు లెవ్వరయినా దానిని ఆ విధంగా అదిలించారా? ఆ పంచకల్యాణికి అంతఃపురం వైపయినా తొంగిచూడవలసిన అవసరం లేదే? ఒకవేళ ఏదయినా కారణంచేత అది అవరోధంవైపు వెళ్ళినా వారి కరతల ముద్రికల కంతటి అతిలోక సౌందర్యం ఎక్కడిది? వారి కామాత్రం అందం కూడానా!

మరి ఆ హస్త ముద్రిక ఎవ్వరిది? మంచుకొలనులో తేలుతున్న బాల సూర్యుని లేతకిరణాలలా మిక్కిలి సున్నితాలయిన ఆ అయిదు వేళ్ళు ఎంత సుతారంగా కొనలుదేరుతున్నాయి!

మహారాజు నెన్నుదుటిమీద బొమవిడి మరింత తీవ్రంగా ముడి పడింది. చుట్టూరా కొంత దూరంలో ఉన్న పరిచారకులు తమ ప్రాణా లరచేత పెట్టుకుని గజగజ వణికిపోతున్నారు! తమ ఏలిక ముఖంలో అంతటి తీవ్ర క్రోధాని కేమి హేతువో తెలియక తికమకపడి ఎంతో ఆత్రంగా ఒకరి ముఖాలొకరు చూసుకుంటున్నారు. మరుక్షణంలోనే కిన్నర మహీపతి పెదవులనుండి మంద్రగభీరమయిన ప్రశ్న వెలువడింది.

"మా పంచకల్యాణిమీద ఆ హస్తముద్రిక ఎలాగ వచ్చింది?"

అంతవరకూ ఆ పరిసరంలో ఉన్న పరిచారికలు, పరిచారకులు ఆ ముద్ర సంగతే గమనించలేదు! ప్రభువు కనుసన్నల కదలికల తీరులు గమ

నించి వా రాయన లోలోపలి అభీష్టాలన్నీ ఆకళించుకుని వెను వెంటనే నెరవేరుస్తూండాలి! అటువంటప్పుడు వారు ఆయన తామై ప్రశ్నించే పర్యంతమూ ఆ విషయమే గుర్తించలేదు! ఏదో ఆ అశ్వంమీది ఆప్యాయత కొద్దీ తమ ఏలిక దానివైపు ఏకాగ్రమనస్కులై తిలకిస్తున్నారని అనుకున్నారు. అకస్మాత్తుగా ఆ చేతి గుర్తు పరిశీలించి వా రెంతయినా చకితులయినారు. అది అక్కడ పడడానికేమి కారణమో ఎంతగా తలలు బద్దలు కొట్టుకున్నా వారెవ్వరికీ ఏమాత్రమూ అంతు చిక్కలేదు.

మరుక్షణంలోనే వారిలో ఒకడు కాలికొద్దీ పరుగు పెట్టి ఆ అశ్వ పరిపాలకుణ్ణి వెంటబెట్టుకు వచ్చాడు. అతడు వస్తూనే కాశ్మీరాధిపతి పాదాల ముందర వ్రాల వట్టి నేలమీద సాగిలపడ్డాడు. గజగజ వణికిపోతూ గద్గద కంఠంతో విన్నవించాడు:

"మహా ప్రభూ! నే నేపాపమూ ఎరగను! ఈ దీనుణ్ణి ఏలినవారు కటాక్షించాలి. అది నావల్ల జరిగిన అపరాధం కానే కాదు."

"మరి?"

ప్రభువు ముఖభంగిమలో రవంత ప్రసన్నత పొరాడింది. ఆ అశ్వ పరిపాలకునికి కొంచెం దిటవు చిక్కింది. ఆ చేతిచిన్నె వృత్తాంతం సంగ్రహంగా విస్పష్టంగా, విన్నవించాడు.

ఆనాడు మూడు యామాలు పొద్దు తిరిగిన తరవాత ఆ పంచకల్యాణి అదే ఉద్యానవనంలో యథేచ్ఛగా విహరిస్తూంది. అంతలోనే కొంచెం సమీపంలో పొరాడుతున్న పెంపుడు లేడి దానిని చూసి, బెదిరి తప్పించుకోబోయి తటాలున మునికాళ్ళ కడ్డుపడింది. దానితో పంచకల్యాణి మరింతగా కంగారుపడి, చెంగున ఎగిరి ఉద్యానవనం ప్రాకారం దాటి, మహారాజపథంలో ప్రవేశించింది. అశ్వపరిపాలకు డిది గమనించి హడలెత్తిపోయి ఎంతో ఆత్రంగా దానివెంటపడి పరిగెత్తాడు. అదృష్ట వశాత్తూ అది ఆపైన పెద్ద దౌడు తియ్యలేదు! కొంచెందూరం నెమ్మదిగా పరుగుపెట్టి ఒక భవంతి ప్రాంగణంలో ప్రవేశించింది. అక్కడ నీరెండలో ఆరబోసిన యవధాన్యంలో ముట్టెపెట్టి కొంచెంసేపు తన ఆకలి తీర్చుకున్నది.

అశ్వపాలకుడు ఆ భవంతి సింహద్వారంవరకూ దాని వెంటనంటి పరుగుపెట్టాడు. కాని అది ఆ భవనం ప్రాంగణంలో ప్రవేశించిన తరవాత లోపలికి వెళ్ళడానికి అతనికిక కాళ్ళాడలేదు! అది ఎవ్వరో సంపన్నుల

భవంతిలా కనిపించింది. లోపలికి వెళ్ళడం మర్యాద కాదని భయపడి ద్వారంముందే నిలుచుండిపోయాడు.

అలాగలాగ అయిదారు నిమిషాలు గడిచిపోయాయి. అతడి కేమీ పాలుపోలేదు. అంతలోనే మంద్రమంద్రంగా అందెల చిరుమువ్వల సవ్వడి వినిపించింది. ఎవ్వరో ఒక జవ్వని త్వరగా సౌధంమీదనుంచి దిగివచ్చి పంచకల్యాణిని తన అరచేతితో కొంచెం గట్టిగా కొట్టి అదిలించింది. వెంటనే అది ద్వారంవైపు తిరిగివచ్చింది. అశ్వపాలకుడు మరుక్షణంలోనే నెమ్మదిగా దాని మూపు తట్టి బతిమాలుకుని లోబరుచుకుని తిరిగి అశ్వశాలలో ప్రవేశపెట్టాడు. అయితే దాని స్వేచ్ఛావిహారానికి అడ్డంకి కలిగించడాని కిష్టపడక ఆ ఉద్యానవనంలో విడిచిపెట్టాడు. అటుపిమ్మట ప్రభువు సాయంకాలం విహారంకోసం అక్కడికి రావడం జరిగింది.

ఆ వృత్తాంతం వినీవినగానే కిన్నరభూపతి నుదుటి మీది బొమముడి పూర్తిగా అంతరించింది. పెదవులపై వకుళకుసుమంవంటి చిరునవ్వు వికసించింది.

అప్పటికి అశ్వరక్షకుడు తన కిక ప్రాణాపాయం లేదన్న దృఢ నిశ్చయంతో లోలోపల ఉప్పొంగిపోయాడు. మహారాజు కనుసన్న గ్రహించి ఎంతో అడకువతో లేచి నిలబడి, అనుమతి స్వీకరించి వెనకవైపు తిరగకుండానే అలాగే నెమ్మది నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ వెనక్కి వెళ్ళి పంచకల్యాణి కనతిదూరంలో నిలుచున్నాడు.

మహారాజు సింహాసనంమీదనుండి లేచి హేలగా అడుగులు వేసుకుంటూ ఆ అశ్వం నిలుచున్న ప్రదేశానికి సాగిపోయాడు. మద్యపాత్రధారిణి కైదండ అందియ్యబోయింది గాని మహీపతి మనోగతం గ్రహించుకుని రవంత దూరంగా తొలగి నిలుచున్నది. మిగిలిన పరిచారికలు, పరిచారకులు అదే ధోరణి అవలంబించారు.

కిన్నరభూపతి పంచకల్యాణి నెమ్మేనిమీద హస్త ముద్రిక నిశితంగా పరిశీలించాడు. అశ్వసంరక్షకుడు తిరిగి అత్యంత భయభక్తులతో ప్రభువు సన్నిధికి పోయి శిరస్సుమీద దోసిలి కట్టి నిలుచున్నాడు.

కిన్నర మహారాజు మరింత ఏకాగ్రతతో ఆ హస్త చిహ్నం పరీక్షించాడు. ఎవరో అతిలోకసుందరి, అలంకరించుకునే సమయంలో, పసుపు పొడి అలదుకొన్న అరచేతితోనే ఆ ఉత్తమాశ్వాన్ని గట్టిగా అదిలించి

ఉండవచ్చునని మొట్టమొదట అనుకున్నాడు. తిరిగి అతి జాగరూకతతో పరిశీలించాడు. ఎక్కడా ఒక్క పసుపుపొడి రేణువు జాడయినా గోచరించ లేదు! అది ముమ్మూర్తులా నిశ్చయంగా ఆ రమణీమణి పదారువన్నె పైడి వంటి అరచేతి పూర్తి గుర్తే!

"చందనకా! ఆ భవంతి ఎవరిదో నీ కేమయినా గుర్తున్నదా?"

అశ్వపరిపాలకుని ముఖంమీద ఆర్ద్రదృష్టి ప్రసరింప జేస్తూ ఉట్టి పడుతున్న ఆప్యాయతతో ప్రశ్నించాడు.

"ఎంతమాట, మహాప్రభూ! గుర్తులేకేమి? అది విశాఖభట్టారకుల భవంతి!"

ఆ ప్రత్యుత్తరం వినీవినగానే మహారాజు శరీరం హర్షావేశంతో జలదరించింది! ఆ భట్టారకుని పత్ని చంద్రలేఖ సౌందర్యం సంగతి తా నంతకుమునుపే అంతఃపుర పరిచారికల ముఖతః ఆలకించాడు. కాని ఇచ్చ కాలు చెప్పాలని వా రామె సోయగం అంతగా ఆకాశాని కెత్తివేసి ఉండ వచ్చునని అనుకున్నాడు. అయినా వారి నిజాయితీ పరీక్షించడంకోసం ఒకనాడు సాయంకాలం పంచకల్యాణిమీద విశాఖభట్టారకుని గృహంపైపు పోయి ఆ పరిసరాలలో విహరించాడు. మహారాజ సందర్శనార్థం ప్రజలు తండోపతండాలుగా కిన్నర పురవీథులలో బారులుదీర్చి నిలుచున్నారు. అదే సమయంలో మేలిముసుగు వేసుకున్న సాయంసంధ్యాసుందరిలా లలనామణి ఒకతె విశాఖభట్టారకుని ప్రాసాదంమీద ప్రత్యక్షమయింది. అయితే అప్పు డతనికి ఆమె సౌందర్యరేఖల వంపుసొంపు లంత విస్పష్టంగా వ్యక్తం కాలేదు.

ఇప్పు డీ ఉత్తమాశ్వం శరీరం మీద ఆమె హస్త ముద్రిక చూసే సరికి అతని సందేహం పూర్తిగా పటాపంచలయింది! పిన్ననా డతడు దాదుల ముఖతః విన్న విచిత్ర గాథలలో అతిలోక లావణ్యవతులయిన రాజతనూజల సోయగాలను గూర్చి ఆలకించాడు. బాగా ప్రాయం వచ్చిన తరవాత ఆ కథలు కొన్ని జ్ఞప్తికి వచ్చినప్పుడు, అంతటి అందం వట్టి పిట్ట కథలలోనే తరళించగలదని నిశ్చయించుకున్నాడు. పరిచారికలు కొందరు చంద్రలేఖ సౌందర్యం వేనోళ్ళ వర్ణించినప్పుడు అవి అన్నీ వట్టి కట్టు కథ లయి ఉండవచ్చునని కొట్టి పారేశాడు! ఇప్పు డా మేలుజాతి గుర్రం

నెమ్మేనిమీద ముద్దు లొలికే ఆ చేతిచిన్నె తిరిగి రెప్పవాల్చకుండా పరీక్షించి విధాత సుందరీసృష్టిచాతుర్యంలో ఎంతెంతటి విద్దూరాలయినా పొడకట్టవచ్చునని నిశ్చయించుకున్నాడు.

మహారాజు తిరిగి సింహాసనం మీద సమాసీనుడయినాడు. మద్య పాత్రధారిణి, అవసరం గ్రహించి, తిరిగి మదిర అందించింది. ప్రభువు కను సన్న గ్రహించి చుట్టూరా ఉన్న పరిచారికా పరిచారకులందరూ అక్కడ నుంచి తొలగిపోయారు.

"వారుణీ! నిజంగా చంద్రలేఖ సౌందర్యం అంత గొప్పదా?"

మద్యపాత్రధారిణివైపు నిశ్చలదృష్టి ప్రసరింపజేసి మహారాజు ప్రశ్నించాడు. ఆమె కనురెప్ప లల్లన వంచింది.

"ప్రభువులు స్వయంగా సందర్శించి ఉంటే నన్నీ విధంగా ప్రశ్నించి ఉండరని మనవి. ఇంతకంటె నేనేమని విన్నవించుకోగలను!"

"ఆమె ఎవరి కుమార్తె?"

"నాగ రమణీమణులకేకాక అంతటి అతిలోక సౌందర్యం ఎవ్వరికి ఉంటుంది, మహాప్రభూ? ఆమె తండ్రి నాగకుల మహత్తరులు సుశ్రవసులు!"

"అయితే విశాఖభట్టారకులు పాలవంటి బ్రాహ్మణ వంశంలో జన్మించినా నాగకన్యకనే వివాహం చేసుకున్నారన్నమాట!"

"అవును. ప్రభూ!"

"ఎందుచేత?"

"నా కంతగా ఆ రహస్యాలు తెలియవుగాని రేపటికి తమ కా విషయాలన్నీ ఆమూలాగ్రంగా నివేదించుకుంటాను."

"వట్టి మాటల మూటలేనా?"

కిన్నరభూపతి పెదవులపై చిరునవ్వు అలవోకగా మెరిసింది. వారుణి ప్రభువు ఇంగితం గ్రహించి రవంతసే పాలోచించింది.

"నే నామాత్రం గ్రహించుకోలేనా? అయితే ఆమె ఎంతో శీలవతి అని విన్నాను, మహాప్రభూ!"

మహారాజు నిశ్చలంగా నిమేషకాలం మద్యపాత్రధారిణి వైపు చూశాడు.

"నువ్వు తలుచుకుంటే సాధించలేనిదేమిటి, వారుణీ!"

ఆ పొగడ్తతో ఆమె ఎంతయినా ఉప్పొంగిపోయింది. కనురెప్ప లల్లన వంచి చిన్నారి చిరునవ్వు చిలకరించింది.

"ఇది అంతా ఏలినవారికి పాదదాసిపై గల పరమాదరం మాత్రమే."

అంతేగాని వారుణి ఇదెంత పని అన్నట్టు మాట్లాడలేదు. అంతలోనే కిన్నరపురంలో దేవళాలపై మాణిక్య కలశాల తళతళ క్రమక్రమంగా అంతరించింది. చెట్ల గుబురులలో నక్కిన సంజ చీకటి నెమ్మదిగా ఇవతలికి వచ్చి నలువైపులా వ్యాపించింది. వారుణి కైదండ అందుకుని కిన్నరభూపతి చంద్రలేఖ అందచందాలే తలపోసుకుంటూ నిశ్చల నేత్రాలతో అంతఃపురంవైపు సాగిపోయాడు.

అలాగలాగ మరికొన్ని దివసాలు గడిచిపోయాయి. మహారాజు తరుచుగా విశాఖభట్టారకుల భవంతివైపు వాహ్యాళికి వెడుతూండేవాడు. ఒకనాడతనికి సాయంకాలం దీపకాంతిలో చంద్రలేఖ సాక్షాత్కరించింది. అతని చేతనున్న కళ్లెం అలాగే జారిపోయింది! ఆ సమయంలో తాను చిన్నప్పుడు అందగత్తెలయిన రాజకుమార్తెలను గూర్చి విన్న కథలన్నీ వట్టి న్యూనోక్తులు మాత్రమే అని స్ఫురించింది! ఆపైన ఒకనాడతడు చంద్రలేఖ వ్యవహారం ఏమైందని వారుణిని ప్రశ్నించాడు. ఆమె ఇంతకాలం నుంచి ఏమి చెయ్యడానికీ ఉపాయమేమీ తోచక కొంత ఉపేక్ష వహించింది. మహారాజు తిరిగి ఇంకొకసారి ప్రశ్నించిన తరవాత వ్యవహారం క్రులిమించి రాగానపడిందని పసికట్టింది. మరి ఆలస్యం పనికిరాదని నిశ్చయించింది. ఆ విషయాన్నిగురించే రాత్రింబగళ్ళూ అదేపనిగా ఆలోచిస్తున్నాననీ, తగిన మార్గమేదీ గోచరించడం లేదని సమాధానం చెప్పి ఉసూరుమని నిట్టూర్చి, మన్నించవలసిందని వేడుకున్నది.

ఒకనాటి సంజవేళ పువ్వులమ్మే పుష్పలావిక వేషంతో చంద్రలేఖ భవంతికి వెళ్ళింది. బాగా బేట్టుసరిచేసి సామాన్యంగా అందరు అమ్మేదానికన్న తక్కువ వెలకే మల్లెలు, మొల్లలు, జాజులు, మందారాలు విక్రయించింది. పువ్వులమ్ముతున్నంతసేపూ రెప్పవాల్చక చంద్రలేఖ అపూర్వ సౌందర్యం పరిశీలించి మరి తన కన్నులే నమ్మలేకపోయింది!

ఆమె కర్ణాభరణాలు చెక్కిళ్ళపై దృశ్యాదృశ్యంగా ప్రతిఫలిస్తున్నాయి. నలనల్లని ముంగురులు గోరువెచ్చగా కాగిన పాలవంటి తెల్లని ఫాలతలిపై జీరాడుతూ చిరుగాలికి అటు ఇటు కదలాడుతున్నాయి. నవయౌవనంతో మిసమిసలాడుతున్న శరీరచ్ఛాయ ఇంద్రనీలంవంటి నీలిచీరలో నుండి తళతళ మెరుస్తున్నది. అరచేతులు పసిడి కలవపూల రేకులలా మెరుస్తున్నాయి!

"ఆహా! ఎంతటి మహనీయ లావణ్యం! నాకే ఇలాగ మైమరుపు కలుగుతూంటే ఇక కిన్నరభూపతి కంతటి ఉన్మాదం కలగడంలో ఆశ్చర్యం ఏమి ఉన్నది!" అని నిర్ఘాంతపోయింది.

ఆనాటినుంచి మరికొన్నాళ్ళవరకూ వారుణి చంద్రలేఖ కెంతో అపురూపమయిన కాశ్మీరదేశం పుష్పాలు కొన్ని తీసుకువచ్చి ఇచ్చేది. అవి సిగలో తురుముకుని ఆమె వారుణి అపూర్వ చాకచక్యం వేనోళ్ళ అభినందించేది. క్రమక్రమంగా వారిద్దరి మధ్య కొంత సన్నిహితపరిచయం కలిగింది. ఒకనాడు తగిన అదను కనిపెట్టి వారుణి చిక్కని చిరునవ్వు చిందిస్తూ చల్లచల్లగా తన మనోగతం వెల్లడించింది. మొట్టమొదట ఆమె చక్కదనం ప్రశంసించి అది కిన్నరమహీపతి హృదయసాగరాన్నే మందరగిరిలా మథించివేసిందని, మహారాజు ఆమెకోసం వల్లమాలిన విరహవేదనతో అల్లల్లాడి పోతున్నారని వెల్లడించింది.

"నిజంగా నేనా?"

చంద్రలేఖ కళ్ళలో విపరీతమయిన ఆశ్చర్యం ప్రతిఫలించింది.

"నిజమేనమ్మా! ఇలాంటి వ్యవహారంలో నేను పరిహాసంచేస్తానా?"

"ఇది నీ కెలాగ తెలిసింది?"

చంద్రలేఖ నెన్నుదుటిపై సన్నని బొమముడి విరిగింది. పెదవిపై చిరునవ్వు తొణికింది.

"అంతఃపుర రాణులకేకాక మహీపతికికూడా పుష్పలావికను నేనే!"

"ఓహో! అలాగా!"

చంద్రలేఖ ఉసూరుమని నిట్టూర్చి నిశ్చల విశాల నేత్రాలతో సుదీర్ఘాలోచనలో పడింది. అంతలోనే వారుణి అందుకుంది:

"మీరు దీని కేమీ భయపడనక్కరలేదమ్మా! ముక్కంటికయినా తెలియకుండా మిమ్మల్ని అతిరహస్యంగా నేను మూడు క్షణాలలో మహా రాజు శయ్యామందిరంలో చేర్చగలను."

చంద్రలేఖ ఉలిక్కిపడింది. పచ్చి పగడాలవంటి ఆమె పెదవులపై పారిజాతంవంటి చిరునవ్వు మెరిసింది.

"వారుణీ! నేను మగనాలిని! ఆపైన నలుగురిలోనూ తలఎత్తుకు తిరుగుతున్నాను. ఇది ఎవరికయినా తెలిస్తే నేనిక జీవించగలనా?"

వారుణి కొంచెం వెటకారంగా చిన్న నవ్వు నవ్వింది.

"అదేమిటమ్మా! మీ రలాగ మాట్లాడతారు! అంతఃపుర పరిచారి కను గదా! నా కామాత్రం మెళుకువలు తెలియవా! మీ కంతటి అప్రతిష్ఠ కలిగితే, మహీపతికి మాత్రం తలవంపు కాదా? విశాఖభట్టారకులకుగాని, మీకు గాని, మా ప్రభువులకు గాని మాటవస్తే నేనిక ప్రాణాలతో బతికి బయటపడగలనా?"

"ఏమో, వారుణీ! నా కిదంతా తలుచుకుంటే చాలా ఆందోళనగా ఉంది! మా వా రింటికి వచ్చేవేళ అయింది. నీ విక త్వరగా వెళ్ళిపో!"

"అలాగే వెడతానమ్మా! మళ్ళీ వచ్చి దర్శనం చేసుకుంటానుగా! దీని కింత తొందరేమి వచ్చింది! మీ రనవసరంగా భయపడకండి! కొంచెం తమాయించుకోండి! అన్నిటికి నే నున్నానుగా! మీకు రవంతయినా మాట రానిస్తానా? అయ్యో! నా కామాత్రం తెలియదా?"

అయితే చంద్రలేఖ దాని కేవిధంగానూ ప్రతిసమాధానం చెప్ప లేదు. వారుణి అది అర్ధాంగీకృతిగా అర్థంచేసుకుని పూలజంగిడి చేతబట్టి తొందర తొందరగా అడుగులు వేసుకుంటూ అక్కడనించి వెళ్ళిపోయింది.

చంద్రలేఖ నెమ్మదిగా లేచి తన వెనక ఉన్న తలుపు తెరుచుకుని లోపల ప్రవేశించబోయింది. ఎదురుగా భర్త విశాఖభట్టారకుడు సాక్షాత్కరించాడు!

"మీ రెప్పుడు వచ్చారు? ఎంతసేపయింది వచ్చి?" రవంత ఆశ్చర్య పడి ఎంతో అమాయికంగా అడిగింది.

"చాలాసేపే అయింది!"

ధుమధుమలాడుతూ విసురుగా సమాధానం చెప్పాడు భట్టారకుడు. చంద్రలేఖ ఏకాగ్రదృష్టితో భర్తముఖం పరిశీలించింది.

"అయితే మీరు మా ఇద్దరి మధ్య నడిచిన సంభాషణ అంతా విన్నారన్నమాట!"

"ఆహా! అంతా ఆమూలాగ్రంగా ఆలకించాను. ఎన్నాళ్ళనుంచి నడుస్తూం దీ వ్యవహారం?"

అతని ముఖం కుంకుమరాశిలా జేవురించింది. బొమముడి తీవ్రంగా మెలికలు తిరిగింది. ఇక ఒక్క క్షణమయినా అక్కడ నిలబడలేక తడబడుతున్న అడుగులతో తటాలున శయ్యాగారంలో ప్రవేశించాడు. చంద్రలేఖ వెనువెంటనే భర్త ననుసరించింది. ఎదురుగా వెళ్ళి కలకల నవ్వింది.

"ఎందుకంత క్రోధం? నేనన్న మాటలన్నీ అక్షరాలా నిజమే అనిపిస్తున్నారా?"

అతని గుండెమీద శిరస్సు వాల్చి ఎంతో ఆప్యాయత ఉట్టిపడుతున్న స్వరంతో ప్రశ్నించింది.

తటాలున ఆత డామె నొకపక్కకు నెట్టివేశాడు. ఆ తోపుతో ఆమె నేలమీద కూలబడింది. అయినా అధైర్యపడక భర్త పాదాలు రెండూ తన బిగికౌగిలితో బంధించింది. ఆమె వేడి వేడి కన్నీటి బిందువులు భట్టారకుని చరణాలపై పడి ధారకట్టి ప్రవహించాయి. మరి కొంతసేపటికతని మనస్సు కొంచెం కరిగింది. ఆమె నల్లన లేవనెత్తాడు.

"అయితే ఈ రహస్య రాయబారం ఎన్నాళ్ళనుంచి కొనసాగుతూంది?"

చంద్రలేఖ కప్పటికి రవంత ఊరట కలిగింది.

వారుణి కొన్నాళ్ళనుంచి తమ భవంతికి వచ్చి పువ్వులమ్ముతున్నా, ఆమె ఆనాడే ఆ ప్రస్తావన తెచ్చి, మహారాజు తనపై మరులుకొని విపరీతమయిన వ్యామోహంలో పడ్డట్టు వెల్లడించి, రాజభవనానికి అతి రహస్యంగా తీసుకుపోగలనని భరవసా ఇచ్చి ప్రోత్సహిస్తున్నట్టు చెప్పింది. అయితే మహారాజంతటివారు ఆ విధంగా దురన్యాయానికి ఒడికట్టుతున్నప్పుడు కాదని వెంటనే తిరస్కరిస్తే కిన్నరపురంలో ఇక తమ ఉనికికే

పెద్ద ముప్పు ఏర్పడగలదని భయపడి, కొంత అర్ధాంగీకారంతో మౌనం వహించినట్టు, తన కంతకన్న వేరే దురుద్దేశ్యం రవంతయినా లేనట్టు చెప్పింది. తనవంటి సాధ్విమీద అనుమానపడడం న్యాయంకాదని డగ్గుత్తికతో మాటిమాటికి ప్రాధేయపడింది. ఆ వ్యవహారం అంతా పూస గుచ్చినట్టు ఏకరువుపెట్టి ఆ పెనుముప్పు ఎలాగయినా తప్పించుకోవాలని అనుకుంటూండగానే భర్త రావడం జరిగిందనికూడా వివరించింది. శీఘ్రమే ఆ ఘోరాపదనుంచి తప్పించుకుని బయటపడే ఉపాయమేదయినా ఆలోచించాలనికూడా తొందరపెట్టింది.

చంద్రలేఖ ఆ విధంగా వివరిస్తున్నప్పుడు భట్టారకుని కిక విశ్వసించక తప్పలేదు. కాని అతని హృదయం లోలోపల వాడివాడి సూదిమొనవంటి చిన్న అనుమానమేదో పట్టుకుని తిరిగి తిరిగి పొడిచి పొడిచి వేధించసాగింది. అదేసమయంలో అతనికి "విశ్వాసో నైవ కర్తవ్యః స్త్రీషు రాజకులేషు చ" అన్న ఆర్యసూక్తి జ్ఞప్తికి వచ్చింది. స్త్రీలఎడల కాని, రాజులఎడల కాని నమ్మిక ఏమాత్రమూ పనికిరాదని దాని అర్థం. ఆ సూక్తి ఇప్పు డక్షరాలా యథార్థమవుతున్నట్టు స్ఫురిస్తూంది.

కిన్నరమహారాజు ఎంతలో ఎంతగా మారిపోయాడు! ఇంతకు మునుపు కాశ్మీర మహారాజులందరు ఆర్యావర్త ధర్మాలన్నీ తుచ తప్పకుండా అనుసరిస్తూ ప్రజలనందరిని తమ కన్నబిడ్డలలా పరిపాలించారు. ఆ మహానీయుల వంశంలో జన్మించిన అతడు రాజ్యానికి వచ్చిన నాలుగయిదు ఏళ్ళ పర్యంతం అదే అనూచన ధర్మపద్ధతి అనుసరించాడు. కాని అంతలోనే దుర్వ్యసనాలకు లోనయి ప్రాచీన కాశ్మీర ప్రభువుల సత్సంప్రదాయాలన్నీ మంటగలిపి వేస్తున్నాడు! రాజులే తలుచుకుంటే ఇక దెబ్బలకు కొదవా! అత డిక ఎంతటి దారుణమయిన అఘాయిత్యానికయినా ఒడిగట్టగలడు! మరి సందేహంలేదు! ఇక ఇప్పుడేమిటి కర్తవ్యం? మహారాజు కిన్నరపురం నిర్మించిన తరవాత తా నక్కడికి వచ్చి చక్కని భవంతి కట్టుకుని స్థిరపడి కొంతకాలంనుంచి ఎంతో సుఖంగా కాలక్షేపం చేస్తున్నాడు. ఇంతలోనే ఎంతటి ఉపద్రవం వచ్చింది!

తాను చెప్పిన వివరాలన్నీ విన్న పిమ్మట చివిమిటికి తనపై పూర్తిగా నమ్మిక కలిగిందని నిశ్చయించి చంద్రలేఖ ప్రసన్నవదనంతో వంట ఇంటివైపు వెళ్ళిపోయింది. ఆమె పాద మంజీరధ్వని అతని శ్రుతి కుహరాలలో మంద్ర మంద్రంగా మారుమోగింది.

చంద్రలేఖ మాటలమీద అతని కింకా గట్టి నమ్మకం కలగలేదు. కాని ఆమె ముఖంపై ఖరిలోమాత్రం ఏవిధమయిన కల్మషమూ లేని అమాయి కత కొట్టవచ్చినట్టు కనిపిస్తూంది! నిజంగా కేవలం తమ ముందు జాగ్రత్త కోసమే చంద్రలేఖ వారుణితో అలాగ మాట్లాడిందా? లేక తన్నే మభ్య పెట్టడానికి ప్రయత్నిస్తూందా? అతడు మహనీయులు, వేదవేదాంగ పారంగతులు అయిన ఉత్తమ విప్రుల వంశంలో జన్మించాడు. ఆమె కాశ్మీరంలో అడవులమ్మట, కొండలమ్మట, గుట్టలమ్మట పడి వ్యవ సాయము, వేట మొదలయిన వృత్తులతో జీవించే నాగవంశీయుల కన్యక. భట్టారకుని తలిదండ్రులు ఆ వివాహాని కే మాత్రమూ అంగీకరించలేదు. అయినా కాదు కూడదని భీష్మించుకుని కూర్చుని విశాఖుడా సుందరిని వివాహం చేసుకుని తీరతానని శరించాడు. ఆ సమయంలో అతని తండ్రి తిరిగి చల్లని పలుకులతో తగిన హితవుపదేశించాడు:

"నాయనా! 'భార్యా రూపవతీ శత్రుః' అని పెద్దలంటారు. ఇల్లాలు రూపవతి అయితే కేవలం శత్రువే! దీనిలో అనుమానం ఏమీలేదు! అదీకాక ఆ నాగవంశీయుల ఆచార వ్యవహారాలేవీ మనకు బొత్తిగా సరి పడవు! నా మాట విను! మన బంధువులలో ఒద్దిక కలిగిన కన్యక లెంతో మంది ఉన్నారు. నా సహాధ్యాయి ఇందుశర్మ తన పెద్దకుమార్తెను నీకిచ్చి వివాహం చెయ్యాలని ఎంతో ఉబలాట పడుతున్నాడు. మాటి మాటికి నా కాళ్ళా వేళ్ళా పడుతున్నాడు! కాస్త నేనన్నమాట పెడ చెవిని పెట్టక ఆ చిన్నదానిని వివాహం చేసుకుని సుఖపడు! ఇది నేను నీ బాగుకోరి చెబుతున్న మాట సుమా! బాగా ఆలోచించుకో!"

అయినా విశాఖభట్టారకు డా సదుపదేశం బొత్తిగా చెవికెక్క నియ్యలేదు. ఆదేసమయంలో అతనికి మొట్టమొదటగా చంద్రలేఖా సంద

ర్శనం నాటి అపూర్వ సంఘటనలన్నీ క్రమక్రమంగా ఒకటొకటే స్మృతి వీథిలో సాక్షాత్కరించాయి.

శ్రీ ఆది శ్రీనగరానికి పది క్రోశాల దూరంలోగల కిన్నరపురంలో పద్మసరోవరం తీరం. గ్రీష్మ ప్రారంభ సమయంలో ఆ పుష్కరిణి చుట్టూ ఉన్న ఉద్యానవనం చిత్రచిత్ర ఫల, పుష్పవృక్షాలతో కలకలలాడుతూంది. విశాఖుడు ఆ పెనుకొలను ఒడ్డున ఒత్తుగా పెరిగిన పసిరిపచ్చికపై సమాసీనుడై ఆ సుందర సర స్తీరంలో ప్రతిఫలించిన పూలకొమ్మల ప్రతిబింబాలు గమనిస్తూ ఎంతో తన్మయుడయ్యాడు. ఆదేసమయంలో ఒక అంచల జంట స్వచ్ఛమయిన నీటిలో ఒయ్యారంగా తేలుతూ ఒడ్డువైపు వస్తూంది. నిశ్చలమయిన ఆ విశాల నిర్మల కాసారంలో ఆ జంట ఆకృతి తెల్లని చిన్నారి పూలపడవలా ప్రతిఫలించింది. మరికొంతసేపటికి ఆ రాయంచల జోడు తీరం చేరి మధుర మంద్రమయిన క్రేంకారా లారంభించింది. పిల్లగాలికి కొమ్మలనుండి రాలిన రంగురంగుల పువ్వు లా మిథునంపై వర్షించాయి.

అదేక్షణంలో ఆతనికి శ్రవణమనోహరమయిన అందెల చిరుమువ్వల సవ్వడి వినిపించింది. మరుక్షణంలో అనతిదూరంలో అచ్చర లెవరో సరస్సులో జలక్రీడ లాడుతున్నట్టు విభ్రాంతి కలిగిస్తున్న ఇద్దరు తరుణీమణుల రమణీయ ప్రతిబింబా లా కొలని నీటిలో తరళించాయి!

విశాఖభట్టారకుడు వెనుదిరిగి చూశాడు. ఆ ఇద్దరి సౌందర్యం గమనించిన అత డలాగే నోట మాటలేక నిర్ఘాంతపడ్డాడు! అయితే వారు కొంచెం శుష్కించినట్టు కనబడ్డారు. కాని అందువల్ల వారి లావణ్యమేమాత్రమూ క్షీణించినట్టు కనబడలేదు. వారిద్దరు ఆ సరోవర తీరంలో ఒత్తుగా అలముకున్న పూలతీగల ఆకులలములు నోటబెట్టుకుని ఆరగిస్తున్నారు! అది విశాఖభట్టారకునికి మరింత ఆశ్చర్యం కలిగించింది! 'ఇంతటి దివ్యసౌందర్యం కేవలం ఆగర్భ శ్రీమంతులయిన మహారాజుల కుటుంబాలలోనే కాని ఇక ఎక్కడా కానరాదు! మరి వీ రిలాగ ఆకులలములకోసం

అలమటిస్తున్నారేమిటి?' అని ఎంతో ఆశ్చర్యపడ్డాడు. విశాఖభట్టారకునికి వారిరువురిమీద దుస్సహమయిన జాలి కలిగింది. నెమ్మదిగా సమీపించి ఆర్ద్రత నిండిన ఆదర గౌరవాలతో అదేవిషయం ప్రశ్నించాడు.

దానిమీద దుర్భర సంకోచంతో వారిలో ఒక తరుణి శిరస్సు వంచి వేసుకుని భట్టారకుని కీ విధంగా తమ కష్టగాథ వెల్లడించింది:

"ఆర్యా! అభిమానవంతుల కష్టసుఖాలెంతెంతటివయినా వారి శల్యాలలోనే జీర్ణించి చిట్టచివరికి అగ్నిజ్వాలలోనే హరించిపోతాయి! అంతేకాని ఎన్నడూ ఆవంతయినా బయటపడవు! అయినా మీవంటి దయార్ద్రహృదయులు ఆప్యాయతతో ప్రశ్నించినప్పుడు మౌనం తమకు అవమానమే కాగలదని భయపడుతున్నాము. నేను ఇరావతిని. నా చెల్లెలు ఈమె—చంద్రలేఖ. మేమిద్దరము నాగవంశీయులలో మహాత్తరులు సుశ్రవసుల కుమార్తెలము. మాకు ధనధాన్యాలకు, భాగ్యభోగాలకు ఆవంతయినా లోపం లేదన్నమాట నిజమే. అయితే మా నాయనగారేదో గొప్ప విషమ పరిస్థితిలో చిక్కుకున్నందువల్ల పుష్కలంగా పంటలు పండి చేలలో కలకలలాడుతున్నా అనుభవించే యోగ్యత లేక మేమీ విధంగా వట్టి నిరుపేదలమై ఆకులలములే ఆహారంగా స్వీకరిస్తున్నాము. ఆ విషమపరిస్థితి ఎటువంటిదో, ఎందువల్ల సంప్రాప్తించిందో మా తండ్రిగారే మీకు తెలియజెయ్యగలరు. అంతేకాని మేమేమి విన్నవించగలము? అదీగాక మావంటి పిన్నవారు అన్యులకీ విషయాలు వక్కాణించరాదు గదా!"

దానిమీద విశాఖభట్టారకునికి వారిద్దరిమీద మరింతగా జాలికలిగింది. తన మూపుమీది మూట విప్పి, ఆవుపెరుగుతో, పుట్టతేనెతో నానిన అటుకులు దోసిళ్ళతో తీసి తామరాకులపై వడ్డించి వారిద్దరికీ అందించాడు. మొట్టమొదట ఎంతగా బలవంతంచేసినా వారా ఆహారం స్వీకరించడానికి అంగీకరించలేదు. కాని విశాఖభట్టారకుని ప్రార్థనవల్ల ఎట్టకేలకు అంగీకరించక తప్పలేదు!

వారిద్దరు తానందించి ఆహారం సుష్ఠుగా భుజించిన తరవాత విశాఖుడు తామరాకు దొన్నెలలో చల్లని తేట నీరందించి సంపూర్ణంగా

సంతృప్తి కలిగించాడు. ఆ పైన ఆ సుందరుల కోరిక తిరస్కరించలేక వారితో కలిసి ప్రయాణమై అరణ్య మధ్యంలో ఉన్న సుశ్రవసుని భవంతి సమీపించాడు.

మార్గమధ్యంలో ఇరావతి భట్టారకునికి తమ కుటుంబ పరిస్థితు లింకా కొన్ని వివరించింది. కాని చంద్రలేఖ నోట ఒక్క మాటయినా వెలువడ లేదు. విశాఖుడు ఆమెను గురించి ప్రశ్నించినప్పుడు ప్రగాఢమయిన లజ్జా భారంతో కుంచించుకుపోయి క్రీగంటి చూపులతో ఒయ్యారంగా అటు ఇటు ఒదిగింది.

సుశ్రవసుడు అతిథిని అనేకవిధాల గౌరవించాడు. కొంతసేపు ఇష్టాగోష్ఠి జరిగినపిమ్మట అపూర్వమయిన ఆ లేమి కేమి కారణమని భట్టారకుడు కొంచెం సంకోచిస్తూ ప్రశ్నించాడు.

సుశ్రవసు డెంతో చిన్నబుచ్చుకున్నాడు. తన భవంతి చుట్టూ చక్కగా పండి ఓరగా ఒరిగిన పంటచేలవైపు చూసి ఉసూరుమని నిట్టూర్చి బాగా సంకోచిస్తూ తన దైన్యగాథ సంగ్రహంగా, ముక్తసరిగా విన్నవించాడు:

“అదిగో, దూరంగా కనిపిస్తున్న తోపులో ఆ కుటీరం చూశారా! అది మహా నిష్ఠాపరుడయిన ఒక మౌని పర్ణశాల. ఆయన రెండు నెలల క్రితమే ఇక్కడికివచ్చి చిన్న కుటీరం నిర్మించుకుని తీవ్ర తపస్సారంభించాడు. వట్టి కందమూల ఫలాలేగాని అతడెప్పుడూ అన్నం ముట్టడం లేదు. ఆయన ఏదో కఠోర దీక్ష అవలంబించడంవల్లనే ఆ విధంగా ఆహారం స్వీకరించడం లేదని నిశ్చయించుకున్నాము. మా పంటపొలాల మధ్య తోటలో మానీశ్వరు లెవరయినా నియమనిష్ఠ అవలంబిస్తే మొట్టమొదట మా కొత్తపంట అన్నం వా రారగిస్తేతప్ప మేము ధాన్యంపంట కోత లారంభించరాదు. ఇది అనూచానంగా వస్తున్న నాగవంశీయుల కుటుంబ సదాచారము. పంట కోతకువచ్చి దరిదరిగా అప్పుడే ఒక పక్షం గడిచి పోయింది. పోనీ, మా పరిస్థితి వారికి ఎరుకపరిచి కొత్తపంట అన్నం రవంత ఆరగించవలసిందని ప్రార్థిద్దామనుకుంటే ఆయన మౌని. ఉలకరు,

పలకరు! అంతేకాదు. మా వైపు కన్నెత్తి అయినా చూడరు. నేను నాలుగయిదు సారులు వారి పర్ణశాలలో ప్రవేశించి మా దురవస్థ విన్నవించాలని ప్రయత్నించాను. కాని రవంతయినా ప్రయోజనం లేక పోయింది! ఆయన మా పొలాలమధ్య పర్ణశాల నిర్మించుకుని తప స్సుపక్రమించడంవల్లనే ఈ ఏడాది ఇంత గొప్పపంట పండిందని ఎంతయినా మురిసిపోయాము. కాని ఏమి ప్రయోజనం!"

విశాఖుడా వృత్తాంతమంతా అత్యంత శ్రద్ధాభక్తులతో ఆలకించాడు. తటాలున అతని కేదో మార్గం స్ఫురించింది. వికసిస్తున్న మందస్మితంతో సుశ్రవసునివైపు చూసి ధైర్యం చెప్పాడు.

"దీనికి మీరేమీ ఆందోళన పడకండి! పంట పాడయిపోక మునుపే నే నాయనచేత కొత్తధాన్యం అన్నం ఆరగింపజేస్తాను. సరిగదా!"

"ఎలాగ ఆరగించేటట్టు చెయ్యగలరు?"

ఆందోళనతో బడలిన సుశ్రవసుని ముఖంపై తటాలున ఆశారేఖ తరళించింది.

"నేనాయనకు రాత్రింబగళ్ళు దేవనిగా శుశ్రూష చేసి ఏదోవిధంగా మీ కార్యం సాధిస్తాను. మీరింక ఆందోళన పడకండి!"

సుశ్రవసు డెంతో సంతోషించాడు. ఆనాటి సాయంకాలమే విశాఖభట్టారకుడా మౌని పర్ణశాల చేరుకున్నాడు. అపూర్వమైన భక్తిశ్రద్ధలతో పరిచర్య లారంభించాడు. కాని ఆయన ఆ తటస్థ దృష్టిలో మార్పేమీ కనబడలేదు. అయినా విశాఖభట్టారకుడు మరింత పట్టుదలతో పరిచర్య కొనసాగించాడు. ఒకనాడు స్వయంగా తానే కొంత పంట కోసి, నూర్చిన ధాన్యం దంచి, ఆ బియ్యంతో అన్నం తయారుచేసి మిక్కిలి రుచిగా వండిన కూరలతోబాటు విస్తరిలో వడ్డించి ఆ మౌని ముందుంచాడు. అయితే ఆయన దాని వైపైనా కన్నెత్తి చూడలేదు! అయినా విశాఖుని శ్రద్ధ రవంతయినా సడలలేదు.

అలాగ నాలుగయిదు రోజులు గడిచాయి. ఆ మరునాడు విశాఖుడు అదేప్రకారంగా మౌని ఎదుట అన్నం వడ్డించాడు. ఆయనముఖంపై

అపూర్వమయిన మందహాసం మొలకెత్తింది. ఎంతో ఆప్యాయతతో ఆ అన్నం ఆరగించి తన మౌనవ్రతం విడిచి, ప్రేమాదరాలతో భట్టారకుని కటాక్షించి "అభీష్టావాప్తిరస్తు!" అని ఆశీర్వదించాడు.

అప్పటినుంచి సుశ్రవసుని ఘోరాపద పూర్తిగా తొలగిపోయింది. కాయగూరలతో, కందమూలాలతో కడుపులు నింపుకుంటున్న అతని కుటుంబంలోని వారందరూ పంచభక్ష్యాన్నా లారగించి అతిథిని "అన్నదాతః సుఖీ భవ!" అని ఆశీర్వదించారు.

సుశ్రవసుని ముఖం పరిపూర్ణ కృతజ్ఞతతో తొణికిసలాడింది.

"భట్టారకా! మీ ఋణం నే నెన్ని జన్మలెత్తినా తీర్చుకోలేను. అయినా యథాశక్తిగా మీ కేదయినా అమూల్యమయినది బహూకరించా లని నిర్ణయించుకున్నాను. కరుణించి అటువంటి కోరికతో నన్ననుగ్ర హించండి!"

ఆ సంభాషణ అంతా తలుపు వెనక నిలుచున్న చంద్రలేఖ కెంతో ఆసక్తి కలిగించింది.

ఆమె ఓరకంట విశాఖభట్టారకునివైపు చూసి తన చీరచెరగు నెమ్మదిగా నులుముతూ ముడివేస్తూ తలవంచుకుని నిలుచున్నది. చంద్రలేఖ అతనిపై ఇనుమిక్కిలిగా మరులుకొన్నదని సుశ్రవసు డంతకు మునుపే గ్రహించుకున్నాడు. కాని విశాఖభట్టారకుని వంటి ఉత్తమకులీను డామెను స్వీకరిస్తాడో, స్వీకరించడో అని కొంచెం సందేహం కలిగింది. అయినా నెమ్మదిగా నీళ్ళు నమిలాడు. "పెద్దపిల్ల ఇరావతి కింతకుమునుపే ఒక మంచి సంబంధం స్థిరపడింది. చంద్రలేఖ వట్టి అమాయికురాలు. దీన్ని వివాహం విషయమై నేనెంతోకాలం నుంచి మథన పడుతున్నాను. నా కింతకంటె వేరెవ్వరూ లేరు. ఆ చిన్నారిని మీరు పత్నిగా స్వీకరిస్తే నా కీ లోకంలో మరి కోరుకోవలసినదేమీ లేదు."

కాశ్మీరంలో అలనాడు ఆయా వర్ణాల మధ్య వివాహాచారాలు అంతగా బిర్రబిగుసుకుపోలేదు. కాని కులీన బ్రాహ్మణులు నాగజాతి కన్యకలను వివాహ మాడడం చాలా అరుదు. అయినా విశాఖు డామె

ఎడల ఏర్పడిన అనురాగం బలిమివల్ల వెంటనే అంగీకరించాడు. అతని తలిదండ్రులు దాని కంగీకరించకపోయినా, ఏది ఏమయినా సరే అని మరి కొన్నాళ్ళలోనే చంద్రలేఖను వివాహం చేసుకున్నాడు. సుశ్రవసుడు పరమానందభరితుడయి తన కుమార్తెకు అరణంకింద ధనధాన్యాలు కోకొల్లలుగా బహూకరించాడు.

తనవంటి నిరుపేదకు తలవనితలంపుగా లభించిన ఆ సంపత్తితో విశాఖభట్టారకుడు ఒక సంవత్సరం క్రితమే కిన్నరపురంలో చక్కని పూల తోట మధ్య ఒక సుందరభవనం నిర్మించుకుని ఏ లోపము, శోకు, చింత లేకుండా హాయిగా కాలక్షేపం చేస్తున్నాడు. అంతలోనే నడినెత్తిమీద పెద్ద పిడుగు పడినట్టు ఈ ఘోరాపద సంభవించింది!

ఇక ఇప్పుడేమిటి దారి? చంద్రలేఖ నిజంగా వారుణిని మోసగించడానికే అలాగ అంటీ అంటనట్టు మాట్లాడిందా? లేక తన కళ్ళు కప్పి వెయ్యాలని అలాగ కాళ్లా వేళ్లా పడి బ్రతిమాలుకున్నదా? స్త్రీల హృదయాల లోతులు గ్రహించడంలో గొప్ప గొప్ప లోకజ్ఞులే పొరబడుతూంటారు! ఒకవేళ చంద్రలేఖకే మహారాజు మీదికి మనసు తిరిగితే ఇక చెయ్యగలిగిన దేమీ లేదు!

అలాగాక ఆమె తనతో సంప్రతించడానికని వారుణిని తియ్య తియ్యని మాటలతో జోకొట్టి ఉంటే—ఈ రాయబారం ఇలాగ ఎంత కాలం కొనసాగుతుంది? మహారాజు ఎన్నాళ్ళని ఓరిమి వహిస్తారు? నాలుగయిదు దివసాలు గడిచిన తరవాత మరి వేచిఉండలేక, అకస్మాత్తుగా ఆశ్వికులను కొందరిని పంపించి, తన భవంతిపై దాడి జరిపించి, బలాత్కారంగా చంద్రలేఖ నపహరించుకుపోయి అంతఃపురానికి చేర్పిస్తే తానేమి చెయ్యగలడు? అయ్యో! హతవిధీ! తనవంటి సామాన్య సంసారిమీద ఎంతటి దారుణ విపత్తు విరుచుకుపడబోతున్నది! చంద్రలేఖ అంగీకరించినా, అంగీకరించకపోయినా కిన్నరభూపతి ఆమె నంతఃపురానికి చేర్చి తీరతాడు. ఈ దురదృష్టవేళలో అభయం ఇచ్చి, ఆదుకుని కాపాడేవా రెవ్వరున్నారు? వెంటనే అరణ్య మధ్యంలో ఉన్న మామగారి కీ వార్త తెలియజేస్తే? అంతటి ఆటవికుల బలగం ఉన్న ఆయన ఆపత్సమయంలో

అడ్డుకుని కాపాడలేకపోతారా? కాని మహారాజు బలిమిముందు మామగారి శక్తిసామర్థ్యా లెంతటివి? ఆయనగారుమాత్రం కోరి బలవద్విరోధం కొని తెచ్చుకుంటారా? ఒకవేళ సాహసిస్తేమాత్రం మహీపతి కెదురొడ్డి నిలబడ గలరా? ఇంతకూ చంద్రలేఖ లోలోపలి అభిప్రాయమేమో!మహారాజంతటి సౌందర్యశాలి - ఐశ్వర్యవంతుడు - కాశ్మీరదేశ ప్రభువు తానై వలచి వరించబోతున్నప్పుడు ఎంతటి శీలవతి అయినా మనస్సు నిలవరించుకో గలదా? అయితే చంద్రలేఖ అంతటి దారుణానికి ఒడిగట్టగలదా?

ఆవిధమయిన పిచ్చుకల గూటి అల్లికవంటి గజిబిజి ఆలోచనలతో భట్టారకుడు వట్టి మతిలేని మనిషిలా మారిపోయాడు! ఆ ఘోర పరిస్థితి తలుచుకుని చంద్రలేఖ కూడా చాలా భయపడినట్టు కనబడింది. వెను వెంటనే తన తండ్రికీ వృత్తాంతం తెలియజేయించవలసిందని భర్తకొక చక్కని సలహా ఇచ్చింది. దానితో భట్టారకుని ఆందోళన కొంత ఉపశ మించింది. కాని ఏ క్షణంలో తనమీద ఎటువంటి క్రూరాపద విరుచుకు పడగలదో అని అత డనుక్షణమూ వణికిపోయాడు.

# 4

మరునాడు వారుణి యథాప్రకారంగా భట్టారకుని భవంతికి వచ్చింది.

చంద్రలేఖ మరి గత్యంతరం కానలేక ఆమెతో కాశ్మీరాధిపతి కోరిక కనుగుణంగానే ప్రసంగించింది. కాని భర్త కీ విషయం కొంచెమయినా తెలియకుండా వ్యవహరిస్తే తప్ప, తన కాబోరు దక్కదని నీళ్లు నమిలింది. ఆయన ఎప్పుడయినా ఇంటలేని సమయం కనిపెట్టి రాజభవంతికి రాగలనన్నీ, అంతవరకు కిన్నరభూపతి ఓరిమి వహించక తప్పదని బ్రతిమాలుకున్నది. దానితో వారుణికి పచ్చి వెలక్కాయ గొంతులో పడ్డట్టయింది. అటు మహారాజు చంద్రలేఖ రాక ఎప్పుడెప్పుడని మాటిమాటికి నిలవరిస్తున్నారు! ఇటు ఈమె భర్త ఎప్పుడయినా ఏదో వ్యవహారంమీద గ్రామాంతరం వెళ్ళినప్పుడు తప్ప, మహారాజభవంతిలో అడుగు పెట్టజాలనని నిష్కర్షగా చెప్పివేసింది.

వారుణికేమీ పాలుపోలేదు. చంద్రలేఖ అన్న మాటలన్నీ యథాతథంగా కిన్నరమహీపతి చెవిని వేసింది. దానినిబట్టి ఆ సుందరి కా వ్యవహారం అంతగా రుచించలేదని మహారాజు ఇట్టే పసికట్టివేశాడు. కనుకనే భర్త గ్రామాంతరం పోవాలని ఒక సాకుచెప్పి చంద్రలేఖ తప్పించుకుంటున్నదని కూడా అనుమానించాడు. అదే మాట వారుణితో అన్నాడు. ఆమె కిక తన ఏలిక అభిప్రాయంతో ఏకీభవించక తప్పలేదు.

అలాగలాగ మరికొన్నాళ్ళు గడిచిన పిమ్మట ఒకనాటి ఉదయం కాశ్మీర మంత్రి శూరకేసరి తలవని తలంపుగా అకస్మాత్తుగా విశాఖ భట్టారకుని భవంతికి విజయం చేశాడు. సూదులలాగ సునిశితాలయిన పిల్లి కళ్ళవంటి కన్నులతో, గాలికే అల్లలాడిపోగలదనిపించే సన్నని రివటవంటి శరీరంతో, నిలువునా యోధ వేషంతో విజయం చేస్తున్న ఆ మంత్రి వైఖరి గమనించగానే భట్టారకుని కేదో పెను ప్రళయమే విరుచుకుపడ నున్నదని స్ఫురించింది. అయినా ఆ భావమేమీ పైకి వ్యక్తం కానియ్యక అతడెంతో మర్యాదతో మంత్రిని తన భవంతి కాహ్వానించి మహారాజ మర్యాదతో గౌరవించాడు. కొంతసేపు ఇష్టాగోష్ఠి కొనసాగిన పిమ్మట శూరకేసరి నెమ్మది నెమ్మదిగా కిన్నర మహీపతి లోలోపలి కోరిక బయటపెట్టాడు. దానితో భట్టారకుని దురాగ్రహం భగ్గుమని మండిపడింది. అయినా అతి కష్టంమీద ఆ క్రోధం నిగ్రహించుకుని సూటిగా ప్రశ్నించాడు.

"ఆర్యావర్తధర్మం కాశ్మీరంలో అంతటా నాలుగు పాదాలమీద నడిపించే మీరే ఇటువంటి దురన్యాయ్య ప్రసంగం ప్రారంభించవచ్చునా? మహారాజంతటివారి కిదేమి దురాలోచన?"

ఆ ప్రశ్నమీద శూరకేసరి కలకల నవ్వాడు.

"విశాఖా! సిరిరా మోకాలొడ్డుతున్నావు! మహారాజంతటివారికి నీమీద పరమానుగ్రహం కలిగింది! దేశంలో రత్నాల కన్నింటికి అధీశ్వరులు వారే కదా! నీ దగ్గిర ఉన్నది స్త్రీరత్నం! తమ మణి వారు స్వాయత్తం చేసుకోదలుచుకుంటే దీనిలో విడ్డూర మేమిటి? అన్యాయ మేమిటి?"

భట్టారకుడు దాని కేవిధంగానూ ప్రతి సమాధానం చెప్పలేదు. ఎంతగా నిగ్రహించుకున్నా లోలోపల చెలరేగుతున్న క్రోధాగ్ని జ్వాల వల్ల అతని ముఖం రవంత జేవురించింది!

అంతలోనే శూరకేసరి తిరిగి అందుకున్నాడు:

"వారి కోరిక అంగీకరించావంటే సాంప్రదాయికులయిన ఉత్తమ బ్రాహ్మణుల కుటుంబంలోనుంచి నీ వింకొక చక్కని కన్యకను వెను వెంటనే వివాహం చేసుకోవచ్చును! ఇంతేకాదు. వారి కటాక్షం ప్రస రిస్తే నీ భవంతి కంతటికి బంగారు పూత పూయించుకోవచ్చును. తెలిసిందా?"

అయినా విశాఖు డేమాత్రమూ చలించలేదు. శూరకేసరి తన పాచిక పారలేదని గ్రహించుకున్నాడు. ఇక సామదానాలవల్ల ప్రయోజనం లేదని పసికట్టివేశాడు. రోషావేశంతో చివాలున లేచి నిలుచున్నాడు.

"విశాఖా! నీ పత్ని మహారాజు అభ్యర్థన విని ఎంతో ఉత్సాహ పడిందట! ఇందుచేత నీ విక అంగీకరించినా, అంగీకరించకపోయినా ఒక్కటే! రేపు తెల్లవారేలోగా నీ వంగీకరిస్తే గొప్ప అదృష్టవంతుడవన్న మాట! లేకపోతే మహారాజు బలాత్కారంగా నయినా చంద్రలేఖను తమ అంతఃపురానికి చేర్పించి తీరగలరు! జాగ్రత్తగా ఆలోచించుకో! నేను నీ బాగు కోరి హితవు ఉపదేశిస్తున్నాను. నా మాట కాదనకు!"

అయినా విశాఖు డెక్కడా చెక్కు చెదరలేదు. తనవంటి మహా నీయుని మాట అతడు వట్టి గడ్డిపరకకింద జమకట్టి కొట్టి పారవేస్తున్నా డని శూరకేసరి గ్రహించుకున్నాడు. ఆ అవమానం భరించలేక ఆవేశంతో గజగజ వణికిపోతూ మరుక్షణంలోనే అక్కడినుంచి దురుసుగా వెళ్ళి పోయాడు!

మరునాడు తెల్లవారుజామునే విశాఖ భట్టారకుని భవంతి పరిసరం అంతా కాశ్మీర రాజసైన్యంలో ప్రముఖాశ్వికుల ఉత్తమాశ్వాల పాదఘట్టనాలతో భోరుమని ప్రతిధ్వనించింది. ఆ గుర్రాల కాలి నాడాల తాకిడులవల్ల బయలువెడలిన విస్ఫులింగాలు ఉవ్వెత్తుగా లేచి మిణుగురులులా నలువైపులా వ్యాపించాయి! అశ్వికుల వెంట వచ్చిన శూరకేసరి భట్టారకుని భవంతి ప్రధానద్వారంపై బీగం చూచీ చూడగానే 'అతడు భార్య చంద్రలేఖతోబాటు ఎక్కడి కయినా పారిపోయి ఉంటా'డని గ్రహించుకున్నాడు. దానితో అతనికి ముచ్చెమటలు పోశాయి! తక్షణమే తనవెంట ఉన్న అశ్వికులను కొంత మందిని నలువైపులా పరుగులు పెట్టించాడు. కాని ఎక్కడా భట్టారక దంపతుల జాడ కానరాలేదు! బహుశః అత డరణ్యం మధ్యలో మామ ఇంట తలదాచుకుని ఉండవచ్చునని అనుమానించాడు. దానితో తన ప్రయత్నం అంతా పూర్తిగా వ్యర్థమయిపోయిందని తోచింది. అందుచేత భగ్గుమని మండిపడిన మహారాజువల్ల తన మంత్రిపదవికే మోసం కలగ వచ్చునని ఆందోళనపడ్డాడు. వెనువెంటనే బీగం బద్దలుకొట్టి విశాఖుని సంపత్తి అంతా స్వాధీనం చేసుకోవలసిందని సైనికుల కాజ్ఞాపించాడు. అది జరిగిన వెంటనే ఆ భవంతికి నిప్పంటించి నేలమట్టం చెయ్యవలసిందని గొంతెత్తి హుంకరించాడు!

బళ్ళున తెల్లవారేసరికి విశాఖుని సుందర భవనం యావత్తూ కేవలం భస్మరాశిగా మారిపోయింది! అంతకు పూర్వమే అశ్వికులతో మంత్రి మహారాజ సన్నిధికి మరలిపోయాడు. అయినా కిన్నరభూపతి హృదయంలో విశాఖుని ఎడల ప్రతీకారవాంఛ అణువంతయినా అడగారిపోలేదు. కిన్నర పురంలో ఇరుగుపొరుగున ఉన్న వా రావిధంగా అకస్మాత్తుగా అశ్విక లక్కడికి రావడానికీ, తెల్లవారకమునుపే విశాఖుని భవంతి నామమాత్రా వశిష్టమై పోవడానికి గల అసలు కారణమేమో తెలియక అనేకవిధాల మథనపడ్డారు.

కాని అరణ్యమధ్యంలో నివసిస్తున్న సుశ్రవసునికి దాని యథార్థ కారణం అంతా ఆమూలాగ్రంగా అవగత మయింది. కుమార్తెతోబాటు అల్లుడు క్షేమంగా తన ఇంటికి రాబోతున్నందుకు అత డెంతయినా ఆనందించాడు. వా రర్ధరాత్రివేళ అమూల్యములయిన కొన్ని రతనాలతో, నగలతో అతిరహస్యంగా పారిపోయిరావడానికి మునుపే అత డెన్నో విధాల సాయపడ్డాడు. కాని అంత మనోహర సౌధం ఆవిధంగా నేల మట్టం అయిపోయినందుకు అత డాజ్యం గుమ్మరించిన అగ్ని హోత్ర జ్వాలలా ప్రజ్వలించాడు.

నిజానికి అరణ్యమధ్యంలో నివసించే నాగజాతి ప్రముఖులు కాశ్మీర రాజన్యుల కేదో కొంత కప్పం చెల్లించి సర్వస్వతంత్రంగా సంచరించే సామంతులే! అందుచేత అతనికి కిన్నరమహీపతి ఎడల కొంత భయము, భక్తి, గౌరవము లేకపోలేదు! కాని ఆ మహారాజు అంతటి దురన్యాయానికి సిద్ధపడినప్పుడు అత డిక ఓరిమి వహించలేకపోయాడు.

తన కత్యంత విశ్వసనీయులయిన నాగప్రముఖులను కొందరిని పిలిచి, కిన్నరమహారాజు భవనం యావత్తూ భస్మీపటలం చెయ్యనిదే మరి తన ముఖం చూడవద్దని, తన కంతకన్న కోరుకోవలసినదేదీ లేదని తీవ్ర స్వరంతో ఎలుగెత్తి గర్జించాడు.

విశాఖుని భవనం దగ్ధమయిన మూడవనాటి రాత్రే నాగయోధులు కొందరు అతిరహస్యంగా కిన్నరపురం ప్రవేశించి మహారాజ సౌధానికే కాక రాచనగరు కంతటికీ నిప్పంటించారు. వారెవ్వరూ కిన్నరపుర వాస్తవ్యుల కెవ్వరికీ కొంచెమయినా అపకారం తలపెట్టలేదు. కాని ఆవేళ రాత్రి విపరీతంగా ఓరుగాలి చెలరేగడంవల్ల మంట లన్నివైపులా వ్యాపించాయి. మొత్తంమీద కిన్నరపురం అంతా భీకరచ్ఛటచ్ఛటా ధ్వనులతో కేవలం దగ్ధభూళిగా మారిపోయింది! కిన్నరమహీపతితోబాటు రాజ కుటుంబంలోనివా రనేకు లా ఘోరాగ్ని జ్వాలల కాహుతి అయి మరణిం

చారు. ఆ భయంకరార్ధరాత్రివేళ ఆకాశం అంటుతున్న ఆ పావక జ్వాల లన్నీ ప్రతిఫలించిన వితస్తానది సుదీర్ఘమయిన గొప్ప బంగారు కరవాలంలా మెరిసింది! అన్నివైపులనుండి వెలువడి ఆ నగరవాస్తవ్యుల ఘోర హాహా కారాలతో భూనభోంతరాళం యావత్తూ భోరుమని మారుమోగి దద్దరిల్లింది.

## 6

ఆ విధంగా ఆ మహానగరంతోబాటు రాజకుటుంబం అంతా ఘోర దహనకీలల కాహుతి అయినా కిన్నర భూజాని కుమారుడు సిద్ధమహీపతి దాది తన ప్రాణాపాయమయినా లక్ష్యపెట్టక సంరక్షించినందువల్ల సురక్షితుడై బ్రతికి బయటపడ్డాడు. క్రమక్రమంగా అతడు పెరిగి పెద్ద వాడయి పట్టాభిషిక్తుడయి కాశ్మీర రాజ్య పరిపాలనం ప్రారంభించాడు. ఒకనాడు వినోదార్థమై వట్టి మొండిగోడలతో పాడుపడి ఉన్న కిన్నర పురికి వాహ్యాళికి పోయి, ఆ విధంగా ఆ మహానగరం ఘోరాగ్నిజ్వాలల కాహుతి అయి పాడుపడిపోవడాని కేమి కారణమని తన కభిమాన పాత్రుడయిన ఒక మంత్రిని ప్రశ్నించాడు.

అతడు చంద్రలేఖ గాధ అంతా, యధాతథంగా, అచ్చంగా కళ్ళకు కట్టినట్టు అభివర్ణించాడు. ప్రత్యేకించి ఆ ఘోర పావకకీలలలో పడి స్త్రీలు, బాలురు, వృద్ధులతోబాటు వేలకొలది పౌరులు భయంకర హాహా కారాలతో పరమపదించిన బీభత్సం విస్తరించి వర్ణించి ఉసూరుమని నిట్టూర్చాడు.

"విపరీతమైన ప్రేమావేశంవల్లనే మీ జనకులు కిన్నర మహా రాజావిధంగా దారుణ దహనకీలల కాహుతి అయి స్వర్గస్థులయినారు!" అని ముగించి దానికి తన తీవ్ర మనోవ్యథ వెల్లడించాడు.

సిద్ధమహీపతి కా గాథలోగల పరమరహస్యం నాటివరకు తెలి

యనే తెలియదు. రాజబంధువులు కొందర తనికి ఆ అగ్నిప్రళయం ప్రమాదవశాత్తూ సంఘటిల్లినదని మాత్రమే పేర్కొన్నారు. అయితే, మంత్రి, తన జనకులు "విపరీత ప్రేమావేశంవల్ల అంతటి ఘోరాపదలో చిక్కుకున్నా"రని చెప్పినప్పు డతనికి పట్టరాని ఆశ్చర్యము, తండ్రి దుశ్చర్యయెడల ప్రగాఢ పశ్చాత్తాపము, దుస్సహమయిన విషాదము కలిగాయి.

"అయ్యో! 'విపరీతమైన వ్యామోహమే ప్రేమావేశ' మని లోకంలో అందరూ భ్రమిస్తున్నారు! ఆహా, ఎంతటి విచిత్రం!" అని మిక్కిలి ఆశ్చర్య పడ్డాడు.

అతనికి వింశతి వర్షాలు నిండగానే పట్టాభిషేకం జరిపించాలన్న తహతహతో రాజ బంధువులు ఒక సామంత ప్రభువు కుమార్తె ప్రభావతి నిచ్చి పరిణయ మహోత్సవం జరిపించారు. కాని వివాహమయిన నాలు గయిదు మాసాలలోనే విషజ్వరం సోకి అకస్మాత్తుగా ఆ రాణి మర ణించింది. ప్రాయం వచ్చినప్పటి నుంచి ఆమెనే చేపట్టాలని సిద్ధ డెం తయినా ఉవ్విళ్ళూరాడు. వివాహమయిన పిమ్మట ఆ అందాల పెన్నిధి ఎప్పు డేవిధంగా తన్ను వీడిపోగలదో అని ఎన్నెన్నో విధాల అనుక్షణము ఆరాట పడ్డాడు! చిట్టచివరికి దుర్విధి విధానంవల్ల అనుకున్నదంతా జరిగి పోయింది! అప్పటినించి అతనిని నిరంతరమయిన గభీరశోకం పీడని క్రీ నీడలా వెన్నాడింది. ఆ శోకంలోనే అతనికి ప్రేమస్వరూపం సమగ్రంగా పండువెన్నెలలా భాసించింది. అత డా నాటి నుంచి తన ప్రజా పరి పాలన ఆవంతయినా అలక్ష్యం చెయ్యలేదు. మరింత అప్రమత్తతతో ప్రజల నందరిని నిత్య జాగరూకతతో పరిపాలించాడు.

ఇరవై సంవత్సరాల ప్రాయంలో అనూచాన మయిన కాశ్మీర రాజ వంశం విచ్ఛిన్నమయి పోగల దేమో అన్న భీతితో రాజ

బంధువు లతనిని తిరిగి పరిణయమాడవలసిందని ప్రతిదినము చెవిలో ఇల్లు కట్టుకుని పోరి శతవిధాల నిర్బంధించారు. కాని దాని కాతడంగీకరించలేదు. అలాగ కొన్ని నెలలు గడిచినా సిద్ధభూపతి వారి నాప్రసంగం మరి తనవద్ద తీసుకురానియ్యలేదు. తన జనని నిర్బంధంవల్ల మరికొంత కాలాని కతనికి వేరొక కాశ్మీర సామంత కన్యను పరిణయమాడక తప్పలేదు!

అయినా నిత్యము ప్రభావతీశోకం అంతూ, దరీ లేని పెనుకడలిలా అతనిని వెన్నాడింది. ఆ దుర్భర గభీర శోకంలోనే అతనికి ప్రేమ స్వరూపం సమగ్రంగా విశాల నిర్మల వినీలాకాశంలా సాక్షాత్కరించింది. కనుకనే మంత్రి ఆనాడు తన తండ్రి విపరీత ప్రేమావేశంవల్ల ఘోరాగ్ని కీలల కాహుతి అయ్యారని వివరించినప్పు డతని పెదవులపై గభీర విషాదంతో మేళవించిన చిరునవ్వు తరళించింది. 'విజ్ఞులయిన విద్వాంసులే ప్రేమపదం తేలికగా వట్టి వ్యతిరేకార్థంలో వ్యవహరిస్తారు! కాని వారందరు ఎంతటి అజ్ఞులు!" అని నవ్వుకున్నాడు.

ఆవిధంగా లోతయిన అవగాహనవల్లనే, నిరంతర శోకంవల్ల ఏర్పడిన గభీర కరుణవల్లనే అతనికి తన ప్రజలందరిఎడల నిష్పక్షపాతమయిన ఆర్ద్రత కలిగింది. అప్పటినించి వారినందరిని మరింత వివేకంతో, మెళుకువతో పరిపాలించాడు.

తన జనకుని విపరీత వ్యామోహజ్వాలవల్ల సంపత్తి సమస్తము పోగొట్టుకొని అడవులపాలయిన చంద్రలేఖా విశాఖుల నిరువురిని తిరిగి సకుటుంబంగా కాశ్మీర రాజధాని శ్రీనగరి కాహ్వానించి, పూర్వం కన్న మనోహరమయిన మందిరమొకటి నిర్మింపజేయించి వారి కది బహూకరించాడు. అంతేకాదు. సదా వారి నిరువురిని తన కన్న తల్లిదండ్రు లన్నట్టు గౌరవించాడు. నాగమహత్తరుడు సుశ్రవసు డాతని సౌశీల్యాని కెంతో సంతోషించి మిగిలిన నాగనాయకులతోబాటు సర్వదా కాశ్మీర ప్రభువు

కనుసన్నలలో మసులుకున్నాడు. అనాదు సిద్ధమహీపతి అపూర్వ ధర్మ పరిపాలనం కాశ్మీర ప్రజ జేజే లందుకున్నది.

నవనవ యౌవనంతో మిసమిసలాడుతున్న ఆ కాశ్మీరాధిపతికి అప్పుడప్పుడు మహనీయ రాజభోగాలపై తీవ్ర లాలస ప్రాదుర్భవించకపోలేదు. కాని అదే సమయంలో అతనికి అగ్నిజ్వాలలలో ఆహుతి అయిపోతున్న కిన్నరపుర ప్రజల హాహాకారం శ్రుతికుహరాలలో భోరుమని మారుమోగింది. ఆ పావక ప్రళయాని కేకైకకారణమయిన జనకుని విపరీత వ్యామోహజ్వాల దారుణ పరిణామం కళ్ళకు కట్టినట్టు విస్పష్టంగా గోచరించింది! మరుక్షణంలో ఆతని తీవ్ర భోగలాలసా సంకల్పం మటుమాయమయింది. ఆహా! మానవులు వేర్వేరు భీకర జీవిత వ్యామోహాలలోపడి అనాలోచితంగా, అన్యాయంగా ఎంతెంతటి దుష్కార్యా లాచరిస్తారు!' 'అయ్యో! అచ్ఛమయిన ప్రేముడి ఈ లోకంలో ఎక్కడ ఉన్నది!' అని పట్టరాని ఆశ్చర్యంతో నిశ్చేష్టుడయిపోయేవాడు. సదా సన్మార్గమే అనుసరించేవాడు.

కనక నే, నేటికీ, ఆతని చల్లని ఏలుబడి కాశ్మీర దేశం పవిత్ర చరిత్రలో, చారణుల గీతికలలో, ప్రజానీకం నోళ్ళలో వ్యాపించిన గాథలలో పరమరమణీయమై నిలిచింది!

సమాప్తం